వేగుజుక్క గ్రంథమాల:—

# శ్రీ తులసీరామాయణము

## పట్టాభిషేకము

(నిర్వచనము)

విజయ విజయ, విచిత్ర వీరబొబ్బిలి, ప్రతిజ్ఞాచాణక్య, అభినవ భర్తృహరి, శృంగారసంధ్య, రసపుత్ర జీవనసంధ్య, శ్రీరామ వైరాగ్య, గాంధిశతకాది బహుగ్రంథకర్తలగు

భాగవతుల నృసింహశర్మగారిచే

ప్రణీతము.

*Printed and Published by:—*

**Bh. N. SARMA,**

*Proprietor,*

SRI RAMA PRINTING WORKS,
&
VEGU-JUKKA GRANTHAMALA.
BERHAMPUR (*Ganjam*)

1ST EDITION
1938



☞ For copies apply to the Publisher,

విలువ రు 2–0–0

ఖర్చులు కొనువారే భరించవలెను.

# కృతజ్ఞత

ఈక్రిందఁ జేర్కొనఁబడిన భక్తవరుల తోడ్పాటుననే అయోధ్యలోనున్న శ్రీరాముని దర్శించి గ్రంథము సమర్పింపఁ గలిగితిని—శ్రీరాముని కరుణా కటాక్షమునకు సర్హులైన యీ భక్తవరులకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

తోడ్పడిన భక్తవరుల నామధేయములు:—

శ్రీయుత మూల వెంకటరంగయ్యగారు, హాస్పేట, బళ్ళారి.

2 ,, శ్రీ రంగం వేంకట యజ్ఞనారాయణ గారు, రాయగడా.

3 ,, వి. రామచంద్రి రావుగారు, ఉేకుమెట్ల!

4 ,, వి. ఎస్. శేషయ్యరు గారు, రాజాం.

5 ,, టి. రాజారామ్ గారు, నైజామాబాద్.

6 ,, ఎస్.ఏ.టి.సింగరాచార్యులయ్యవారలుంగారు, మదరాసు

7 ,, డి. వెంకటనరసయ్య గారు, అసిఫాబాద్.

8 ,, శ్రీ వేంకటేశ్వర గ్రంథాలయం, పెద్దకవకుంట్ల

9 ,, పి నీలాద్రిరాజు గారు, మొఖాసాదారు, కోరిల్లవలస

10 ,, ఏ. నారాయణ స్వామి గారు, అక్యాబ్.

11 ,, కొంచాడ కృష్ణమూర్తి గారు, సోంపేట.

12 ,, ఏ. వి. ఎస్. మూర్తి గారు, బల్లిగుడా.

13 ,, ఎమ్. రామబ్రహ్మమ్ నాయుఁడుగారు, బందర్.

14 ,, సి. హెచ్. కృష్ణమూర్తి గారు, కోరాపుట్టి.

15 ,, పి, రామారావు గారు, జమ్మెక్కపూరు.

16 ,, పాచిపెంట లక్ష్మునాయుఁడు గారు, పాచిపెంట

17 ,, కంసాని నాగభూషణంగారు, మూలుర్వారు.

18 ,, బొమ్మిసెట్టి లక్ష్మీనరసింహాంగారు, నెల్లూరు,

19 ,, వి. రామదాసు గారు. జయపూర్.

20 ,, సి. వీర వెంకయ్యగారు, గుడారి

21 ,, వేలూరి వేణుగోపాల మూర్తి గారు, భీమవరం.

22 ,, వి. వి. నరసింహారావు గారు, గుంటకల్.
23 ,, భోగెలవేణుగోపాలపట్నాయిక్ మహాశయోగారు, రాయగడ
24 ,, జగ్గాం నీలాచలంగారు, }
25 ,, జెహారా గుంపస్వామి గారు. } రాయగడా
26 ,, లాడి కృష్ణమూర్తి గారు. }
27 ,, కింతలి చిన జగన్నాథం గారు, రాయగడా.
28 ,, పట్టాం అప్పలస్వామి గారు, రాయగడా.
29 ,, ఏమ్. వెంకట రామయ్యగారు, }
కార్యదర్శి, ఆంధ్రగ్రంథాలయం } కర్నూలు
30 ,, కె. చిదంబరంగారు, వకీలు, సత్తెనపల్లి.
31 ,, రాడా లింగంనాయుడుగారు, చిలాడపేట, ఉర్లాం
32 ,, సై. సింహాచలంనాయుడు గారు, బందలుప్పి.
33 ,, కాశీమహాంతి నరసింహారావుగారు, నవరంగపురం.
34 ,, ముమ్మడివరపు సత్తిరాజు గారు }
35 ,, రామకృష్ణశతపత్రి గారు } అడ్డతీగెల
36 ,, బి. శంకర శర్మగారు, కె. నాగులాపురం.
37 ,, శ్రీమతి చాగంటి జానకమ్మ గారు, పైడిపాల.
38 ,, మామిళ్లపల్లి శేష శర్మగారు, పార్ల, కర్నూలు
39 ,, వంగా పెరుమాళ్ళరెడ్డిగారు, గోపాలపురం కొవ్వూరు.
40 ,, గుంటూరు శ్రీహరిగారు, వకీల్, ఎలమంచిలి.
(బాపట్లతా॥కర్లపాలెంనుండి)
41 ,, కొండముదిలక్ష్మీనారాయణగారు,
42 ,, కర్లపాలెం నరసింహా రావుగారి భార్యనరసమ్మగారు
43 ,, కొండిపర్ల రాజలక్ష్మమ్మ గారు
44 ,, పెనుమెచ్చ పెదసుబ్బరాజుగారు
45 ,, యీ. చినవెంకట్రామరాజుగారు

46 ,, గుంటూరు రంగాచార్యులుగారు

47 ,, బొడ్డుపల్లి రామకృష్ణయ్య గారు

48 ,, కర్లపాలెంలక్ష్మీ నారాయణప్పగారు.

49 ,, పులిపాక రామకోటేశ్వర రావుగారు

50 ,, చిలకలపూడి నాగేశ్వరరావుగారు.

51 ,, గాదిరాజు నరసింహం గారు

52 ,, పరిమి నరసంభొట్లుగారు,

53 ,, మతుకుమల్లి సుబ్బయ్యగారు.

54 ,, బూదరాజు దశరథరామయ్యగారు

55 ,, గుంటూరు తాయమ్మగారు

56 ,, బృందావనం శేషమ్మగారు

57 ,, కొండముది శీతారామమ్మగారు

58 ,, పెనుమెచ్చ చినసుబ్బరాజు గారు

59 ,, యీనుగుంట్ల చలమయ్యగారి కుమారుడు,
జగన్నాథంగారు.

60 ,, గరిగంటి పిచ్చయ్యగారు.

61 ,, యీ. రామయ్యగారు

62 ,, నిష్టల సోమయాజిగారు, కటకం.



# NIRJARA

# నిర్జర

ధాతువు కారణాంతరములచే క్షీణించినపుడు నరములకు దౌర్బల్యము సంభవించును. మఱియు మిక్కిలి వేడిమి బుట్టి, యందువలన రక్తము చెడిపోవును. పైత్యవికారము, ధాతుదౌర్బల్యము, నిస్సత్తువ మొదలగునవి సంభవించి మగతనమునకులోపముగలిగించును. ఈ నిర్జర అను ఔషధరత్నము రోగులు, ఆరోగ్యవంతులు సేవింపఁదగినది. అజీర్ణము తొలగించి, అగ్నిదీప్తి గలిగించి, ఆహార విహారాదుల యందుత్సాహమును, బలమును గలిగించుటలో దీనిని మించినది లేదని, ఆయుర్వేదమహర్షులు ఘోషించియున్నారు. మన పూర్వరాజులు దీనిని సదా సేవించుచుండెడువారు. అన్ని విధములగు జ్వరములపై నిది పిడుగువలె పనిచేయును. ప్రమేహాదిదుర్జయరోగములకు మా నిర్జర వజ్రాయుధమని ఘంటాపథముగ చాటుచున్నారము. ఉడుకులకు, వాంతులకు. పైత్యవికారమునకు, దారుణ మేహ వాతాది రోగములకు, తిమ్మిరులకు, మూలవ్యాధులకు, సెగ సవాయిలకు, ఉబ్బుపాండువులకు, ఈ యౌషధరత్నము నుపయోగింపవలెను. వేఱొక ఔషధమునుపయోగించి మోసపోకుడు.

దృఢప్రతిజ్ఞ:—ఇందు రసవిషగంధకాదులు లేవు ఈ ఔషధరత్నము గుణహీనమని ప్రమాణపూర్తిగ తెలియఁజేయ గలిగిన యెడల విలువ వాపసు చేయఁబడును

20 దినములకు సరిపడు డబ్బా 1కి రు 2-0-0 మాత్రమే. ఖర్చులు కొనువారు భరించుకొనవలెను.

వైద్యవిశారద, వైద్యవిద్వాన్ భిషగ్రత్నశిరోమణి,
శ్రీరంగం వెంకటరత్నము,
ఆర్యవైద్యభవనము—బరంపురం. [గంజాం.]

గీ. సిద్ధముగ నుండుఁ డీ ఘోర । యుద్ధమునకు
అనెడు రాజాజ్ఞ యెల్లెడ । నాక్రమించె
ఆహవోత్సాహ ముదయింప । నఖిల దిశల
ఢమఢమా రావములతోడ । ఢక్క మ్రోఁగె.

చ. దనుజులు నేల యీనిన వి । ధంబున సంగర భేరి మ్రోఁగి నం
తనె గుమిగూడి రాయుధ వి । తానముఁ జైకొని; యిప్పుడిట్టి ని
స్వనమున కేమి హేతువని । పౌరులు కొందఱు తల్లడిల్లుచున్
గనుఁగొన సైన్యముల్ నడచె । గంధగజాశ్వ సముత్కరంబుతో.

గీ. జలనిధిఁ దరించి క్రమముగ । సైన్యమెల్ల
సత్వరంబుగ లంక ని । శ్శంకఁ జొచ్చి
ధరణి కంపింప దశదిశల్ । తల్లడిల్ల
నమరులు చలింప మ్రోఁగించె । సమర భేరి.

చ. తనపురికిన్ మహాంబుధి వి । ధంబున వచ్చిన సేనఁ జూచి య
ద్దనుజవిభుండు రావణుఁడు । దైన్యముఁ దక్కి ధృతిన్ వహించి, చ
య్యన నెదు రేగి పుత్త్రుని న । రాంతకుఁ గౌఁగిట నాదరించి యి
ట్లనియెను దుఃఖభార నమి । తాననుఁడై పరికంపితాత్ముఁడై.

మ. కడిమిన్ ఖ్యాతిని గాంచినట్టి వర ర । క్షస్సంఘ మొక్కమ్మడిన్
మడసెన్, రాముని నామమున్ బలికినన్ । మన్మానసం బెంతయున్
వడఁకున్; నిల్చినవాఁడ వీ వొకఁడవే । వంశంబుఁ గాపాడగాఁ
గొడుకా; యుల్లము తల్లడిల్లుఁగద నిన్ । ఘోరాజికిన్ బంపినన్.

సీ. ఆలింప నెంతయు । నాశ్చర్యముగ నుండు
ఖరదూషణాదులఁ । గసిమసంగె
అంభోనిధుల సన్ను । నలయించి ముంచిన
వాలిని నవలీలఁ । గూలనేసె

వనచర సైన్యంబు । వనధిపై నడపించి
యెట్టకేలకు లంక । ముట్టడించె,
కుంభకర్ణుని భుజా । స్తంభంబులను ద్రుంచె
నింద్రజిఁ జంపించి । యేపుఁజూపె,

గీ. వృత్రశత్రుని గెల్చిన వీరాధి । వీరు లనఁగ
జయముఁ బడసిన దైత్యుల । సంహరించె;
రాముఁడెవ్వఁడో లయకాలు । భీముఁడేమొ?
దండనంబున కిప్పుడు దిగె । బంపుచెల్లొ?

మ. దనుజేశుండు మహా బలాఢ్యుఁడని సు । త్రాముండు భీతిల్లఁగన్
ధనువుం గైకొని యెల్లలోకముల దో । ర్దర్పంబుఁ జూపించి పే
ర్చిన నా కిప్పుడు నరరాఘవుల పే । ర్విన్నంత మాత్రంబునన్
తనయా యుల్లము తల్లడిల్లుఁజుమి యు । ద్ధం బెట్లు గావింతువో?

క. అనిన నరాంతకుండు దర । హాసము మోమున నంకురింప ని
ట్లనియెను, "దుఃఖ భారమున । నల్లనుచుంటివి గాక యక్కటా
మనుజులునన్ జయింతురె? యు । మాధవుఁడున్ ధ్వజమెత్తి వచ్చినన్
నను గికురింపఁ జాలఁడని । నన్ నరవానరు లొక్క లెక్కయే.

ఉ. భీమ పరాక్రమంబు గల । వీరులనెల్లర సంహరించి సం
గ్రామ లయాంతకుండనఁగ । ఖ్యాతినిఁగాంచితివీవు; రాముఁడన్
నామము వాఁడొకండసుర । నాయకుగెల్చె నటన్న దానవ
స్తోమము నేడు పెంపు భువి । శోభిలునే పలుపల్కు లేటికిన్.

ఉ. నీ తలఁపన్న వీరుఁడిల । నేటికిలేఁడని విజ్ఞపిగు మా
కీ తలఁపంపు నేఁడు ఘటి । యిల్లెఁగదే; తలపోయ మానవా
తీతుఁడు రాఘవుండతఁడు । దేవుఁడొ దయ్యమొ నే నెఱుంగ, నీ
ఖ్యాతిని బాసికొల్పుటకుఁ । గాఁ జనుదెంచితి దానవేశ్వరా.

వనచర సైన్యంబు । వనధిపై నడపించి
యెట్టకేలకు లంక । ముట్టడించె,
కుంభకర్ణుని భుజా । స్తంభంబులను ద్రుంచె
నింద్రజిం జంపించి । యేపుఁజూపె,

గీ. వృత్రవైరి నెల్లెడ పరాధి । వీరు లనఁగ
జయముఁ బడసిన దైత్యుల । సంహరించె;
రాముఁడెవ్వఁడో లయకాల । భీముఁడేమొ?
భండనంబున కిపుడు నిన్ । బంపుటెట్లొ?.

మ. దనుజేశుండు మహా బలాఢ్యుఁడని సు । త్రాముండు భీతిల్లఁగన్
ధనువుం బైకొని యెల్లలోకముల దో । ర్దర్పంబుఁ జూపించి పే
ర్చిన నా కిప్పుడు వీరరాఘవుల పే । ర్విన్నంత మాత్రంబునన్
తనయా యుల్లము తల్లడిల్లుఁజుమి యు । ద్ధంబెట్లు గావింతువో?

వ. అనిన నరాంతకుండు దర । హాసము మోమున నంకురింప ని
ట్లనియెను, "దుఃఖ భారమున । నట్లనుచుంటివి గాక యక్కటా
మనుజులునన్ జయింతురె? యు।మాధవుఁడున్ ధ్వజమెత్తి వచ్చినన్
నను గికురింపఁ జాలఁడని । నన్ నరవానరు లొక్క లెక్కయే.

ఉ. భీమ పరాక్రమంబు గల । వీరుల నెల్లర సంహరించి సం
గ్రామ లయాంతకుండనఁగ । ఖ్యాతినిఁగాంచితివీవు; రాముఁడన్
నామము వాఁ డొకండసుర । నాయకు గెల్చె నటన్న దానవ
స్తోమము పేరువెంపు భువి । శోభిలునే పలుఫల్కు లేటికిన్.

ఉ. నీ తలఁదన్ను వీరుఁడిల । నేటికి లేఁడని విజ్ఞవిగు మా
కీ తలవంపు నేడు ఘటి । యిల్లెఁగదే; తలపోయ మానవా
తీతుఁడు రాఘవుండతఁడు । దేవుఁడొ దయ్యమొ నే నెఱుంగ, నీ
ఖ్యాతిని బాడుకొల్పుటకుఁ । గాఁ జనుదెంచితి దానవేశ్వరా.

చ. నరవరు లెట్టివారయిన । నా కొకలెక్కకు రా రసాధ్యు లీ
నరవరులంచు నీవు కథ । నంబున నాకు నెఱుంగనయ్యె; దు
స్తరమగు కార్యభారమును । దాల్చితి సాదల జాక నేటికిన్
హరునకునైన శక్యమె జ । యాప జయంబుల నిర్ణయింపఁగన్.

ఉ. సంద్రముదాటివచ్చి కపి । సైన్యముతోఁ బురిముట్టడించి ధీ
సాంద్రుల సర్వ దైత్యకుల । సత్తములన్ రణరంగ రుమ్మిలన్
ఇంద్రజిఁ గుంభకర్ణు వధి । యించి మహా బలవంతుఁడైన దై
త్యేంద్రుని ధిక్కరించిన । నరేంద్రుని పుత్త్రులు మర్త్యమాత్రులే?

చ. అలయక పోరి రాముని శ । రాహతిఁ గూలినయట్టి వీరులన్
బలులఁ దృణీకరించు బల । వంతుఁడ నంచుఁ బ్రగల్భవాక్యముల్
పలికిన లాభమేమి రఘు । వర్యులమోఘ బలాఢ్యులంచు లోఁ
దలఁచి విచారభారమున । దైన్యమునన్ కృశియింప నేటికిన్?

మ. తన సంకల్పము సిద్ధిఁబొందు ననుచున్ । ధైర్యంబునన్ నీవు త
మ్మునకున్ బట్టముఁగట్టెము న్న రఘు । రాముం డెట్టులో యెల్లరన్
దునిమెన్; దైత్యుల నెల్లరన్ దునిమిన । న్నున్ నిన్నుఁ బోనిచ్చునే?
వెనుదీయన్ హరుఁడేగుదెంచినను ని । క్షితిన్ విజృంభించెదన్.

మ. జనకా! వాయువిమానముల్ గలిగియున్ । సామ్రాజ్యసంరక్షణం,
బునకున్ మారణయంత్రముల్ గలిగియున్ । పోరాడగన్ వీరులన్
ఘనశాహో బలశాలురన్ గలిగియున్ । కార్యంబిట్టుల్ వ్యర్థమ
య్యెను; చింతించిన లాభమేమి? విజయం । బేరీతిఁ జేకూరునో

గీ. కార్య పర్యవసాన సం । కల్ప ముడిగి
మనము పోరాడవలెఁ గాక । మగిడి చనిన
విడిచి పుత్తురె వైరులు । వెంబడించి
నిన్ను నన్ను వధింతురు । నిశ్చయంబు.

గీ. దధిముఖుఁడు దక్క నితరు లెం । తటి బలాఢ్యు
లయ్యు ననువధింపఁగఁజాల । రసురనాథ;
దధిముఖుఁడు నన్ను రణమునఁ । దాకకుండ
నడ్డగించినఁ గొంత కా । ర్యము ఫలించు.

గీ. హనుమ దంగద ప్రముఖుల । నధిగమించు
నధిక బలవంతు లున్నవా । రస్మదీయ
సైన్యమున వీరసింహుల । సంహరించి
యుద్ధముల నాజి తేజీన । యోధవరులు.

గీ. అతుల హంవీర పరిరక్షి । తాస్మదీయ
సైన్యమున నున్న భటు లసా । మాన్య బలులు
సమర దుర్వార శత్రు వా । చ్ఛల్యసములు
చెలఁగి ఫాలాక్షునైన శి । క్షింపఁగలరు.

క. సుగ్రీవ హనుమదాదులు
ఉగ్రాటవి నుండు మృగము । లొకలెక్కయె కా
ల గ్రీవుని మెచ్చని వీ
రాగ్రేసరులకు దనుజ కు । లాగ్రణి చెపుమా.

మ. పదియార్ కోటుల దైత్యనాయకులతో । భాసిల్లు సైన్యోత్కరం
బెదిరించున్ రఘువర్యులన్ కపుల; దే । వేంద్రాది దిక్పాలురన్
చదియంజేసిన సైన్యమున్ గెలువఁగా । శక్యంబె? యాలోన దో
ర్మదమేపార విభీషణున్ దునిమెదన్ । రక్షఃకుల ద్రోహినిన్.

శా. ఘోరాజిన్ గుమిగూడి దైత్యవితతిన్ । గూల్పంగ భావించు నా
క్రూరారాతి చమూసమూహ భటు లు । ద్ఘోషించి భీతిల్లఁగన్
ఆరావ ప్రతిరావముల్ నిగుడ స । ప్తాంభోధు లల్లాడఁగన్
భేరుల్ మ్రోగఁగఁజేసెదన్ దొలుత, పృ । థ్వీదేవి కంపింపఁగన్.

మ. పులులన్ సింహములన్ మహాజలచరం।బుల్ భీతిఁబర్వెత్త సం
చలితారాతి వితాన కర్ణకుహరం।బుల్ బద్దలౌనట్లు, ల
క్షలకున్ మించిన సంఖ్యగల్గు రణని।స్సాణంబులన్ దిక్తటం
బుల రావంబు ప్రతిధ్వనింప నిపుడే। మ్రోగింతునో కున్నస్మకీన్.

గీ. ప్రళయ పర్జన్యగర్జలఁ । బరిహసించు
సమర దుందుభి ధ్వనులకు । శత్రు సమితి
సగము చచ్చిన యట్లౌను, । క్షణములోన
బిలుకు మార్చరె మనదైత్య । వీరవరులు.

క. అనవిని యహాహా యని పు
త్త్రునిఁ గౌఁగిటఁ జేర్చియార్చి । "దుఃఖముతొలఁగెన్
తనయా"యని నవ్వుచు ని
ట్లనియెన్ దైత్యాధి నాథుఁ । డత్యాతురతన్.

ఉ. "ఇంతటి బుద్ధిశాలివని । యింతటి యుద్ధవిశారదుండ వం
చింతటి తంత్రవేత్తవని । యింతకు మున్న యెఱింగియున్న నే
నింత విచార భారమున । నీ గతిఁ గుందుదునే? చెలంగి దై
త్యాంతకులన్ జయింపుము న।రాంతక నామము సార్థకంబుగాన్.

మ. దనుజాతీతులు రామలక్ష్మణులు త। థ్యంబాచు భీతిల్లితిన్
తనయా! దుఃఖముచే నణంగిన రణో। త్సాహంబు రేకెత్తె నిన్
గనినంతన్; విజయేందిరన్ బడయఁగాఁ । గార్యంబు సాధింప నౌ
నని ధైర్యంబును బొందుచుంటిఁ దుదకే। మౌనో విచారింపఁగన్.

సీ. వనముల జీవించు । వానరంబులతోడ
నరులకు సఖ్యంబు, । వఱలు టేమి?
కలనైన నేనాఁడుఁ । గనివిని యెఱుఁగము,
ఱాలు వారాసిపైఁ । దేలుటేమి

సేతువు నిర్మించి । చెలఁగి సంద్రము దాటి
మించి దుర్గము ముట్ట । డించు టేమి
మానవాశనులంచు । మహి ఖ్యాతి కెక్కిన
దనుజుల మనుజులు । దాకుటేమి?

గీ. ఇంద్రజి త్కుంభకర్ణాద్య । హీనబలులు
సమర సింహాలు, రణమునఁ । జచ్చుటేమి?
ఇట్టి విపరీత మవని నెం । దేని గలదె?
తనయ! యెట్లు సాధింతువో । దాశరథుల?

గీ. అనిన విని యన్న రాంతకుఁ । డసురవిభుని
స్వాంత మలరంగ ననుకూల । సరణిఁ బలికి,
జనకుఁ డొనరించినట్టి దో । షములఁ దెలుపఁ
జనవుఁ గైకొని యిట్లనె । జంకు విడిచి.

ఉ. కాలము చెల్లె నీకుఁ బర । కాంతలయందు విరక్తిఁ బొందఁ గాఁ
జాలక సాహసంబుననుఁ, । జానకిఁ దెచ్చినవాఁడ వక్కటా
వాలిని గూడినాఁడె రఘు । వర్యుల నిర్భరఁ జంపియున్న నీ
లీల వృథాప్రయాసమునఁ । గ్లేశము లేశముఁ బొందియుందువే?

గీ. తొలుత రాముండు సుగ్రీవు । తోడఁ జెలిమి
సేయుటకుమున్నె తంత్రంబు । సేయవైతి
వైరులు, పయోధి దాటిరన్ । వార్త నాకుఁ
దెలియఁజేసిన దుకవస్థ । తొలఁగకున్నె.

సీ. రాజ్యహీనుండైన । రాముండు వనమున
నున్నవాఁడను వార్త । విన్నయపుడె,
శ్రీరాముతోడ సు । గ్రీవుండు మైత్రిఁ గా
వించికొన్నట్టు లా । లించినపుడె,

శ్రీరాముఁడొక్కఁడ । చెలఁగి పెక్కురఁగూర్చె
ననుచు లోకులు చెప్పఁ । గొనినయపుడె,
రాముఁడు విడిచిన । ప్రదరంబునకు వాలి
యిలఁగూలె నని నీకుఁ । దెలిసినపుడె,

గీ. శీఘ్రముగ నెదుర్కొన కుపే । క్షించినావు;
వీర పురుషోచితంబుగఁ । బోరి సీతఁ
దెచ్చియుండిన నెల్లరు । మెచ్చియుందు
రింత దనుకను నీచర్య । యెఱుఁగనైతి.

క. అకటా తమ్ముఁడు సీతో
వికటించిన యపుడు వాని । విడువందగునే?
ఒకని కతంబున వంశము
సకలంబు నశించెఁగాదె । సామ్రాజ్యముతో."

గీ. అని నరాంతకుఁడిట్లు మా । టాడుచుండ
లంకలోఁబుట్టె నమిత కో । లాహలంబు;
వానరుల దండగములకుఁ । బత్తనమున
స్త్రీల యాక్రందనంబు ప్ర । తి ధ్వనించె.

సీ. అంతః పురస్త్రీల । కవమాన మొనరించి
మదవతులందాకి । మదమణంచి,
విలపించు బాలుర । వృద్ధుల యువకుల
సంరంభమునఁ దాకి । సంహరించి,
వాడవాడల కేగి । మేడల మిద్దెల
నేల మట్టంబుగాఁ । గూలనేసి
జనులను వంచించి । ధనికులార్జించిన
ధనమెల్ల దోచి పే । దల కొసంగి,

గీ. పురము కాపింపఁ జేయు వా । నరులఁ గాంచి
అన్నరాంతకుఁ డంత శ । స్త్రాస్త్రములను
వేలు లక్షలుఁ గోటులు । విసువఁ జొచ్చె;
విన్నకుండునె పౌరుష । మున్న వాఁడు.

ఉ. "వానర మూర్ఖులార! బల । వంతుల దైత్యులఁ దాక లేక మా
మానవతీ శిరోమణుల, । మాన్యుల, వృద్ధుల బాధఁ బెట్టి య
జ్ఞానము వెల్లడించి రిది । శౌర్యమొ, ధైర్యమొ, సాహసంబె? మా
దానవులన్ జయింప నల । దాశరథిన్ గొనిరండు పొండిఁకన్.

సీ. యుద్ధంబునన్ దైత్య । యోధుల విడనాడి
స్త్రీలపైఁ బడుటది । సిగ్గుగాదె?
బలవంతులఁ ద్యజించి । బలహీనుల వధించి
సతుల సాధించుట । శౌర్యమగునె?
వృద్ధుల బాలుర । పేదల నెదిరించి
బాధించు టయ్యది । పౌరుషంబె?
వినుఁడు వానరులార । దనుజుల నెదిరింప
సమరంబునకు రండు । జంకు దక్కి

గీ. అని నరాంతకుఁ డెంతయు । నాగ్రహమున
విడిచె నిశితాస్త్ర శస్త్రముల్ । వేనవేలు,
వానరుల్ గృహంబులను క । వాటములను
ఒక్క మొగిఁ జెక్కు భంగుల । నూడఁ బెఱికి.

శా. "ఔరా! వ్యర్థ నరాంతకాఖ్యా! సమర । వ్యాపారమున్ దక్కి యే
యోరన్ దాఁగితి వింతకాలమును; దై । త్యుల్ ఖ్యాతిఁ గన్నట్టి హం
వీరాగ్రేసరు లెందఱో మడసి రు । ర్విన్ నీవు శేషించినన్
శ్రీరాముండు సహించునా జగతికిన్ । క్షేమంబు చేకూరునా?

సీ. అంభోధిలంఘించి । హనుమంతుఁ డెల్లరం
గూల్చి లంకా పురిం । గాల్చినపుడు
అసురుల వంచించి । యంగదుం డేపుమై
నీ తండ్రి సభలోన । నిల్చినపుడు
ఆనాఁడు లక్ష్మణుం । డడవిలో డాగిన
యింద్రజిత్తుని వధి । యించినపుడు
రాముండు రణమున । రౌద్రా కృతిం దాల్చి
కుంభకర్ణుని నేల । గూల్చినపుడు

గీ. బ్రతికి యున్నావొ లేవొ జీ । వచ్ఛవంబు
భంగి నెచ్చోట నుంటివో? । బలిమి నిన్నుఁ
దండ్రి పిలిపింప వచ్చితో । తగుదు ననుచుఁ
తాళు మా నీతుల వచింపఁ । దగవు నీవు.

శా. పారావార పరీత భూతలమునన్ । ప్రఖ్యాతి భాసిల్ల హాం
వీ రాగ్రేసరులైన వానరుల దో । ర్వీర్యంబవార్యంబుగాన్;
హోరాహోరి బెనంగి గెల్చెదము దై । త్యుల్ యోధులే మాకు? యు
ద్ధారంభంబున కేల వచ్చితి వృథా । హంకార మింకేటికిన్.

ఉ. ఇప్పటికిన్ బెనంగి గతి । యించిన దైత్యులకన్న మిన్నవే
చెప్పుము యాయుధంబులను । జేకొని వచ్చిన యంతమాత్రఁ బెన్
ముప్పు ఘటిల్లు నొక్కొ? రఘు । ముఖ్యుఁడు జంకునె నీకు? నెప్పుడేన్
కప్పకు భీతిఁ జెంది ఫణి । కాంతుఁడు డాగునె రాక్షసాధమా.

ఉ. భీమ పరాక్రమంబునను । వీరుల దైత్యుల సంహరించి సం
గ్రామమునన్ జయొందిరను । గైకొనఁజాలిన వీర వానర
స్తోమము నీమదంభమును । జూచి భయంపడు నొక్కొ? మూర్ఖ శ్రీ
రాముఁడు రాక్షసాంతకుఁడు । రా వినురా యనుమాన మేలరా.

ఉ. భూతలమందు నీరవర । పుంగవులంచుఁ బ్రసిద్ధిగన్న మీ
తాతలఁ దండ్రులన్ మునిమి । ధర్మము నిల్పిన విక్రముం డనిన్
నీతులఁ దన్ను నీవుల గ । ణింపని దుర్జయులన్ బలాఢ్యులన్
ప్రేతలఁ జేసినట్టి రణ । భీముఁడు రాముఁడు మర్త్యమాత్రుఁడే.

గీ. పంక ప్రయోగించి మించి య । హంకరించి
హుంకరించిన యంత నీ । వంకమణఁచి
సంహరింపక యుండునే । సమరసింహుఁ
డైన శ్రీరాముఁ డఖిల లో । కైక బలుఁడు.

క. అని వానరు లాక్కుమ్మడి
వని సేయఁగ రమ్ము మాన । వాశన యనుచున్
అనిరుద్ధగతిన్ డీకొని
అని వార్యబలంబుఁ జూపి । రద్భుత సరణిన్.

ఉ. చేవయు లావుఁ జూపి కపి । శేఖరు లెల్లరు దైత్యకోటి పై
గ్రావములన్ ధరారుహ ని । కాయము వైచి వధించుచుండ నే
త్రోవయుఁ గాన కుద్ధవిడిఁ । గోపము తాపము మట్టు మీఱఁగా
రావణుఁడున్ నరాంతకుఁడు । రాక్షసులన్ బురికొల్పి రెల్లెడన్.

ఉ. ఆ రణరంగ రుద్రుఁడు న । రాంతకుఁ డెంతకుఁ జాలఁ డంచు బృం
దారకులున్ నుతింప భుజ । దర్ప మనల్పముగాన్ శరాసన
జ్యారవ మంతకంతకు ది । శావలయంబున మాఱుమ్రోగ దు
ర్వార శరంబులన్ విడిచె । వానరులెల్లరుఁ దల్లడిల్లగన్.

క. దశదిశల సంచరించుచు
దశకంఠుఁ డాగ్రహించి । దశరథు పుత్రుల్
మశకములు గాక నాకస
దృశసేనులె యూముఁ గపి న । రేణ్యులఁ దాకెన్.

మ. అరరే చూచుచు నుంటిరే మిము పటుశౌ ర్యస్ఫూర్తి దీపింప వా
నరులన్ దాకి వధింపుచుంచు నిజసై న్యంబున్ విలోకించి పు
ష్టిర ధైర్యంబున హెచ్చరించి వడిఁ బం క్తిగ్రీవుఁ డత్యుగ్రుఁడై
శరముల్ లక్షలుఁ గోటులున్ విడిచె దో స్సంరంభ మేపారఁగన్.

మ. జనకుండుగ్ర రణాంబునన్ జెల్లఁగి దో స్సారంబుఁ జూపింపఁగన్
దనుజానీకము జంకుఁ దక్క సమరో త్సాహంబునన్ భాసిలన్
గని గర్జించి నరాంతకుండు రణశ ఙ్ఖల్ వేఁ వేల్ మ్రోఁగఁగన్
తన దోర్దర్పము వెల్లడించెఁ గపి సం తానంబుఁ జెండాడుచున్.

శా. రుద్రాదిత్య మరుద్గణాది రణ వీ రుల్ చూచి భీతిల్లఁగన్
రౌద్రాకారముఁ దాల్చి శత్రు వితతిన్ రక్షఃకులాధ్యక్షుఁ డీ
ర్షోద్రేకంబున సంహరించునెడ నో హో నేఁడు దైత్యేశుఁ డ
క్షుద్రుం డాహవరంగ రుద్రుఁ డని యా క్రోశించి రవ్వానరుల్.

శా. దోర్దర్పంబున దర్పకాంతకు గణిన్ దుర్వారులన్ వైరులన్
మర్దింతున్ వెనుదీయ నస్మ దనుజ క్ష్మానాథుఁ డన్, దైత్య స
మ్మర్దోద్రేకమణంచుచున్ హనుమ సం రంభంబునన్ మార్కొనెన్
శార్దూలంబును జూచి డీకొనిన పం చాస్యంబు చందంబునన్.

శా. క్రోధింతున్ బలిమిన్ నరాంతకుని న క్షుద్రప్రతాపాఢ్యుఁ డేన్
సాధింతున్ వెనుదీయకుండ నెవఁ డేన్ శౌర్యంబుఁ జూపించినన్.
బాధింతున్ బహుభంగులన్ దనుజులన్ పాపాత్ములన్ ; భక్తి నా
రాధింతున్ రఘువంశనాయకుని న శ్రాంతంబు స్వాంతంబునన్.

గీ. అనుచు హనుమంతుఁ డెంతయు నాగ్రహమున
వానరులఁ జంపుచున్న రా వణు నెదిర్చి
నేర్పుమై భీకరాయుధ నిహతి కోర్చి
తాళరా యంచు వాని స్యం దనముఁ గూల్చె.

శా. జ్యావల్లీనినదంబు సర్వ దిశలన్ । వ్యాపింప సంగ్రామ పా
రావారంబున మంథరాద్రి కరణిన్ । రాజిల్లి క్రోధంబునన్
ధావోద్రేకమునన్ నరాంతకుఁ డరి । వ్రాతంబుఁ జెండాడి వీ
రావేశంబున సంచరించె సమర । వ్యాపార మేపారఁగన్.

ఉ. బాహుబలంబుఁ జూపి కపి । వర్యులు నన్ను జయించు వారె ఘో
రాహవ కేళిలో దనుజు । లందఱు మేలన దాన వాన్వయ
ద్రోహిని సంహరింతుఁ దొలు । దొల్త; విభీషణుఁ డేడి యంచు వే
వ్యూహము మోహరించె నపు । డొక్క నరాంతకుఁ డుగ్రమూర్తియై.

సీ. "అన్నతో వాదాడి । యన్యులతోఁ గూడి
ద్రోహంబు గావింపఁ । దొడఁగె నెవఁడు,
ఆత్మీయులఁ ద్యజించి । యసుర సామ్రాజ్యంబుఁ
బడయ దుర్మార్గంబుఁ । బట్టె నెవఁడు
కుంభిలావని దీక్షఁ । గొని యున్నతఱి నింద్ర
జిత్తును వధియింపఁ । జేసె నెవఁడు
ఇంటి గుట్టెఱిఁగించి । యెల్లరఁ జంపించి
కులమున కెగ్గు చే । కూర్చె నెవఁడు

గీ. మానవుల నాశ్రయించిన । బానిసీడు
ఆప్తులకు ద్రోహ మొనరించి । నట్టి ఖలుఁడు,
ద్వేష చిత్తుండు వాఁడు వి । భీషణుండు
వాని వధియింపకుండఁ జా । పంబు విడువ.

చ. కులమున కెల్ల హాని యొన । గూర్చిన యట్టి విభీషణుండు దై
త్యులకు విరోధి; నేను వినుఁ । డో నర వానర వీరులార యా
ఖలుని వధించెదన్ జలధి । గర్భముఁ జొచ్చిన నేల డాగినన్
వేలుపు ఱేనిపుడాచుఁ బద । పద్మములన్ బడి మున్ను వేడినన్.

మ. మరణంబే లభియించుఁ బో, దనుజ సా।మ్రాజ్యంబు చేకూరు నే?
నరులన్ గూడిన యంతమాత్రమున వి।న్నావా కులద్రోహి! శ్రీ
హరియైనన్ హరుఁడైన నీరజభవుం। డైనన్ నివారించినన్
కరవాలంబునుబూని నీదు శిరమున్। ఖండింతు నేడాజిలో.

చ. అనుచు నరాంతకుండు వివి।ధాస్త్ర పరంపర నేసి వైరులన్
దునుముచు నంగద ప్రముఖ। దుర్జయ వీరుల ధిక్కరించుచున్
హనుమ నెదిర్చి మించెఁ బ్రళ।యాంతకుఁడే మొ నరాంతకుండు వీ
నిని నెదిరింప రా దనుచు। నిర్జరు లెల్లరుఁ దల్లడిల్లగన్.

గీ. తనదు సంరంభ మణఁచిన। యనిలసుతుని
దర్పమణఁప వచ్చిన నరాం।తకుని మెచ్చి
రావణుం డుత్సహించి ప।రాక్రమించె
భాను పుత్రాది వీరులు। భయము పడఁగ.

గీ. దైత్య సేనాధి పతులెల్లఁ। దరుణమరసి
భాను పుత్రాది కపి వీర। వరులఁ దాకి
అడ్డగించిన యంతఁ బో। రధిక మయ్యె
నొక్క హనుమంతుఁ డెల్లర। నోర్చుమించె.

సీ. నాసరి యెవరంచుఁ। గేసరి పుత్త్రుండు
గంధ గజంబులఁ। గసిమసంగె
దనుజుల దునుమాడ। ననిల తనూజుండు
వృక్షసందోహంబు। పెల్లగించె
హనుమంతుఁ డొక్కండ। దనుజనాథుని వాని
తనయుని నెదిరించి। దర్పమణఁచె
జేజేలు కొనియాడ। శ్రీరామ భక్తుండు
దనుజాంతకుండయి। ఘనతఁగాంచె

గీ. మించివచ్చిన ముష్టిఁ ద । ప్పించుకొనుచు
ఎల్లర నెదిర్చి సుంతయుఁ । దల్లడిలక
దనుజ సైన్యాంతరంబున । హనుమ మెలఁగె
జాగిలంబుల నడుమఁ బం । చాస్యమట్లు.

గీ. అప్పుడు నరాంతకుండు దై । త్యాధిపుఁడును
బిట్టు కినుకను హనుమను । ముట్టడించి
దనుజ వీరులఁ బురికొల్పి । యనుప మాన
సమర నైపుణిఁ బ్రకటించి । రమరులడల.

ఉ. భాను సుతాంగద ప్రముఖ । బాహుబలాఢ్యులు సాధ్వసంబునన్
హాని పొసంగు నేమొ,యని । లాత్మజుఁ డక్కట చిక్కెనంచు న
ద్దానవ వీరనాయకులఁ । దార్కొనినంత నరాంతకుండు నా
నా నిశితాయుధోత్కరము । నన్ హనుమంతుని నొవ్వజేసినన్.

క. హనుమంతుఁడు ధీమంతుఁడు
దనుజాంతకుఁడన్న ఖ్యాతిఁ । దనరిన వీరుం
డనఘుఁడు భీతిల్లునె య
ద్దనుజోత్తము నాయుధములఁ । దప్పించుకొనెన్.

క. కుప్పించుచు వైరుల గుఱిఁ
దప్పించుచు ముష్టిఁదక్కి । దనుజుల నేసిన్
మెప్పించుచు నోడితిమని
నొప్పించుచు వాయుసుతుఁడు । యుద్ధ మొనర్చెన్.

ఉ. రావణుఁడున్ నరాంతకుఁడు, । రాక్షస వీరుల హెచ్చరించి సు
గ్రీవునిఁ గొట్టి యాజిఁ జెల । రేగిన యంగదు నడ్డగించి రా
జీవ దళేక్షణుండు రఘు । శేఖరుఁ డేడి? విభీషణుండు తాఁ
జావకయుండునా యనుచు । శత్రువులన్ బరిమార్చి రెల్లెడన్.

మ. "సమరారంభమునన్ నరాంతకుఁడుదో । స్సామర్థ్యమున్ జూపుచున్
సమయంబున్ బలికెన్ విభీషణుని వం । శద్రోహినిన్ గూల్తు నం
చు మహావీరుల ధిక్కరించెనని ర । క్షోన్నైరి రాముండు చా
పము చేఁబూని ధృతిన్ విభీషణుని బ్రో । వన్ నిల్పె సౌమిత్రితో.

గీ. సాంద్రమగు వ్యూహమున విభీ । షణుని నిలిపి
రామలక్ష్మణు లిరువురు । రక్షకులయి
కాచుకొనియుంట దనుజులు । గండు మీఱి
దాడు చెండాడఁజొచ్చి రు । ద్దండగతిని.

సీ. ఆగ్రహోదగ్రుఁడై । సుగ్రీవుఁ డుగ్రుఁడై
యొక్కుమ్మడిఁ బెనంగి । సొక్కిపోలె
రాముండు మెచ్చ హో । రాహోరిఁ బోరాడి
యంగదుం డక్కటా । యాఁగలార్చె
దోషాచరుల కోడి । రోషాగ్ని చల్లార
నీలుండు నిలువున । నీరుగార్చె
వృద్ధుఁడయ్యు నొకింత । క్రుద్ధుఁడై చెలఁగిన
జాంబవంతుని బల్మి । సన్నగిల్లె

గీ. శత్రుజీవన దవానలుఁడు ని । శ్చలుఁడనలుఁడు
చెమ్మటలఁ గ్రక్కి వెంటనే । సొమ్మసిల్లె
కపి సమూహంబు పంచ బం । గాళమయ్యె
యుద్ధమున నొక్క హనుమంతుఁ । డుక్కుమీఱె.

చ. అలవున నంతకాంతకు న । రాంతకుఁడున్ దనుజేశ్వరుండు వి
చ్చలవిడి సంచరించి కపి । సత్తములన్ గికురించినంత దై
త్యులు చెలరేగి వానరులఁ । దున్మించి దురంబున సాటిలేని దో
ర్బలమును జూపి రెంతయును । రాముఁడు లక్ష్మణుఁడున్ భయంపడన్.

గీ. మించివచ్చిన ముష్టిఁ ద । ప్పించుకొనుచు
ఎల్లర నెదిర్చి సుంతయుఁ । దల్లడిలక
దనుజ సైన్యాంతరంబున । హనుమ మెలఁగె
జాగిలంబుల నడుమఁ బం । చాస్యమట్లు.

గీ. అప్పుడు నరాంతకుండు దై । త్యాధిపుఁడును
బిట్టు కినుకను హనుమను । ముట్టడించి
దనుజ వీరులఁ బురికొల్పి । యనుప మాన
సమరనైపుణిఁ బ్రకటించి । రమరులడల.

ఉ. భానుసుతాంగద ప్రముఖ । బాహుబలాఢ్యులు సాధ్వసంబునన్
హాని పొసంగు నేమొ,యని । లాత్మజుఁడక్కట చిక్కెనంచు న
ద్దానవ వీరనాయకులఁ । దార్కొనినంత నరాంతకుండు నా
నా నిశితాయుధోత్కరము । నన్ హనుమంతుని నొవ్వజేసినన్.

క. హనుమంతుఁడు ధీమంతుఁడు
దనుజాంతకుఁడన్న ఖ్యాతిఁ । దనరిన వీరుం
డనఘుఁడు భీతిల్లునె య
ద్దనుజోత్తము నాయుధములఁ । దప్పించుకొనెన్.

క. కుప్పించుచు వైరుల గుండెఁ
దప్పించుచు ముష్టిఁదక్కి । దనుజుల సేనన్
మెప్పించుచు నోడితిమని
నొప్పించుచు వాయుసుతుఁడు । యుద్ధ మొనర్చెన్.

ఉ. రావణుఁడున్ నరాంతకుఁడు, । రాక్షస వీరుల హెచ్చరించి సు
గ్రీవునిఁ గొట్టి యూఁకఁ జెల । రేగిన యంగదు నడ్డగించి రా
జీవ దళేక్షణుండు రఘు । శేఖరుఁడేడి? విభీషణుండు తాఁ
జావకయుండెనా యనుచు । శత్రువులన్ బరిమార్చి రెల్లెడన్.

ఉ. ఆలమొనర్ప వచ్చితె మ। హా బలనాతుఁడనంచు నీకుఁ బోఁ
గాలము దాపరించె నినుఁ। గాలుని ప్రోలికి బంపఁ జాలువా
వాలము సుప్రసిద్ధ కర। వాలము నిత్య జయాల వాలమే
లీల ననున్ జయింతు వవ। లీల నణంచెద నీదు దర్పమున్.

గీ. అనుచుఁ బవమాన నందనుం। డతి బలుండు
అన్నరాంతకు మార్కొని। యతని చేతి
యాయుధముఁ గొట్టి డీ యని। యఱచి మల్ల
చఱచి నిల్చె బాహాబాహి। సమరమునకు.

ఉ. హేళన జేయుచున్ భళిర। యెంతటి వీరుఁడవంచుఁ దా భుజా
స్ఫాలన మాచరించుచును। సంగర రంగము తల్లడిల్ల గ
ర్గోలొనరించి యద్దనుజ। కుంజరుఁ డెల్లరు హెచ్చరించి మే
ల్మేలన వాయుపుత్త్రుని న।మేయ బలాఢ్యునిఁ దాకె నుగ్రుఁడై.

ఉ. వాయుసుతుండు దైత్యకుల।వర్యుని నేలకుఁ గూలఁద్రోయఁగా
డాయుచు హుంకరించి వికటంబుగ నవ్వుచు సింహనాదమున్
జేయుచు వాలమెత్తి ముఖ। సీమ కదుంగడు జేవురింపఁగా
డీ యనుచున్ నరాంతకుని।డీకొనియెన్ ప్రళయాంతకాకృతిన్.

శా. ఆ వీరోత్తముఁ డా నరాంతకుఁడు బా।హాబాహియుద్ధంబునన్
లా వొక్కించుక చూప నెంచి యమితో।ల్లాసంబునన్ ద్వేష రో
షా వేశంబున దేహమున్ మఱచి, రౌ।ద్రాకారమున్ దాల్చి క్రో
ధా విష్టుండయి వాయుపుత్త్రుని వడిన్। హస్తద్వయిన్ బట్టినన్.

గీ. తాళురా తాళు ననుఁ బట్టఁ। దరమె యనుచుఁ
దన శరీరంబు సంకుచి। తంబొనర్చి
చంగునన్ దాటి యంగము। ప్పొంగఁ జేసి
గుండియలఁ దన్నె నాతఁడు। బెండు వడఁగ.

మ. "వనధిన్ దాటి వనంబుఁ జొచ్చి సుభట । వ్రాతంబుఁ బోకార్చి మీ
దనుజ వ్యాఘ్రములన్ వధించి పుర విధ్వంసంబుఁ గావించి నీ
జనకున్ శోక మహాంబుధిన్ ముంచి దో । స్సామర్థ్య మేపార రా
మునిచే మెప్పులఁ గొన్నవానిఁ జెనకన్ । ముక్కంటికేన్ శక్యమే.

శా. ఓరీ మూర్ఖ నరాంతకా జముఁడవో । యున్మత్త దైత్యుండవో
హోరాహోరిఁ బెనంగి మొక్కపోనయి । యుద్ధంబునన్ దైత్యహా
వీరాగ్రేసరులన్ వధించితిని దో । ర్వీర్యంబ వార్యంబుగాన్
రారా నీను పరాక్రమంబుఁ జూపి సం । రక్షింతు మా సైన్యమున్.

గీ. అనుచుఁ జెలఁగిన వాయు నం । దనునిఁ గవిసి
దనుజవిభు నందనుండు దో । ర్దండ బలముఁ
జూపి మల్ల యుద్ధమునకుఁ । జొచ్చెఁ గాని
కొండవలె నుండె నాతండు । బెంకు వడక.

చ. కదలఁడు మేనఁ జెమ్మటలు । గ్రమ్మ భయంబున నించుకంతయున్
మెదలఁడు, నిశ్చలాత్ముఁడయి । మేకొని పట్టినపట్టొకింతయున్
వదలఁడు, దైత్యుఁ డుగ్రుఁడయి । బల్మినిఁ గొట్టిన వేడి యార్పులన్
బెదరఁడు మేలు మేలు కపి । ముఖ్యుని విక్రమ మింత యొప్పునే.

గీ. అనుచు నందఱు హనుమంతు । నభినుతింప
అన్నరాంతకుఁ డాలించి । యధికమైన
కోపమున వైరి రొండఁదపై । గుద్దినంత
సంభ్రమించుచు నొక్కింత । సంచలించి.

క. వెఱచఱచి పోరఁజాలక
పఱచిన నరశిన్ నటించి । పవమాన సుతుం
డఱచి వెనుదిరిగి పైఁబడి
కఱచెన్ దనుజేంద్రు సుతుని । కాయుం బెల్లన్.

మ. భళిరా మెచ్చితి మోసకాఁడ వనుచున్ । వాలంబుచేఁ బట్టి యా
దలపైఁగొట్టిన యంత నాహనుమ క్రో । ధస్ఫూర్తి దీపించి ని
శ్చలుఁడై వాని శరీరమున్ బొడిచె ము । ష్టాముష్టి యుద్ధంబునన్;
బలహీనుండయియన్న రాంతకుఁడిలన్ । వ్రాలెన్ భయభ్రాంతితో.

ఉ. దానవులార రండు భుజ । దర్ప మణంచెదఁ జూడుఁడంచు న
వ్వానర పుంగవుండు నిజ । వాల మొకించుక యెత్తి నిల్చినన్
భానుఁడు నెవ్వడిన్ గగన । భాగమునుండి తొలంగి పశ్చిమాం
భో నిధిలోనఁ గ్రుంకెఁ గపి । భూషణు రోషముఁగాంచి భీతితో.

గీ. నన్నుఁ బడఁదన్ని యేపుమై । నాదు సుతుని
మూర్ఛఁ బొందించెఁ బవమాన । పుత్త్రుఁడనుచుఁ
గినుకఁ బడసిన దశకంఠు । కనులఁ దోచు
కెంపు దలపింప నెఱసంజ । సొంపునింపె.

గీ. గగనమను దర్పణమున సం । గ్రామ రంగ
రక్త మండల మల్లనఁ । బ్రతిఫలించెఁ
గాక లేకున్నఁ గెంజాయ । యాకసమున
నెట్లు వ్యాపింపవచ్చు నూ । హింపవలదె?

గీ. సంజకెంజాయఁ బరికించి । సంభ్రమమున
వరుసఁ బక్షులు గూండ్లకుఁ । బాఱినట్లు
అలసిసొలసిన భటులెల్ల । నా క్షణంబ
ఎలమి వెడలిరి శమతమ । నెలవులకును.

గీ. ఆలమునఁ బ్రాణవిభులను । గోలుపోయి
గోలుగోలున నేడ్చుచుఁ । గూలబడిన
రాక్షస స్త్రీల కేశ భా । రంబుఁ బోలి,
అంధకారంబు వ్యాపించె । నఖిలదిశల.

గీ. ఆకసంబున పత్రికన్ । నాకవిభుఁడు
వీర హనుమంతు సంగ్రామ । వృత్త మపుడు
వ్రాసెఁ గాబోలు విపులాక్ష । రములఁ బోలు
చుక్కలు రహించె వీక్షింప । శోభ హెచ్చె.

ఉ. వైరములన్ ద్యజించి యిరు । వాగులవారును సేదదేరి యా
హారములన్ భుజించి సమ । రాంగణ వృత్తము జెప్పుకొంచు దు
ర్వార బలాఢ్యులన్ బొగడి । ప్రజ్ఞలఁబల్కుచు రేపు వీర సం
హార మొనర్ప గావలయు । నంచుఁ బరుండిరి నిశ్చలాత్ములై.

గీ. ఆశలడంగంబె నెమ్మనఁ । బ్రాణమున్న
వసుధ బలుసాకు దినియైనఁ । బ్రదుకవచ్చు
ననుచు నా రాత్రి తటిఁజూచి । దనుజ వీర
వరులు కొందఱు పఱచిరి । వనములకును.

ఉ. "వ్యర్థము గా దొకింతయు న । రాంతకు విక్రమ మంతకంతకున్
వర్ధిలుఁగాని తగ్గ"దనిఁ । భావమునన్ దలపోసి లేచి తా
నర్థ నిశీథవేళఁ గపు । లందఱు నిద్రిలుచుండఁ జూచి కా
ర్యార్థి విభీషణుండిక కు । లాఢ్యునితోడ వచించె నీ గతిన్.

గీ. "అధిప! యీ రాత్రి మన వీరు । లాదమఱచి
నిద్రఁబోవుచు నున్నారు । భద్రముగను;
దనుజులు నిశాచరులు నరాం । తకుఁడు రాత్రి
యుద్ధమున నాఱితేఱిన । యోధవరుఁడు. .

శా. మాయాయుద్ధమునన్ నరాంతకుఁడ సా । మాన్యుండు పోరాటమున్
దాయాసంబునుబొంది పంచుకొనఁ బో । డశ్రాంతమున్ సంగర
వ్యాయామంబు విలాసకేళి యని సం । భాషింప; నీ రాత్రి వాఁ
డే యామంబున వచ్చి పైఁబడునో? న । న్నేరీతి రక్షింతువో.

ఉ. వేదనఁ జెందినిచ్చటికి । వేచనుదెంచితి, హాని నుంతయున్
లేదని మిన్నకుండిన ఫ । లింపదు కార్యము; తండ్రికంటె మ
ర్యాద నతిక్రమించు కలఁ । బాత్కుఁడు వాఁడు నరాంతకుండు క్ర
వ్యాదకులాధముం డితఁడు । లాధిప! నిక్కమెఱుంగఁ జెప్పితిన్.

ఉ. జాంబవదంగదాది కపి । సత్తములున్ నిమిరించుచున్న వా
రంబ కృపాకటాక్షమున । హాని ఘటిల్లకయున్న లెస్స; వాఁ
డంబుధివచ్చి పైఁబడిన । యట్టులు సైన్యముతోడవచ్చి యు
ద్ధంబొనరించుచేన్ మనకుఁ । దప్పదు మృత్యువు నిశ్చయంబుగన్.

ఉ. రామ యథార్థమున్ వినుమ । రాత్రి రణంబొనరించుటొప్పదన్
నీమములేని క్రూరు లవి । నీతిపరుల్ దనుజుల్, నిశీథ మం
దేమఱి యుండరాదు మన । మిప్పుడు సైన్యము మేలుకొల్పినన్
క్షేమము చేకురున్ కడకు । నేగి ఘటిల్లు నుపేక్షసేసినన్.

క. అని యిట్లు విభీషణుఁ డ
య్యినకులునకుఁ దెల్పుచుండ । నెల్లరు వడి మే
ల్కొని విభ్రాంతిన్ గనుఁగొన
వినఁబడియెన్ వీను లులియ । భేరీరవముల్.

సీ. హుంకార టంకార । ఘీంకార రవములు
దిక్కుల యందు వ్రే । తిధ్వనింప
తమమునకుం దోడు । డట్టంబుగా ధూళి
యఖిల దిగ్వలయంబు । నాక్రమింప
భయవిహ్వలాత్ములై । వణఁకు వానరులకు
సింహనాదంబులు । చెవుడు పఱుప
రణరంగ నిస్సాణ ఢణఢణ ధ్వానముల్
వీరుల గుండియల్ । వ్రీలఁజేయ

గీ. జీవితాశఁ ద్యజించి గ । ర్జించి మించి
దనుజ కంఠీరవంబులు । తాండవింప
కుపితుఁడై యేగె నా రాత్రి । యుద్ధమునకు
అఖిల జీవాంతకుండు న । రాంతకుండు.

గీ. సై మఱచి యున్న వానర । స్తోమమునకు
వైరులొక్కుమ్మడిన్ మీఁదఁ । బడిన యంత
అబ్ధి యుప్పొంగి పైఁబడి । నట్టులయ్యె
కపిబలంబెల్ల పంచ బం । గాళమయ్యె.

మ. అనుకొన్నట్టులు కీడు మూడె నని దై । త్యస్వామి తమ్ముండు రా
ముని వీక్షింపఁగ లక్ష్మణుండు శరముల్ । పుంఖానుపుంఖంబుగన్
దనుజవ్రాతము సంహరింప విడిచెన్; । దైత్యుల్ విజృంభించి మా
ర్కొనగన్ వానరసైన్యమొక్క మొగినా । క్రోశించుచున్ బర్విడెన్

గీ. వాయుపుత్త్రాది వీరులు । పఱచుచున్న
వానరబలంబుఁ బురికొల్పి । భయముఁ దక్కి
ఘోరముగఁ బోరి రయ్యంధ । కార వేళ
నెవ్వఁ డెవ్వాని వధియించె । నెవ్వఁ డెఱుఁగు?

మ. అరులంచున్ వధియింపు డంచుఁ బటు రో । షావేశులై శత్రు భీ
కరులై మజ్జయులై స్వపక్ష పరప । క్ష జ్ఞాన హీనాత్ములై
పరిఘప్రాస కుఠార ఖడ్గములతోఁ । బాషాణబృందమ్ములతో
తరు సంతానముతోఁ బెనంగిరి నిశిన్ । దైత్యుల్ కపుల్ ధీరులై.

గీ. దుర్భరంబయ్యె దనుజుల । దోర్బలంబు
వానరులు తాళఁజాలక । పరితపింప
నినకులుఁడు చూచి విల్లందు । కొని యమోఘ
భల్లముల నేసె దనుజులు । తల్లడిల్ల.

గీ. వానరుల హెచ్చరించుచు । వాయుసుతుఁడు
దనుజ వీరులఁ దాఁకఁగన । దాశరథులు
చండకోదండ పాండిత్య । సరణిఁజూప
నెల్లదిక్కుల వ్యాపించె । భల్లితతి.

గీ. దాశరథి దివ్యబాణ సం । తాన మఖిల
దిక్కులఁ గలట్టి దైత్యుల । యుక్కణంచె
కపులఁ గొందఱ బాధించి । కారనుంచి
దానవులు కొంద ఱంతయుఁ । దనిసిరపుడు.

గీ. దనుజ వరులార తరుణంబు । తరలె మీకు
హాని చేకూరు భాస్కరుం । డరుగుదెంచు;
సమరమున నింక మీ యాట । సాగ దనుచు
వెలుగు వెదఁజల్లుచున్ దోఁచె । వేగుఁజుక్క.

గీ. వేగురుఁజుక్క పొడమిన । వేళయయ్యె,
రాముని శరంబు లెల్లెడ । వ్రాలుచున్నఁ,
వానరులఁబట్టి పల్లార్చి । పరిభవించి
సంచరించిరి దనుజులు । సంగరమున.

మ. నరలోకాంతకుఁ డీ నరాంతకుఁడు స । న్నాహంబు గావించి వా
నరులన్ గాసిలఁ జేసెఁ జూడుమని స్వర్ । నాథుండు ప్రార్థింప శ్రీ
హరి చక్రాకృతి వచ్చెఁగాక యని దై । త్యశ్రేణి భావింప భా
స్కరుఁడ వ్వానరు లెల్లరుం బొగడఁ బ్రాక్ । శైలంబునన్ భాసిలెన్.

ఉ. నీ దయయున్నఁ జాలు రజ । నీచరులన్ వధియింతుమింక సూ
ర్యోదయమయ్యెఁ జూడుము ర । ఘూద్వహ యంచు జెలంగి వాయుపు
త్రాది మహాబలాఢ్యులు న । రాంతకు పైబడి హుంకరించి క్ర
వ్యాదుల సంహరించి రమ్ము । తాంఘ్రిసులెల్లరు హెచ్చరింపఁగన్.

గీ. వానరులు వచ్చి పైబడ । వరుసఁ గాంచి
హనుమదంగద ప్రముఖుల । నటమటించి
ఒకని కొక్కండు తోడ్పడ । కుండఁ గొట్టి
చెలఁగి ప్రాణంబులేసి మూ । ర్ఛిల్లఁ జేసి.

గీ. పెక్కు వానరవీరుల । యుక్కణంచి
సింహ నాదంబుఁ గావించి । శీఘ్ర గతిని
అన్నరాంతకుఁ డమిత సై । న్యంబుతోడ
రాఘవుల నాక్రమించి ప । రాక్రమించె.

మ. కనులన్ గెంపు రహింపలక్ష్మణుఁడు వీఁ । కన్ చాపమున్ బూని రా
ముని యాజ్ఞంగొని యన్నరాంతకునితోఁ । బోరాడి జృంభించి నం
తనె దైత్యేశుఁడు భీతితో సుతున కు । త్సాహంబు దీపింపఁగా
దనుజానీకము తోడ్పడన్ బనిపి తాఁ । దాకెన్ రఘూత్తంసునిన్.

గీ. రామ రావణ రణ మతి । రమ్యమయ్యె
నెల్లరకుఁ జూచు వేడుక । యినుమడింప
లక్ష్మణ నరాంతకుల పోరు । లక్ష్యమయ్యె
సమర రంగంబు ప్రేక్షయాత్రి । సరణిఁ దోచె.

చ. ఇరువుర లక్ష్యశుద్ధి విశి । తేషు పరంపర వెల్లడింపఁగన్,
హరిహరులంచు లక్ష్మణ న । రాంతకులన్ వినుతించుచున్ పర
స్పర జయకాంక్షఁ జూచి రిరు । వాగుల వారును; రామరావణుల్
గురవున నిల్చి తమ్ముని సు । తున్ పరికించుచుండి రయ్యెడన్.

ఉ. ఇద్దరు హుంకరించుచు న । హీనజవంబున విడ్డువాచి దో
ర్గర్వము మేరమీఱఁగ శ । రంబుల నేయుతఱిన్ ధనుష్కళా
ధూర్వహులెట్టి వీరులకు । దుర్జయు లుగ్రరణాంగణంబునన్
శర్వునికైన వేగెలువఁ । జాలుము రంచు నుతించి రెల్లరున్.

గీ. లక్ష్మణుని యమోఘంబైన । లక్ష్యశుద్ధి
యంతకంతకు హెచ్చిన । రాంతకునకు
బాధ చేకూర్చె నాతండు । క్రోధమునను
శక్తి సంధించి విడిచి ల । క్ష్మణునిఁ గొట్టె.

గీ. హనుమ సహియింపఁజాలక । యాత్మఁ బంబ
యన్న రాంతకు పైఁబడి । యాగ్రహమున
పిడుగు పడినట్లు పిడికిటఁ । బొడిచి పొడిచి
గుద్దినంతనె దైత్యుండు । కూలఁబడియె.

గీ. చూచి సహియింపలేక ర । క్షోవిభుండు
చెలఁగినంతనె రాముండు । నిలువరించి
వివిధ గతులను నారాచ । వితతి విడిచె
దైత్యులున్ దైత్య విభుఁడును । తల్లడిల్ల.

గీ. లక్ష్మణుఁడు లేచి వానరు । లఁ బురికొల్పి
హనుమదంగద భాను పు । త్రాది వీర
వరులతో దైత్యులన్ దాకి । పరిభవించి
నేలకుం గూల్చుచుండె ని । ర్నిద్ర గతిని.

గీ. అంతట నరాంతకుఁడు లేచి । యాగ్రహించి
స్యందనం బెక్కి వరశరా । సనముఁ బూని
వానరులు భీతిలఁ ద్యజించె । భల్లములను
సంక్షుభిత సాగరంబయ్యె । సమర భూమి.

శా. వీ రాలాపము లాడుచున్ కపులు దోర్వీర్యంబునన్ దానవుల్
హాహాహాకారిఁ బెనగినంత రుధిరంబు పొంగి మిన్నంటెఁ బో
పారావారముఁ బోలి; భీకరగతిన్ । వాద్యంబులున్ మ్రోగె; హం
వీరాగ్రేసరుఁ డా నరాంతకుఁడు జృంభించెన్ ప్రతాపాఢ్యుఁడై.

సీ. ఎన్నఁడో యింద్రుని । యేపణంచెనో లేదో
యింద్రజి యెంత వాఁ । డితని ముందు,
కొండ యంతటి వాఁడు । కుంభకర్ణుఁ డాదు
రెట్టి ప్రజ్ఞావంతుఁ । డితని ముందు
దుర్ధర్ష రాక్షసుల్ । ధూమ్రాక్ష తామ్రాక్షు
లేపాటి రణ ధీరు । లితని ముందు
మహిమాఢ్యుఁడగుఁ గాక । యహిరావణుండెన్న
నెంతటి బలవంతుఁ । డితని ముందు

గీ. కార్తికేయుని మెచ్చని । ఘనబలుండు
వీరభద్రుని మించిన । వీరవరుఁడు
అనుచుఁ గపి ముఖ్యులెల్లరు । నభినుతింప
నన్నరాంతకు విక్రమం । బతిశయించె.

సీ. అంగద వాటిల్లె । నని పల్క యంగదుం
డదవద యెదఁదోప । నొడిగి డాఁగె
నిట్టూర్పుఁ బుచ్చుచు । నిలిచి చూచుచు నున్న
జాంబవంతుని బల్మి । సన్నగిల్లె
దుష్టదానవ వీర । దుర్ణయంబును గాంచి
నీలుండు నిల్చె క । న్నీరు గార్చె
దనుజవర్యు నెదుర్పఁ । దఱిచిక్క దా యంచు
హనుమ యుపాయంబు । నరయుచుండె

గీ. రాముఁడెదిరింప వలెఁ గాక । రాక్షసేంద్రు
తనయు నోడింప మన కసా । ధ్యంబ యనుచు
వాలి తమ్ముండు వెఱచెఁ; ని । వ్వెరుసఁ గాంచి
యల విభీషణుఁ డెచటనో । యణఁగిమణఁగె.

చ. విలయము దాపరించె మన । వీరుల కక్కట మృత్యుదేవికిన్
నిలయము యుద్ధరంగమని । నిశ్చయమయ్యెను, ప్రాణముండినన్
బలుసు భుజించియేన్ బ్రదుక । వచ్చును వానరులార! భక్తి వ
ర్ధిల రఘురామచంద్రుని స్మ । రించుచుఁ గాచుకొనుండు దేహముల్.

చ. అనుచు నలుండు నీలుఁ డని । లాత్మజు పజ్జకు నేగి నిల్చి యి
ట్లని రెటులేని నీ విపు డ । హంకృతి సారథి బిల్కుమార్చి స్యం
దనమును గూల్చి రావణుని । దార్కొనినన్ వినుమా యథార్థమున్
ఇనకులుఁడా నరాంతకుని । యే పణఁగింపఁగఁ జాలు ప్రేల్మిడిన్.

గీ. అనిన విని యట్ల యగుఁగాక । యనుచు హనుమ
తరుణమును జూచి లంఘించి । దైత్య విభుని
రథముఁ గూల్చిన యంతనే । రావణుండు
హనుమ నెదిరించి పోరాడి । యలసిసొలసె.

గీ. అలసి సొలసిన రావణుం । డనిల పుత్రు
భీకరాటోపమును గాంచి । వెఱచి పఱచె;
నంస భాగంబునన్ రాము । నమరఁ జేసి
అన్నరాంతకు నెదిరించె । ననిల సుతుఁడు.

సీ. మధ్యాహ్న మార్తాండ । మండలంబును బోలు
ముఖ మండలంబునఁ । బొలుచు వాని
ఎదిరింపఁ గల వీరుఁ । డెవఁడంచు నెల్లెడ
నసహాయ శూరుఁడై । యెసఁగు వాని
కుండలీకృత చండ కో । దండ నిర్ముక్త
శరముల వైరులఁ । జాపు వాని
సంక్షోభము జనింప । సమర నిస్సాణంబు
లని శంబు మ్రోగించి । యలరు వాని

గీ. అసుర వీరులఁ బుట్టకొల్పి । యతిశయించి
హుంకరించుచు విహరించు । చున్న వాని
నన్నరాంతకు వీక్షించి । యాగ్రహించి
రామచంద్రుఁడు చెండాడె । రాక్షసులను.

శా. ఆరావప్రతిరావసంక్షుభితమై । హాహారవా క్రాంతమై
పారావారముఁ బోలు సంగరము నన్ । వారించు వారెవ్వరున్
లేరా యంచును సాధ్వసంబునఁ గపుల్ । వెన్నిచ్చి పర్వెత్తఁగన్
రారా రాక్షస రాజపుత్ర యని శ్రీ । రాముండు దాకెన్ వెసన్.

ఉ. రామునకున్ రథంబయి వి । రాజిలినట్టి సమీర నందనుం
డా మను జాశనోత్తముని । యస్త్రములన్ వడిఁదప్పుకొంచు సం
గ్రామమునన్ రహించి నప్పు । డందఱు మెచ్చుకొనంగఁ జొచ్చి రు
ద్రామ బలాఢ్యులైకపులు । దానవులన్ బరిమార్చి రెల్లెడన్.

గీ. వెఱచి వెన్నిచ్చి పఱచిన । వీరవరులు
మగిడి పోరాడి దైత్యుల । పొగరణంప
జాంబవద్భాను పుత్రాది । సమరసింహు
లద్భుతంబుగఁ బోరాడి । రాదమఱచి.

గీ. రావణుని సైన్యమత్తఱి । రణమునుండి
విముఖతంబొంది మెల్లగ । వెడలఁ జొచ్చె
దానవుల యాగడము నరాం । తకుని బలిమి
సన్నగిల్లిన యంతనే । సన్నగిల్లె.

గీ. దాశరథి బాణములు నరాం । తకుని నాక్ర
మించి సారథిన్ ధనువును । ద్రుంచినంత
చేయునది లేక వేఱొక । సింగిణిఁగొని
రథము నడపించు కొనుచు న । స్త్రముల విడిచె.

గీ. అసురవర్యుండు విడిచిన । యస్త్ర వితతి
రఘుకులేంద్రుని యెడల వ్య । ర్థంబు మయ్యె;
అంతట నరాంతకుండేచి । యాగ్రహించి,
శస్త్రముల నేసె సవ్యాప । సవ్యగతిని.

ఉ. అంతట రాఘవుండు దర । హాసము మోమున నంకురింప నా
వంతయు జంకకప్పుడు న । రాంతకునిన్ నిజబాణ సంచయా
క్రాంతుని జేసినంత భయ । కంపిత గాత్రముననన్ నరాంతకుం
డెంతయు సంచలించి యితఁ । డెక్కుడి మానవుఁడంచు నాత్మలోన్.

ఉ. "ఎక్కటి కయ్యమందు నిశి । తేషు పరంపరఁ గ్రుమ్మరించి నే
నొక్కఁడఁ బెక్కు యుద్ధముల । యోధుల నెల్ల జయింపలేదె? నేఁ
డెక్కడ నాకు లొంగుటది । యెక్కడ నే నిటు లెంత పోరినన్
చిక్కఁడె మచ్ఛరాహతికిఁ । జెక్కు చెమర్పఁ డొకించుకంతయున్.

గీ. వీఁడసాధ్యుండు తన ధను । ర్విద్యకలన
నన్ను శూన్యుని జేసె క్ష । ణంబులోన
వ్యర్థమయ్యెను నాదు శ । స్త్రాస్త్ర సమితి
ఏమి సేయుదు వీని జ । యించు టెట్లు".

గీ. ఇట్లు చింతించి తుదకు నే । ర్పెట్లొ పోరి
తరుణముం జూచి యన్నరాం । తకుఁడు పఱచె
వెఱచి పఱచిన వైరిని । వెంబడించి
చంపరాదంచు శ్రీముకుందు । శాంత మూనె.

ఉ. రావణుతోడనే వెడలె । రాణువ కొంత నరాంతకుం డహం
భావము దక్కి యాహవముఁ । బాసిన యంతనె దైత్యులెల్లరున్
జీవము నిల్పుకొందమని । శీఘ్రగతిన్ జని రెల్లవారు రా
జే పరదా ముకుంద రఘు । శేఖరయంచు నుతించి రత్తఱిన్.

ఉ. దానవులన్ జయించి భుజదర్పముఁ జూపితిమంచు నేకమై
వానరు లెల్లరున్ జెలఁగి పాటలఁ బాడుచు నాటలాడగా
భానుకులోత్తముండు కపివర్యులతోడఁ దొలంగు వేళకున్
భానుఁడు పశ్చిమాంబుధిని భాసిలి క్రుంకెఁ గ్రమక్రమంబుగన్.

శా. తోఁచెన్ బ్రాగ్దిశయందు చంద్రుఁడు మనోదుఃఖాగ్ని చల్లారఁగన్
కాచెన్ వెన్నెల సాధుసజ్జన యశఃకాంతిన్ బ్రకాశించుచున్
వీచెన్ చల్లని మందమారుతము హరివీరుల్ ప్రశంసింపఁగన్
చూచెన్ రాఘవుఁడవ్విభీషణుని సంశోధించుచున్ సైన్యమున్.

గీ. సైన్యమధ్యంబునన్ విభీషణునిఁ జూచి
ఓ విభీషణ యిచ్చోట నుంటివేమి
రమ్మ రమ్మని వాని కరమ్ముఁ బూని
ఆదరమ్మున నిట్లు మాటాడఁ జొచ్చె.

చ. ఎవఁడు నరాంతకుండు వచియింపుము యెచ్చటివాఁడు వీఁడు దా
నవపతి కేమగున్ బహురణంబుల గెల్చినయట్లు తోఁచెడిన్
శివుని వరంబులన్ బడసెనే జగదేక మహాబలాఢ్యులన్
భువిని జయించె నేమి? తలపోయఁగ వీని చరిత్ర మెట్టిదో?

గీ. వాయుసుతుఁ దక్క తక్కిన వానరులను
పెక్కు తూపుల నొక్కఁడ క్షోభింపఁజేసె,
దానవాంతక ప్రఖ్యాతిఁ దనరినట్టి
వానమయు వధింపఁజాలఁ డయ్యసురవర్యు.

చ. అనిన విభీషణుండు తన హస్తములన్ ముకుళింపఁజేసి యి
ట్లనె రఘువంశ నాయక నరాంతకుఁడెంతయు దుర్జయుండు వీ
నిని హనుమంతుఁడేన్ దునుమనేరఁడు గెల్చిన గెల్పుఁగాక, మా
ర్కొని వధియింపఁగా దధిముఖుండు సమర్థుఁడు నే నెఱుంగుదున్.

శా. శ్వేతాద్రిన్ నివసించియుండు సతమున్ । శ్రీకంఠు సేవించుచున్
ఏ తన్మాత్రుఁడె రాఘవా! దధిముఖుం । డింద్రాదిమలగ్గింపఁగా
నాతండొక్కఁడ వీనినిన్ దునుము బాహాబాహియుద్ధంబునన్;
ప్రాతఃకాలము గాక పూర్వమతనిన్ । రప్పింపు మింతేటికిన్.

ఉ. అద్రిసుతామనోహరుని । యాత్మను గొల్చుచు సంతతంబు ని
న్నిద్రతపః ప్రభావమున । నిన్ వినుతించుచునుండు నాతఁ డ
క్షుద్రబలాఢ్యులన్ దనుజ । శూరుల దాసులఁ జేసినాడు; శ్వే
తాద్రికిఁ బాపు మిప్పుడని । లాత్మజు నింక విలంబ మేటికిన్.

గీ. నీవుఁడు నరాంతకుఁడవి । నీతి పరుఁడు
దాసునింబంపి చంపింపఁ । దగును గాక
వానితో నీవు పోరాడ । వలదు పదునె?
దధిముఖుఁడు నీదు పదపద్మ । దాసుఁ డనఘ.

గీ. అంత సుగ్రీవు డిట్లనె । నంబుజాక్షు
దధి ముఖుండచ్యుఁడే నాదు । తనయుఁ డిప్పుడే
వానిఁ బిలిపింతు హనుమంతుఁ । బంపి యనిన
సంతసించుచు రాముండు । సమ్మతించె

గీ. అనిల పుత్త్రుండు రాముని । యానతిఁ గొని
వనధి మధ్యస్థ ధవళ ప । ర్వతముఁ జేరి
ధ్యాన నిర్మగ్నుఁడైయున్న । దధి ముఖుఁ గని
అతని మేల్కొల్పు టెట్లని । యరయుచుండె.

ఉ. ధ్యాన సమాధిలోనఁ గను । దమ్ముల మోడ్చి తపఃప్రభూత వి
జ్ఞాన కళల్ ముఖాంబుజము । నన్ విలసిల్లఁగ నిశ్చలాత్ముఁడై
మౌని విధాననున్న కపి । పుంగవు మేల్కొలుపంగ మార్గమున్
గానక వాయుపుత్త్రుఁడవ । కాశముఁ జూచుచు వేచియుండగన్.

గీ. దధిముఖుండంత శనను నే । త్రములఁ దెఱచి
అనిల పుత్త్రుని వీక్షించి । యాదరించి
రామ లక్ష్మణుల నుతించి । క్షేమమడిగి
జనకునిఁ దలఁచి ప్రశ్నించె । సమర సరణి.

గీ. అంత హనుమంతుఁ డాతని । నభినుతించి
సమర వృత్తాంత మంతయు । సంగ్రహముగఁ
జెప్పి శ్రీరాము నానతిఁ । జెప్పెనంత
అతఁడు సారంభమున లేచె । నాక్షణంబ.

క. డెందమునఁ గ్రందుకొను నా
నందము దీపింప, వాయు । నందనుఁ డలరన్
ముందుగ దధిముఖుఁడు నడచె
సుందర దరహాస కాంతి । శోభిత ముఖుఁడై.

చ ఇరువురు శీఘ్ర యానమున । నెల్ల వనంబుల నున్నతావనీ
ధరముల సాగరంబుల న । దంబుల గ్రామములన్ పురంబులన్
వరుస నతిక్రమించి కపి । వర్యులు మేలని సన్నుతింప భా
స్కరుఁడుదయింప కుండగనె । గాంచిరి రాముని సార్వభౌమునిన్.

గీ. దధిముఖుఁడు వచ్చె మీా నరాం । తకుఁడు వచ్చె
అనుచు వానరులెల్లరు । నతిశయించి
లంకలోఁ జేసె రమిత కో । లాహలంబు
దైత్యవల్లభు నుల్లంబు । తల్లడిల్లె.

గీ. దధిముఖుఁడు వచ్చెనని నరాం । తకుఁడొకింత
స్వాంతమున సంచలించి ధై । ర్యము వహించి
అక్షిణ సేన వెడలగ । నానతిచ్చి
యుద్ధ సన్నద్ధుఁడయ్యెఁ దా । నుత్సహించి.

క. హతశేషుఁడైన పుత్రుఁడు
ప్రాంతగతి దధిముఖు నెదిర్చి । ప్రాంచమనో, తుదకున్
సుతుఁడొక్కఁడు దక్కఁడొ యని
మతిఁగోల్పడె రావణుఁడను । మానమువలనన్.

గీ. దధిముఖుఁడు వచ్చె నన్న యు । త్సాహమునను
వానరులు, క్రోధమూర్తులై । దానవులును
వ్యూహములఁ బన్ని నిలిచిరి । యాహవమున
భూరి రణభేరి యెప్పుడు । మ్రోఁగు ననుచు.

ఉ. వీరములాడుచున్ జెలఁగి । బింకముఁ బొంకముఁ జూపుచున్ మహా
వీరుల గెల్చినారమని । పెగ్గెలఁ బల్కుచు శత్రులోక దు
ర్వారులమంచు మించి యిరు । వాగులవారు మహోగ్రమూర్తులై
బారులఁ దీర్చి క్రొల్పులుల । వైఖరిఁ జూచుచు నిల్చి రాజిలో.

ఉ. అంత నరాంతకుండు నయ । నాంతము లించుక జేవురింప న
త్యంత భయంకరాయుధ స । మన్విత దివ్యరథంబు నెక్కి దే
వాంతకుఁడేమొ వానర న । రాంతకుఁడేమొ భయంకరాకృతిన్
అంతకు మించినాడని సు । రాసురు లెన్నఁగ నేగె నాజికిన్.

గీ. స్యందనారూఢుఁడై యాజి । కరిగి నట్టి
యాత్మజునిఁ జూచి యించుక । యతిశయించి
ధైర్యమును బూని శీఘ్రింబ । దనుజవిభుఁడు
అంగరక్షక భటులతో । నటికి నేగె.

ఉ. ఆహవమందు నిల్చిన న । రాంతకుఁ గాంగని వీర వానర
వ్యూహము సంచలించె నసు । రోత్కర ముత్సుకతన్ మహాహవో
త్సాహమునన్ రహించె దన । సైన్యముఁ జూచి ధృతిన్ వహించియున్
మోహవశంబునన్ దనుజ । పుంగవుఁడున్ విచలించె నాత్మలో.

చ. దధిముఖుఁడున్ రఘూద్వహు । దద్వయ వందనమాచరించి, య
త్యధిక బలాఢ్యుఁడయ్యును న । రాంతకు నిప్పుడ సంహరింతు నే
విధమున నైన నిక్కమిది; । వేగమ యానతి యిమ్ము రామ! నా
విధి యొనరించి, వత్తుఁ గపి । వీర వరేణ్యులు సన్నుతింపఁగన్.

గీ. అనిన దధిముఖుఁ బరికించి । యాదరించి
దుర్జయుల వీరవర్యుల । తోడా సంగి
రాముఁ డిట్లనె నింక శీ । ఘ్రముగఁ బొమ్ము
నీకు విజయంబు చేకూరు । నిక్కనంబు.

ఉ. సమ్మతి నానతిచ్చె రఘు । సత్తముఁడింక నరాంతకుండు ని
క్కమ్ముగఁ జచ్చినట్ల యని । కన్నులొకించుక జేవురింపఁగా
హుమ్మని హుంకరించి దను । జోత్తముఁ డత్తఱిఁ దత్తఱిల్ల సై
న్యమ్ములు భీతిలన్ దధిము । ఖాహ్వయుఁ డాహవ సీమ కేగినన్.

గీ. దధిముఖుని జూచినంతనే । దశముఖుండు
షణ్ముఖునిఁ జూచినట్టుల । సంచలించి
సముఖమున నిల్చి పోరాడ । విముఖుఁడగుచు
వ్యూహ మధ్యంబునన్ నిల్చె । నా హవమున.

గీ. దధిముఖుని దివ్య తేజంబు । దనుజభటుల
ముగ్ధులంజేసె, సాధ్వసం । బు నను కొంద
అతని దరికేగఁ జాలక । యలయుచుండి
రాహవంబున నిశ్శబ్ద । మావహిల్లె.

గీ. కొలిచె రాముని జయము చే । కూరుననుచు
బొలిచె ధీరాతి ధీరుఁడై । భూతలమున
నిలిచె సమర రంగంబున । నిశ్చలుఁడయి
పిలిచె దధిముఖుండసుర హం । వీరవరుని.

చ. పిలిచిన యంతనే దనుజ । వీర వరుండు నరాంతకుండు ని
శ్చలుఁడయి యేగుదెంచి కపి। సత్తముఁగాంచి బహూకరించి, దో
ర్బలమున నన్ జయించుటకు । వచ్చితి వెంతయు నిన్ను మెచ్చితిన్
నిలిచితి, వైరమున్ మఱచి । స్నేహమొకించుక లోఁదలంపుమా.

గీ. అనిన ముఖమున దరహాస । మంకురింప
దైత్యవరుఁజూచి యిట్లనె । దధిముఖుండు;
స్నేహితుల మాట హితము వ । చింపఁదలఁచి
వచ్చితిన్ ధర్మము గ్రహింప । వలయు నీవు.

గీ. మానవులు దానవులుఁ దమ । మానసముల
సంతతము దైవము స్మరించి । సత్యమరసి
ధర్మమార్గంబునఁ జరింపఁ । దగును గాదె
అకట నీ తండ్రిచర్య నీ । వరయవైతి.

సీ. బ్రహ్మపౌత్రుఁడనంచు । బహుతపంబులఁ జేసి
వరములఁ గైకొని । ప్రబలినాడు
మూడు లోకంబుల । ముట్టడించి జయించు
వీరుండ నంచు గ । ర్వించినాడు
కొందఱ నొప్పించి । కొందఱఁ జంపించి
యెల్లర సాధింప । నెసఁగినాడు
బలిమిమై బాధించి । భర్తల బంధించి
మించుఁ బోండ్ల బలాత్క । రించినాడు

గీ. పరుల యైశ్వర్యము హరించి । బలిసినాడు
తృప్తివర్జించి పాప మా । ర్జించినాడు
జనని జానకిని హరించి । సర్వనంశ
నాశనముజేసి చావ ను । న్నాడు నేడు.

గీ. అరయ వాతని పశ్చాత్రి । యసురవర్య
పుత్రిమీఁ బొడమిన యపుడ నిన్ । విడువలేదె?
ఎట్టి సుతుఁడవుర వాఁడు నీ । కెట్టి తండ్రి?
వానిఁ గాపాడఁ బోరాడ । వచ్చినావె.

శా. ఈవున్ నేనును బాల్యమిత్రులమనిన్ । హింసింపగా సుంతయున్
భావింపగన్ జుమీ; నీకుతండ్రి ఖలుఁడై । పాపాత్ముఁడై దోసమున్
గావించెన్; వధియింపఁబడుఁ జను నే । క్ష్మానాథపుత్రుండు రా
జీవాక్షుండు రఘూద్వహుండు విజయ । శ్రీనాథుఁడూహింపఁగన్.

గీ. హితముఁ దెలిపెద నీకు స్నే । హితుఁడ నగుట
జరగిన యుదంతమున కింక । చర్చయేల?
జనని రాముని కర్పించి । శాశ్వతముగ
అనుభవింపుము సామ్రాజ్య । మసురవర్య.

గీ. సుతులు చావగ మిగిలిన । సుతుఁడ వీవు
వంశమును నిల్పఁదలఁచిన । వాఁడవేని
తండ్రికి హితంబు దెలిపి యు । ద్ధంబు నుండి
శీఘ్రగతి నీవు వెడలిన । క్షేమమగును.

క. అనవిని దధిముఖు ముఖమున్
గనుఁగొని నిర్లక్ష్య భావ । గర్భిత హాసం
బునఁ గోపము మఱుఁగు పఱచి
జనకుఁడు హర్షింప దైత్య । పుత్రుఁడనియెన్.

చ. అవునవు దొడ్డవాఁడవు న । నాథము నొక్కని సన్నుతించుచున్
దివిరి వచించినాఁడవు, వ । ధింపఁగ వచ్చినవాఁడ వీగతిన్
సవినయవాక్కులన్ బలికి । నన్ మననెయ్యమునిల్చునొక్కొ దా
నవవిభునిన్ నరాంతకుని । నన్ను నెఱుంగవొ వానరోత్తమా.

ఉ. పెద్దల ధిక్కరించుటది । పిన్నలకున్ తగవౌనె? యాజిలో
నిద్దఱమున్ బెనంగి నిజ । యోధులఁ గైకొన నెంచినార మీ
సుద్దులఁ గట్టిపెట్టుము వి । శుద్ధ చరిత్రుని పోల్కి తప్పులన్
దిద్దిన యంతమాత్రమున । ధీరుఁడ వౌదువె మిత్రరత్నమా.

గీ. అనిన విని దధిముఖుఁడిట్టు । లనియె "సఖుఁడ
హితముఁ దెలిపితి మనము స్నే । హితుల మగుట
ధర్మ మరయక పోరాడఁ । దలఁచితేని
ధర్మమును నిల్పఁ బోరాడఁ । దగును నాకు".

గీ అంతట నరాంతకుండు "ధ । ర్మార్థమునకె
వచ్చి నంతనె వెనుదీయు । నాఁ డెవండు?
యుద్ధమునకు సిద్ధంబుగ । నుండు మనిన
యంతనే మ్రోగె రణభేరి । యాక్షణంబ.

గీ. "యుద్ధమునకు సిద్ధంబుగ । నుండు మనుచు
భేరి మ్రోగించి నంతనే । భీతితోడ
జంకు వాఁ డెవ్వఁ"డనుచు న । హంకరించి
దనుజవరుని హేళనఁజేసె । దధిముఖుండు.

ఉ. మేలనవచ్చు నన్ గెలుచు । మేటి జగంబున నున్న, బేలవై
హేళన సేయుచున్ నిలువ । నేటికి రమ్మని యుగ్రుఁడై భుజా
స్ఫాలన మాచరించి కపి । సత్తముఁదార్కొనియెన్ నరాంతకుం
డాలమునందు దైత్యభటు । లందఱు నౌనని హెచ్చరింపఁగన్.

గీ. దధిముఖుఁడు నరాంతకుని యౌ । ద్ధత్యమణఁచి
జయము చేకూర్తు శ్రీరామ । చంద్రునకని
నెమ్మనంబున దృఢముగ । నిశ్చయించి
సరభసంబున ఢీకొనె । సమరమునకు.

గీ. దిశల జయజయ ధ్వనులు ప్ర । తిధ్వనింప
దానవులు వానరులు మహో । త్సాహమునను
హెచ్చరింపఁగ నేపుమైఁ । జొచ్చిరపుడు
యోధవరు లిర్వురును మల్ల । యుద్ధమునకు.

గీ. ఎవ్వఁడెవ్వని గెలుచునో । యెవని నెవఁడు
నేలకుంగూల ద్రోయునో । నిరుపమాన
సమర మిదియంచు నెల్లరు । సంభ్రమింప
ద్వంద్వయుద్ధ మద్భుతముగఁ । బరిఢవిల్లె.

చ. దధిముఖుఁడోడి పోవునని । దానవులున్ దనుజేశపుత్త్రుఁడె
వ్విధమున గెల్చునంచుఁ గపి । వీరవరేణ్యులుఁ దల్లడిల్ల న
త్యధిక బలప్రతాపముల । నద్భుత వైఖరిఁ జూపి శౌర్య నీ
రధులయి యిర్వురున్ సమర । రంగమునన్ గనుపట్టి రత్తఱిన్.

క. ఆఁకొను సింగపుఁ గొదమల
పేఁకను, దెబ్బకుఁ గెరలిన । బెబ్బులుల వలెన్
ఢీకొని యుర్వురుపురుఁ గను
భీకరగతి జంకుఁదక్కి । పెనఁగిరి కినుకన్.

చ. ధరపదఘట్ట నంగదల । దైత్య వరేణ్యుఁడు హుంకరించి యె
వ్వెరవున వైరిఁగూల్తునని । వేమఱుఁ బైకొన వచ్చుచూడ నే
ర్పరి వగుదంచుఁ దప్పుకొనె । వానర పుంగవుఁడీ గతిన్ పర
స్పరజయకాంక్షయిర్వురకు । బాదుకొనెన్ హృదయాంతరంబులన్

చ. అకట మహాబలాఢ్యుల ర । ణావనిఁ గూల్చితి మున్ను; వీఁడు నా
తికమకలన్ గ్రహించి వెను । దీయక నిల్చెనయంచు నుగ్రుఁడై
ప్రకటిత బాహుసత్త్వమున । రాక్షస ముఖ్యుఁడు గ్రుద్ధి నంతనే
పకపక నవ్వుచున్ నిలిచి । వానర ముఖ్యుఁడు వానిఁ బైకొనెన్.

ఉ. పైకొని నంతనే దనుజ । వర్యుఁడు చూచి ప్రగల్భవాక్యముల్
వాకొని, నిన్ను మించు బల । వంతులఁ జూచితినంచు నేర్పునై
డీకొని యుద్ధరంగమున । కీవి రహింపఁ బెనంగి వాలమున్
జేకొని వానరుం డిపుడు । చిక్కిన వాఁడని సంతసించుచున్.

గీ. పుడమిఁ బడద్రోసి పిడికిటఁ । బొడిచినంత
దధిముఖుండోర్చి మెల్లఁగఁ । ధరుణి మరసి
ఒడుపుఁ బరికించి హుమ్మని । హుంకరించి
అసురవరు నేలకుంగొట్టి । యదిమిబట్టి.

ఉ. మచ్చరికించి ధర్మమను । మాటఁ దలంపక క్రొవ్వి యాజికిన్
వచ్చిన వాఁడవంచుఁ గపి । వర్యుఁడు వైరి యురమ్ము గ్రుద్దుమన్
వ్రచ్చినయంతనే యకట । రక్తముఁ గ్రక్కుచు దైత్యుఁ డీల్గె; "హా
చచ్చె నరాంతకుండనుచు । సైనికులెల్లరు నార్చి రత్తఱిన్.

సీ. వానరుండురు తపో । బలమున నధికుఁడై
దనుజేంద్రు సుతుఁ గూల్చె । ననియె నొకఁడు
యుద్ధపద్ధతికి వి । రుద్ధంబుగ వధించె
నన్యాయ్యమే యగు । ననియె నొకఁడు
ఏపాటి బలవంతుఁ । డీ పాటి పోటున
కతిశీఘ్రముగఁ గూలె । ననియె నొకఁడు
దధిముఖుం బడఁద్రోసి । దనుజేంద్ర నందనుం
డాలస్యమును జేసె । ననియె నొకఁడు

గీ. దనుజవరు పుత్త్రుఁడల్పుఁడే । దధిముఖుండు
ఒక్క పిడికిటి పోటున । నుక్కణంచె
అధిక బలవంతుఁడన వచ్చు । ననియె నొకఁడు
అంతకున్ కర్మమే మూల । మనియె నొకఁడు.

మ. అనుకొన్నట్టుల సంభవించె నని దై । త్యస్వామి కంపించుచున్
కనులన్ మోడిచి దుఃఖభారమునఁ గిం । కర్తవ్యతా మూఢుఁడై
యని మూర్ఛిల్లిన యాతనే యధిక రో । షావేశ మేపారగన్
దనుజానీకము వీరవానరతతిన్ । దాకెన్ మహోగ్రాకృతిన్.

గీ. రావణుఁడు వాని పుత్రుండు । రణమునందు
లేక యుండిన నేమాయె । వీర చెడనె
రండు రండని దానవుల్ । గండుమీఱి
శత్రువులఁ దాకి పెనఁగిరి । శక్తికొలఁది.

గీ. అపజయము నిశ్చయంబయ్యె । నపయశంబు
బాపుకొనుటకు పోరాడ । వలయు మనము
అనుచు నాయకులెల్లరు । నసుర భటుల
ననికిఁ బురికొల్పి రెంతయు । నాగ్రహమున.

గీ. రామచంద్రుండు లోకైక । రక్షకుండు
ఆతని వరియింప జయలక్ష్మి । యరుగుదెంచె
శుభ ముహూర్తంబు మనకిది । శూరులార
అనుచు వానరుల్ పెనఁగిరి । యుత్సాహమున.

చ. జయము లభించునే యుఱక । శౌర్యముఁజూపుట వ్యర్థమంచు సం
దియమున సంచలించి వెను । దీయకుఁడీ యెటులైన వైరులన్
రయమున సంహరింపుఁడని । రాక్షసులన్ బురికొల్పి రాత్మలో
భయము పరిత్యజించి ప్రభు । భక్తి పరాయణులైన నాయకుల్.

గీ. దధిముఖుండు ప్రోత్సహింపంగ । ధైర్యమునను
వానరులు సంహరించిరి । దానవులను
దానవులు పోరి రతి నిరు । త్సాహమునను
అంధకారంబు వ్యాపించి । నంత దనుక.

చ. అకట పెనంగ నేటికి జ । యంబు లభించునె వ్యర్థమంచు నా
యకులును లోఁ దలంచి సమ । రావని జంకిన యంత నెల్లరున్
వికలిత చిత్తులై యసుర । వీరులు వైరులు వెంబడింపఁగన్
ఒకని కొకండు దెల్పకయ । యుద్ధము నుండి తొలంగి రంతటన్.

గీ. దధిముఖుండు శీఘ్రముగ నరాం । తకుని శిరముఁ
గైకొని రఘూద్వహునకుఁ గా । న్కగ నొసంగి
నీకు నానతిఁ బాలించి । నిలిచినాఁడ
అనుచు మ్రొక్కిన రాముఁడి । ట్లనియె నెలమి.

గీ. భయము భక్తియుఁ గలిగిన । భక్తవరుల
శ్రద్ధకున్ నేను బద్ధుండ । సంతతంబు;
నీదు భక్తికి మెచ్చితి । నిరుపమాన
మైన బహుమాన మొసఁగెద । వానరేంద్ర.

శా. సంతోషించితి నద్భుతంబయిన దో । స్సారంబుఁ జూపించి య
త్యంత శ్రద్ధవహించి పోరితివి ప్రా । ణాశన్ విసర్జించి; మా
వంతన్ గొంత యణఁగఁ జేసితివి; దు । ర్వారప్రతాపాఢ్యు దు
స్స్వాంతున్ క్రూరు నరాంతకున్ దునుమ గా । శక్యంబె యెవ్వారికెన్.

క. బాలుఁడవు సమర పశ్య
త్కాలుఁడ వతి నిశ్చలుఁడవు । భక్తుఁడవు తపో
లోలుఁడవు నీ విపుడు భూ
పాలుఁడవై యశముఁ గొమ్ము । ప్రజ వినుతింపన్.

చ. వినుము నరాంతకుండఖిల । వీర భయంకరుఁ డీల్గె; వాని ప
త్తనమున కేగి రాజ్యమును । ధర్మపథంబున నేలుకొమ్ము; నా
యనుమతిఁ గొమ్ము సైన్యము స । హాయముగా గయికొమ్ము ధూర్తులా
దనుజు లెదిర్చిరేన్ భయము । దక్కి వధింపుము వానరోత్తమా.

క. భక్తులకు శ్రీరాముండను
రక్తిన్ బ్రేమించుచుండు । రాముని యందా
సక్తిన్ గలిగిన వాఁడు వి
రక్తిన్ సంసార సాగ । రంబున మెలఁగున్.

గీ. అఖిలముఁ ద్యజించి శ్రీరాము । నాశ్రయించు
మానవుఁ డొకండ పరతత్త్వ । మహిమ మెఱుఁగు.
పండితులు రామభద్రుని । భక్తవరుని
తత్త్వము గ్రహింపఁ జాలరు । ధరణియందు

గీ. అఖిల నదులును తమకుఁ దా । మబ్ధిఁ బొందు
చందమున రామభక్తుని । సంతతంబు
సౌఖ్యములు జేరుచుండు సం । సారమునను;
రావణుఁ డెఱుంగఁడయ్యెఁ బ । ర్వత తనూజ.

గీ. లలన! తుచ్ఛ భోగవిలాస । లాలసుండు
పండితుండయ్యు నెంతటి । ప్రాజ్ఞుఁడయ్యు
సత్యము గ్రహింపలేక సం । సార మోహ
వనధిలోఁబడి మూఢుఁడై । మునిగియుండు.

గీ. తనయులు గతించి రొకఁడైనఁ । దక్కకుండ
నన్నయుం బక్కటక్కట । యంతరించె
రాముఁడెవ్వఁడో యెఱుఁగక । రావణుండు
వైరమూనె నహంకార । కారణమున.

క. పురపురఁ బొక్కుచు వెక్కుచు
అరులన్ వధియించు టెట్లు । లంచుఁ దలంచున్
వరుఁడో రాఘవుఁడు పరా
త్పరుఁడో తలపోయఁ డసుర । భర్త లతాంగీ.

చ. తనయులు చచ్చిరెల్లరును దానవ రాట్కుల మంతటింపగా
అనుపమ వీరవర్యులు మహా బలవంతులు నిల్గి రేపునై
నినకుల వర్యునిన్ గెలుచు టెట్లని పొక్కుచు రావణుండు బో
రున విలపించుచుండఁ ద్రిశి రుండరు దెంచి వచించె నీగతిన్.

శా. నానా వీరనికాయ సన్నుతుఁడ నే నానాయకుండన్ భువిన్
నేనుండన్ నినుదేటి చూడవశమే? నీవిట్లు దుఃఖంబునన్
దీనా లాపములాడ నేమిటికి? ని ర్ణిద్రప్రతాపాఢ్యుఁడో
శ్రీనాథుండా రఘూద్వహుండు విజయశ్రీనాథుఁడో చూచెదన్.

చ. తెలిపెద నాలకింపు రణ ధీరవరుండు మహోదరుండు; ని
స్తుల పరరాజ మండల విధుంతుద మూర్తి సురాంతకుండునే,
నలఘు బలాఢ్యులన్ గెలిచి నట్టి యరాతి భయంకరుండ; నీ
వలిగి శరాసనంబుఁ గొని నంతనె రాముఁడు సంచలింపఁడే.

శా. ఏ తన్మాత్రుఁడె లోకభీకరుఁడు లం కేశుండు; దేవాంతకుల్
దైతేయుల్ బలహీనులే? మనుజు లుల్లంఘింతురే యాజిలో
ఖ్యాతింగాంచిన వీరదానవుల; నీ కందక్క భీతిన్ రిపు
వ్రాతంబున్ బరిమార్పలేక చనిరన్ ప్రాణంబులేన్ దక్కనే?

ఉ. మృత్యువు తప్పదెవ్వఁడకు నేగిన భీకరి శత్రు కోటికిన్
భృత్యులమై చరింతుమె శరీరముపై నభిమానమూని; నీ
వత్యధిక ప్రతాపమున నష్ట దిగీశుల గెల్చినాఁడ వా
న్నత్యముఁ దక్కి జంకఁదగునా యిపు డేమయినన్ రణంబునన్.

చ. రగిలిన క్రోధవహ్ని కెద కాఁగఁగ నోర్చుట యెట్లు చావగా
మిగిలిన వీరులన్ గొని సమిత్తుల మంపు పరాక్రమింపఁ గాఁ
దగు జయమో పరాజయమొ దయ్యమెఱుఁగునుగాక యీగతిన్
పొగిలి కృశించినన్ దనుజ పుంగవ లాభము లేదొకింతయున్.

ఉ. ఇంచుక లోఁ దలంపు మిపు । డెల్లరు నీలిగిరంచు జంకి జీ
వించిన పందలం చసుర । వీరుల గట్టదె ముజ్జగంబు? శే
షించిన మేము ఖడ్గముల । జే కొని చావక తప్ప దీతకున్
మించినలోతు మృత్యువును । మించిన హానియు నున్నదే భువిన్.

గీ. ఇంద్రజిన్ముఖ్యరణధీరు । లెల్ల నీల్గి
రున్న వారల్పు లని యెంచి । యుద్ధమునకు
జంకఁ దగదింక మేము ని । శ్శంక తోడఁ
బ్రాణముల సమర్పింతుమ । ప్రభువు కొఱకు.

ఉ. లుంఠిత శాత్రవుండతి బ । లుండు జగన్నుత రక్షకుండు వై
కుంఠుడు రామభద్రుఁడని । కోటి విధాల ఖలుల్ నుతింతురీ
కంఠుని మెప్పుగొన్న దశ । కంఠుఁడకుంఠిత విక్రమోన్నతిన్
శుంఠుని నొక్క మానవుని । శూరునిగాఁ దలపోయఁ జెల్లునే?

మ. పతివై దానవ కల్పవృక్షమనఁగా । భాసిల్లు నిన్ని త్రజిన్
హిత దూరుండవివేకియైన యనుజుం । డెవ్వాఁడుపేక్షించు? నీ
మతిసందేహముఁదక్కియుండుమసుర । క్షోనాథ! సామ్రాజ్యమున్
అతికాయాది మహోదర త్రిశిరు ల । న్యాక్రాంతమున్ జేతురే?

సీ. మీకు విధేయుండ । మేయుండ జేయుండు
తి శిరుండు ధీరుండు । ధీవరుండు
పటు వజ్రకాయుండు । వాహినీ నాయకుం
డతి కాయుఁ డసమానుఁ । డతి బలుండు
దనుజ హార్యక్షుండు, । మన విరూపాక్షుండు
రాక్షసరాజ్య సం । రక్షకుండు
పర భయంకర వర । శర భాసురకరుండు
శరభుండు నృపసింహ । శరభ సముఁడు

గీ. చన్న వీరులకన్న నే । నున్నవాఁడ
హీన బలులంచుఁ దలఁచితే । దానవేశ?
చండ కోదండ పాండిత్య । సరణియంతు
నిపుడు జూపింప మా ధాటి । కెవఁడు సాటి.

క. అని యిట్లు దుఃఖ వన నిధి
మునిఁగిన దనుజేంద్రుఁ గూర్చి । మున్ జెప్ప మహా
వినయంబున వినతుండై
ఎనలేని విధంబున వచి । యించుచు నుండన్.

మ. అతికాయుం డపుడేగుదెంచి నుతిచిం । తాక్రాంతుఁడై యున్న భూ
పతి వీక్షించి వచించె నీ గతి, మనో । వ్యాధిన్ విచారాగ్ని కా
హుతియైనన్ లభియించు నే జయము నీ । వూహించి మా కాన తి
మ్మతి శీఘ్రంబ యొనర్చి వచ్చెదము కా । ర్యంబెట్టిదైనన్ త్రుటిన్.

ఉ. కాలము వచ్చె మాకిపుడు । కాలుని ప్రోలికి నేఁగుటో జయ
శ్రీ లలనా కరాంబుజముఁ । జేకొనియేలుటో? నిర్ణయింప; భూ
పాలక పుత్త్రులన్ గపులఁ । బట్టి వధింపఁగ శక్యమౌనె? నే
డాలమునందు సంశయము । లన్నియుఁ దీఱు విచారమేటికిన్?

చ. దనుజులు వీరసంహరణ । దక్షుల మోఘ పరాక్రమంబునన్
మనుజుల సంహరింప నస । మానులు; సంగర వీధి నెల్లెడన్
గనుఁగొన ధర్మరాణ్మహిమ । కంత ఘళంఘళ కాంస్యకింకిణీ
ధ్వని వినవచ్చుచున్న దది । వైరులకో మనకో యెఱుంగుదున్.

చ. ఎఱిఁగిన లాభమేమి దను । జేశ్వర! కాలము దప్పివచ్చె; నే
డ్తెఱ రిపువీరవర్యుల వ । ధించి జయింపమె? దైత్యుఁ డెవ్వఁడేన్
వెఱచునె మర్త్యమాత్రునకు? । వేయివిధాలఁ బెనంగులాడి యెం
దఱో మన దైత్యులీల్గిరి; వి । ధాత విధాన మెఱుంగ వచ్చునే?

గీ. అనుచుఁ జింతించి మది సంశ । యంబుఁ దోప
వడి విభీషణుఁ బిలిపించి । పలికె నిట్లు
ఆలమత్యాగ్ర గతిని మీ । యన్నతోడ
అంతరింపంగ నున్నది । యసురవర్య.

చ. అలఘు బలాఢ్యులైన సుతు । లాదఁట నీల్గిరి సైన్య మంతయున్
గలవ నశించె; దుఃఖమున । గాసిలి యుండుట దెబ్బఁదిన్న బె
బ్బులివలె రాకపోఁడసుర । ముఖ్యుఁడు విప్రవరుండు, విశ్వస్ర
ట్కులజుఁడసాధ్యుఁ డేసరణిఁ । గూల్చెదఁ జెప్పుము దానవోత్తమా.

చ. రణమున యోధపుంగవుల । రాక్షసులన్ వధియింప లేదె? ఈ
క్షణమునఁ గూల్తు నెంతటి య । సాధ్య బలాఢ్యుని నైననేను రా
వణుఁడు విరించి వంశజుఁడు । పండిత వర్యుఁడు చేతులార బ్రా
హ్మణు వధియించు టెట్లనుచు । మానసమించుక సంశయించెదన్.

గీ. రావణునిఁ గారఁ బెట్టిన । రాజవరుని
కార్తవీర్యార్జును వధించి । ఖ్యాతిఁ గొన్న
భార్గవుఁడు, జగద్ద్రోహి రా । వణుని విడిచెఁ
గారణము బ్రాహ్మణుం డని । గాదె చెపుము.

గీ. గోవులను భూమిదేవులఁ । బ్రోవఁ గాదె
ప్రతినఁ బూనితి నక్కటా । బ్రహ్మకులుఁడు
రావణుఁడు క్రూరుఁడనుఁ గాక । రఘుకులోద్భ
వుండ నేనెట్లు వధియింపఁ । బూనుకొందు.

మ. తొలుతన్ దానవిఁ గూల్చినాఁడ మునిసం । తోషింప; స్త్రీహత్యకున్
కలుషాత్ముండను బూనుకొంటినని దుః । ఖం బెంతయున్ బొందితిన్
జలజాతోద్భవు వంశ సంభవుని వి । జ్ఞాశేముషీధుర్యునిన్
ఖలుఁ డంచున్ వధియించు టెట్లనుశం । కన్ జెందుచున్నా నెదన్.

చ. ఒకఁడొనరించు దోషమున । కుగ్రుఁడవై వధియించినాఁడ వై
త్యకులము, రావణుండెటులఁ । దా తననేరము? చేసినట్టి నే
తకు మతి నిష్ఠుఁడైనఁ బరి । తాపముఁ బొందినఁజాలు నాదు మ
స్తకమున వానిపాద జల । జద్వయిః ధూళి ధరింతుఁ బ్రేమతోన్.

క. "దిగువన్ గన గోహత్యయు
నెగువన్ గన బ్రహ్మహత్య" । యే గతి నకటా
పగ సాధింపఁగ వలయును
తగుమార్గముఁ జెప్పు మనఘ । దైత్యకులేంద్రా.

క. అటుచూడ బ్రహ్మకులజుఁ
డిటు చూడన్ పండితుండు । మృడుభక్తుండున్
కుటిలాత్ముఁడనెడు నెపమునఁ
గటకట వధియింప వలయుఁ । గాదె తలఁపన్

చ. అనిన విభీషణుండు దర । హాసము మోమున నంకురింప ని
ట్లనియె; "మహాత్మ నీవు దను । జాధిపు నిప్పుడు చంపకుండినన్
ఘనులు మునుల్ జనుల్ పిఱికి । గాదలపోయరె నిన్ను? నెట్టులేన్
ధనుజవిభున్ వధించుటది । ధర్మ మధర్మ మొనర్పఁ జెల్లునే?

ఉ. కోపము సంహరించి యొక । సూరిని జంపఁగ జాకవచ్చునే
పాపమొనర్చు దుర్జనుఁడె । వండయినన్ వెనుదీయరాదు, గో
రూపముఁగొన్న వ్యాఘ్రమును । ద్రుంపగ జాకినయట్లగున్; మన
స్తాపముఁ బొందితప్పకువె । క్షాత్రకులోచిత ధర్మమార్గమున్.

ఉ. భవ్యుఁడుగాడు రావణుఁడు । పండితుఁడైనను విప్రుఁడైన క్షం
తవ్యుఁడుగాడు, విప్రకుల । ధర్మముఁ దప్పినదుండగీఁడు హం
తవ్యుఁడు; క్షాత్రధర్మమును । దప్పిచరింతువె?"బ్రాహ్మణోన హం
తవ్య"యనంగ నొప్పిసఁగు । తద్జ్ఞుల వాక్యము చెల్లదిమ్మెడన్.

గీ. దుష్టుల వధించి శిష్టుల । కష్టమరసి
ధరణిఁ బాలించుటలె క్షాత్ర । ధర్మమనఘ;
వంశ ధర్మంబు పాలింప । వలయు నీవు
పాపిష్ఠుఁడు జగద్ద్రోహి । రావణుండు.

సీ. ధర్మంబు జగమున । ధ్వంసంబుఁ గావించి
కుటిల స్వభావంబుఁ । గొన్నఖలుఁడు
బలిమిమై భర్తల । బాధించి బాధించి
యతివలఁ జెఱఁగొన్న । యాతతాయి
సాధుసజ్జన హింస । సతతంబుఁ గావింప
దుష్టులఁ జేర్చిన । దుండగీఁడు
సత్యంబు వంచించు । జగదుపద్రవకారి
కఠిన చిత్తుఁడు జగ । త్కంటకుండు

గీ. అహితమార్గానువర్తి లో । కాపకీర్తి
కించుకంతయు జంకని । వంచకుండు
రావణుఁడు సర్వలోక వి । ద్రావణుండు
వాని వధియింప వెనుదీయ । వలదు వలదు.

గీ. అనఘ! యింద్రజిత్కుంభక । ర్ణాది వీర
వరుల వధియించి యిపుడు రా । వణు వధింప
నేటి కీకీతి మది సంశ । యించె దీవు?
నీ తలంపేమొ యూహింప । నా తరంబె.

గీ. రథముపై నిల్చి పోరాడు । రావణుండు
భూతలంబున నిల్చి నేఁ । బోరు టెట్టు
లనుచు మది సంశయింతువో? । యనిల సుతుఁడు
రథమయి రహించు నీ మనో । రథము గతిని.

ఉ. దుష్టనిశాట నాయకుని । ద్రోహినిఁ జంపఁగ జంకితేని నీ
కష్టము వ్యర్థమయ్యెఁజుమి; । కార్య ఫలంబుఁ బరిగ్రహింప నీ
కిష్టము లేకయున్న నమ । రేంద్రజి ముఖ్యులఁ జంపనేల? వి
స్పష్టముగా వచింపుమ కృ । పా మతిఁ దోఁచిన భావమెట్టిదో?

గీ. అనిన రాముండు దరహాసి । తాస్యుఁడగుచు
అవ్విభీషణుఁ జూచి యి । ట్లనియె ననఘ!
నీవు పలికిన దెంతయు । నీతియుక్త
మిపుడు రావణు వధియించు । టవసరంబ.

చ. త్రికరణ శుద్ధిగా బలికి । తిన్ ధనుజేశున కోహటించి యా
జికి వెనుదీయలేను; శశి । శేఖరు నిత్యము సంస్మరించు దై
త్యకుల విభుండు భక్తవరుఁ । డంచుఁ దలంకితిఁగాక; దైత్య నా
యకుఁడు తనంత తాఁ జెలఁగి । యాజికివచ్చిన నోర్వవచ్చునే?

గీ. ఇపుడు నీ యగ్రజుఁడు బల । హీనుఁడయ్యె
నైన నాయంత నేను బో । రాడఁబోను
అతఁడ ధ్వజమెత్తి వచ్చిన । యపుడు నేను
సంహరింపక సైరింప । శక్యమగునె.

గీ. రథముఁ గవచంబుఁ బద యుగ । త్రాణములును
లేని నేను పోరాడిన, । హాని యుండు
ననుచు మదిని సందేహింపఁ । జనదు నీకు
రాక్షస వరేణ్య! నాకును । రథము గలదు.

సీ. దృఢ మనోబలమనఁ । దేజరిల్లు నమోఘ
రథమున్న యది దాని । విధము వినుము;
శౌర్య ధైర్యంబులన్ । చక్ర ద్వయంబున
శీలమన్ ధ్వజమునఁ । జెలువుమీఱు

బలము వివేకంబు । పరహితంబు దమంబు
నాఁబడు హయములు । నాల్గు గలవు
సత్య క్షమా దయా । శౌచంబులను మంచి
పగ్గంబులున్న వా । వా రువముల

గీ. కతుల ధీశక్తి సారథి । యై రహించుఁ
త్యాగమన్నది యుత్తమ । ధనువు నాకు
నియమ సంయామంబులు నాదు । నిర్మలమగు
హృదయ శరధిని గల లకో । రీలు; వినుము.

గీ. ధర్మకవచంబు ధరియించి । దనుజ విభుని
సంహరించెదఁ ద్రుటిలోన । సంగరమున;
దైవ విశ్వాసముంగల । ధర్మపరుని
నణఁపఁజాలవు వైరుల । యా యుధములు.

గీ. సగము చచ్చిన వాని రా । క్షసుల ఱేని
సంహరింపంగ నిప్పుడు । జంక నలెనె
దైత్య సామ్రాజ్య లక్ష్మికిఁ । దగిన పతివి
సిద్ధముగ నుందు పట్టాభి । షేకమునకు.

గీ. అనుచు శ్రీరామచంద్రుండు । దనుజ వరుని
భావముపొంగు సరణిని । పలికి నంత
సమర రంగంబు నందు ని । స్సాణ రవము
నలుగడల మ్రోఁగె నఖిల జీ । వులు చలింప.

గీ. అవ్విభీషణుఁ డారవం । బాలకించి
ఇంచు కంత యుల్లంబున । సంచలించి
ఆహవోత్సాహ సంరంభ । మానవిల్ల
ఇనకులేంద్రుని వీక్షించి । యిట్టు లనియె.

# లంకాకాండము.

క. "ఇక్కాలపు మానవు లోక
లెక్కా రక్షో విభునకు । లీలన్ దనుజుల్
జక్కాడెద"రను గతి రణ
ఢక్కా నినదంబు దిక్త । టంబుల మ్రోఁగెన్.

గీ. వింటివే రామభద్ర ము । క్కంటి వలని
మెప్పులన్ గొన్న దానవ । మృగ విభుండు
కినుకఁ గెరలిన రుద్రుని । ననుకరించి
భండనంబున కిప్పుడు । బయలు వెడలు.

గీ. అనిన విని రామభద్రుండు । దనుజవరునిఁ
గని భయం పడవలదంచు । ననునయించి
ఎల్లవీరులఁ బిలిపించి । హెచ్చరించి
సిద్ధముగ నుండె నతి ఘోర । యుద్ధమునకు.

సీ. ప్రళయ సంధ్యాకాల । భాను రాగము లీలఁ
గన్నులఁ గెంజాయ । గడలు కొనఁగ
రణరంగ రుద్రుని । రౌద్రి తేజస్స్ఫూర్తి
దశముఖంబుల యందు । తాండవింప
వింశతి భుజముల । వివిధాయుధంబులు
దినరాజు కరముల । ధిక్కరింప
కంఠీరవస్ఫూర్తి । గర్జించి గావించు
కహాకహార్భటికి ది । గ్గజము లడల

గీ. ఆకసము దాకు ధ్వజముతో । నతిశయించు
రథమధిష్ఠించి, వంధిమా । గధులు పూర్వ
సమర వృత్తాంత పద్యముల్ । సమువుచుండ
రణతలంబునకే తెంచె । రావణుండు.

గీ. స్యందనముతో హుటాహుటి । సమరమునకు
దనుజ నాయకుఁ డేతెంచు । తరుణమునను,
వివిధ రణవాద్యములు మ్రోఁగె । భీకరముగ;
సకల శాత్రవ సంతతి । సంచలింప.

శా. సారించెన్ సమరాంగణంబున ధను । ర్జ్యావల్లి నత్యుగ్రుఁడై
వారించెన్ సురరాణ్మదోల్బణము దు । ర్వారాస్త్రశస్త్రంబులన్
కారించెన్ పర వీరకోటి వని జోఁ । కన్ సత్కవుల్ పల్కగన్
పూరించెన్ దనుజాధి నాథుఁడు దరం । బున్ దిక్కు లల్లాడఁగన్.

సీ. "కరముల నవలీలఁ । గందుకంబను లీలఁ
కైలాసమెత్తిన । ఘన బలుండు,
త్ర్యక్షుని సఖుఁడైన । యక్షేశు శిక్షించి
పుష్పకంబును గొన్న । పురుషవరుఁడు
దేవేంద్రు దండించి । దిక్పాలుర జయించి
దాసులఁ జేసిన । దండిమగఁడు
పుడమి వీరుల నెల్ల । గడగడ లాడించి
యశముఁ గైకొన్న లో । కైక ధన్వి.

గీ. అఖిల దిక్చక్ర విజయ ప్ర । యాణ సమయ
సమర ఢక్కానినాద సం । చలిత శత్రు
రాజ మానినీగర్భ వి । స్రావణుండు
రావణుఁడు వచ్చె సంగ్రామ । రంగమునకు.

క. విలయమున జీవులట్టుల
నిల నెవ్వని కోప వహ్ని । కే పడి రిపు రా
ట్కలభంబులు సులభంబుగ
శలభంబుల మాడ్కి మాడి । చచ్చిరి కలసన్.

గీ. అట్టి రావణుఁడెవఁడో ఘ । లాత్ముఁడెఱుఁగు
అసుర విభుఁడెట్టి శూరుండొ । యముఁడెఱుంగు
ఇతరు లెఱుఁగరు మానవు । లెఱుఁగఁ గలరె?
రావణుఁడు ముష్టి తాడితై । రావణుండు?

ఉ. శాత్రవులార! సర్వ కపి । సన్నుత మానవ మాత్రులార! మీ
క్షాత్రము నిల్చునే దనుజ । కాంతుని ముందఱ, గోత్రభూమి భృ
ద్గాత్రుని వీర సింహకుల । కానన సంచయ హేతిహోత్రునిన్
జైత్రుని దానవేశ్వరుని । జంప, జయింప, వశంబె యేరికేన్.

ఉ. ఖండిత శాత్రవున్ దనుజ । కాంతు నెదుర్చునె మానవుండు? వే
దండకు నేగుదెంచి పద । దాసుఁడఁ బోవును దానవేశ్వ రా
దండము దండమంచు భుజ । దండము లెత్తక యుండినన్ గదా
దండముఁ బూని రావణుఁడు । దాశరథిన్ వధియించు నాజిలో.

శా. శుంఠుండో మహనీయుఁడో భువి మహా । శూరుండొ? ధీరుండొ? వై
కుంఠుండో? రఘురామచంద్రుఁడెవఁడో? । కొండంత వాఁడైన; శ్రీ
కంఠున్ మెచ్చని పంక్తి కంఠుఁ డతసిన్ । ఖండింప నేతెంచెఁ బో
ఠంఠం నాదము మాఱు మ్రోఁగఁగ ధను । ష్టంకారమున్ జేయుచున్.

మ. కుల శైలంబులతో దిశాకరులతో । క్షోణీతలంబెల్ల వ్యా
కులమున్ బొందుచు దిర్దిరం దిరుగు; సం । క్షోభించు నంభోధి; నా
కుల లోకంబు దిశాధినాథు లడలన్ । ఘూర్ణిల్లి కంపించు; సం
కుల యుద్ధంబున దైత్య కేసరి కడున్ । కోపించి గర్జించినన్.

క. అని యిట్లు వంధిమాగధ
జనమతి గంభీర సరణి, । సంభాషింపన్
ధనుజు లహంకృతి వాద్య
ధ్వనులను గావించి రంత । దనుజ విభుండున్.

గీ. చక్రవాళ పర్యంత భూ । చక్రమునను
ప్రాణికోటికి నతి భయో । త్పాత మొదవ
దిశల ఢమఢమ ధ్వనులు ప్ర । తి ధ్వనింప
డమరు మ్రోఁగించె భైరవా । డంబరమున.

గీ. రావణుఁ డొనర్చు నాడంబ । రంబుఁ గాంచి,
దనుజవిభు శీవిఁ బరికించి, । స్థైర్యమునను
అతఁ డేతెంచి యని నిల్చు । టరసి రామ
భద్రుఁడు విభీషణునిఁ జూచి । పలికె నిట్లు.

గీ. రావణుని రణారంభ సం । రంభమునకు
కోపమునకును భీకరా । టోపమునకు
శాత్రవుం డెట్టివాఁడైన । సంగరమున
సగము చచ్చినట్లుండు ని । స్సంశయముగ.

చ. సుతులుజయేంద్రరాహ్వదయు । దారులుశూరులమోఘవిక్రమో
న్నతులు, గతించినన్, సమర । నాయకు లెల్లరు నీల్గినన్ నిజో
న్నతిఁ బ్రకటించుచున్ దనుజ । నాయకుఁ డీగతి నిశ్చలాత్ముఁడై
అతి ధృతి నేగుదెంచుట ది । యక్కజమౌఁ గద నిక్కువంబుగన్.

గీ. అని విభీషణుతోడ న । య్యినకులుఁడు
మాటలాడుచు నుండ ని । శాట కోటి
రావణుని యానతిం గొని । రాఘవులను
ముట్టడింపంగ వెడలె న । మోఘ గతిని.

ఉ. అంతట రామచంద్రుఁ డసు । రాధిపుఁ గాంచి వచించె నిట్లు "వా
క్కాంతునిచే వరంబులను । గైకొని నట్టి మహా బలాఢ్య నీ
వెంతటి వాఁడవయ్యు వధి । యింపక మానను నిన్నుఁ బ్రోవఁ, గా
లాంతకుఁ డేగుదెంచి సమ । రాంగణమందు పరాక్రమించినన్.

క. అని రాముఁడు కపి సైన్యముఁ
గని యిట్లనె మీరు గొన్న । కష్టంబుఁకున్
వినుఁడు ఫలంబు లభించున్
వెనుదీయక యిపుడు చెలఁగి । పెనఁగిన యంతన్.

క. ఇది సమఁరము విజయముఁ గొనఁ
దుది యుద్ధంబాచు నెల్ల । దోషాచరులున్
కదనమున కేగుదెంచిరి
మది జంకక శాత్రవులను । మర్దింప నలెన్.

గీ. అనిన విని వీరవానరు । లాహవమున
నుత్సహించిరి హుమ్మని । హుంకరించి;
రావణుని యానతింగొని । రాక్షసులును
ప్రాణముల నాశ విడిచి పో । రాడి రపుడు.

శా. ఘోరాజిన్ జగదేక వీరులను ధి । క్కొ్కలంకను ఖ్యాతికై
క్రూరాస్త్రంబుల సంహరించితిని,యా। క్రోశించె ముల్లోకముల్;
ఏ రాజన్యుఁడు నన్ జయించె? వినుమీ। వేపాటి వీరుండవో?
రారా రాజకుమార రామయనుచున్ । రక్షోవిభుండుగ్రుఁడై.

గీ. రథము నడపించి యెదిరించె । రామచంద్రు;
రథము లేకున్న జంకక । రామభద్రుఁ
డసుర విభుఁడాకి విడిచెఁ బుం । ఖాను పుంఖ
బాణములఁ భక్తలోక సం । త్రాణములను.

గీ. వేదశాస్త్రంబులఁ పఠించె, । విద్యలకని
పండితుల మెప్పులంగాంచెఁ, । బ్రాజ్ఞుఁడయ్యె
రావణుఁ డెఱుంగఁడయ్యె శ్రీ । రామచంద్రుఁ;
చదువు, ఖలులకు నిప్రయో । జనము గిరిజ!

క. దశరథ సుతుఁ దాకిన దు
ర్దశ తనకు ఘటిల్లు ననుచుఁ । దలపోయక య
ద్దశ, గళుఁ డెదిర్చె ననదృశ
దశవేషిన్ సత్యభాషి । దనుజ ద్వేషిన్.

గీ. గరుడ గంధర్వ యక్ష రా । క్షసుల కేని
అతి భయంకరమై యాల । మతిశయించె
రామరావణ సంగ్రామ । రంగమునను
విజయకాలంబు మూర్తి భ । వించె గిరిజ.

గీ. రావణు నెదిర్చి పోరాడు । రాముఁ జూచి
కపులు దనుజులఁ దార్కొని । కసిమసంగి
రిపుకులుని సంగరోత్సాహ । మినుమడించె
నసుర నాథుని కోప మ । త్యధికమయ్యె.

క. దనుజేశుని కోపమునకు
దనుజాలు ప్రాణాశ విడిచి । ధైర్యస్ఫూర్తిన్
వెనఁగిన కొలఁదిన్ కపులన్
వెనుదీయక పోరి రసుర । వీరులు బెగడన్.

చ. దనుజ విభుండు మెచ్చుకొనఁ । దాకిన దైత్యుల యాయుధోత్కర
ధ్వనులకు హుంకరించు వర । వానర వీరుల వక్త్రగహ్వర
ధ్వనులకు, భీకరాస్త్రసము । దాయసముద్గత వహ్నికీలకున్
అనుపమమై రణంబు ప్రళ । యంబు విధంబునఁ దోఁచెఁ బార్వతీ.

గీ. హనుమదంగద ప్రముఖు ల । య్యాహవమున
అసుర వీరులఁ దునుమాడి । రద్భుతముగ
అనిల పుత్త్రుని యుద్రేక । మణఁచఁ జాలు
దానవుం డొక్కఁ డా నాడు । గానరాడు.

ఉ. రామునితోడఁ బోరుచును । రావణుఁడా హనుమంతుపై శర
స్తోమము నేయు, లక్ష్మణుఁడు । తోడనె తచ్ఛరకోటిఁ ద్రుంచు, ను
ద్దామ బలంబునన్ హనుమ । దానవ వీరుల సంహరించు; సం
గ్రామ తలంబు వేగనులఁ । గాంచి రహించె సురేంద్రుఁడ త్తఱిన్.

శా. క్షోణీమండలి దద్దరిల్ల దిరిగి సం । క్షోభింప నొక్కుమ్మడిన్
బాణంబుల్ భటకోటిపై విడిచె సం । భావింపఁగా సంగర
స్థాణుండీరఘురామచంద్రుఁడనుచున్ । దైత్యుల్ భయభ్రాంతితోఁ
బ్రాణాశన్ విడనాడి పోరిరి కపి । వ్రాతంబు భీతిల్లగాన్.

ఉ. రాముని బాణకోటి తన । రాణువపైఁ బడకుండఁదుంచి శ్రీ
రామునిపై భయంకర శ । రంబుల నేయుచు రావణుండు సం
గ్రామమునన్ విరోధులకుఁ । గాలునిఁబోలి మెలంగినంత శ్రీ
రాముఁడమోఘ బాణముల । రావణుపై విడిచెన్ మహోగ్రుఁడై.

గీ. రాముని యమోఘ బాణ వ । ర్షమున కపుడు
దశశిరఃకిరీటస్థ ర । త్నములు డుల్లె
స్యందనము సంచలించె న । శ్వములు బెదరె
రావణుని భావమున భయం । బావరించె.

ఉ. రివ్వున నేగు ముల్కి గమి । ఱెక్కల వాయు వమోఘవైఖరిన్
చివ్వున దాకి రావణుని । చేతుల నల్లల నాడఁజేయఁగా
నవ్వుచు రాఘవుం డసుర । నాయకుఁగాంచి నచించె నీగతిన్
చివ్వకుఁ గాలుదువ్వితివి । చేకురుఁ దత్ఫలితంబు తాళుమా.

ఉ. నావుడు హుంకరించి వద । నంబు లొకించుక జేవురింపఁగా
రావణుఁ డట్టహాసమున । రాముని నెంతయు ధిక్కరించి నీ
చేవ యెఱుంగుదున్ దనుజ । శేఖరుచేవ యెఱింగెదీ వహం
భావ వశంబునన్ బలుకు । వాదులు బాకులు గావు రాఘవా.

గీ. అనుచు రావణుఁ డత్యాగ్ర । హంబుతోడ
వివిధ సాయక వితతిని । విడిచినంత
ఆ శరంబులు రాముని । నావరించె
పులిని వన దంశములు మూఁగి । ముసగి నట్లు.

శా. ఆవేళన్ రఘురామచంద్రుఁడు మహా । హంకార మేపార నా
శా వీధిన్ నినదంబు ఘూర్ణిల ధను । ర్జ్యావల్లి సారించి వీ
రావేశంబున దానవేశ్వరుని శ । స్త్రాస్త్రంబులన్ ద్రుంచి దై
త్యావష్టంభ మణంచె నుగ్రుఁడయి లో । కైక ప్రతాపాఢ్యుఁడై.

గీ. రావణు,వధింపఁ జాలునా । రాఘవుండు?
అనెడు సందేహ మించుక । యంకురింపఁ
దల్లడిల్లిన దేవేంద్రుఁ । డుల్ల సిల్లి
ధైర్యమున్ గొనె నిప్పుడ । హార్య తనయ.

మ. వెనుదీయన్ విలయాంతకుండు కినుకన్ । వేంచేసినన్ రాఘవా
ఘన బాహాబల శక్తిఁ గ్రాలిన మహా । కాండీరులన్ నేర్పుమై
నని లోఁగూల్చితి నీవనంగ నొక లె । క్కా? డింభకా! చూడుమా"
యని బాణంబుల నేసె రావణుఁడు ప్ర । త్యాలీఢ పాదస్థుఁడై.

ఉ. ఏపుమెయిన్ దశాననుఁడ । నేక శరాసనముల్ ధరించి వాల్
దూపుల వాన, వానరులు । తొట్రిలగన్ గురిపించి నంతనే
కోపము మట్టుమీఱ రఘు । కుంజరుఁడున్ చెలరేగి వాని యా
టోపమణంచి దోర్యుగ ప । టుత్వముఁజూపెఁ జగన్నుతంబుగన్.

ఉ. భాను కులోత్తముండు శర । భంబు విధంబున, రావణుండు పం
చానన మట్లుదోఁపఁ గపి । సైన్యము చూపె భుజప్రతాపమున్
దానవవీరులున్ భయముఁ । దక్కి మహాయుధ సంచయంబుతో
భానుసుతాంగద ప్రముఖ । వానర వీరులఁ దాకి రత్తఱిన్.

గీ. కదన తలమున రావణ । మదగజమును
సంహరించఁ బో రాఘవ । సింహమనుచు
వానర కులంబు జయజయ । ధ్వనులొనర్చి
దైత్యుల వధింపఁ జొచ్చె ను । ద్దండ గతిని.

గీ. సమరమునఁ జచ్చినట్టి రా । క్షసుల యాయు
ధములఁ జేకొని కపులు కొం । దఱు సమాన
విక్రమంబున దానవ । వీరవరులఁ
దునుమఁ దొడఁగిరి సౌమిత్రి । తోడ్పడంగ.

గీ. అంగదుఁడు జాంబవంతుండు । నర్కసుతుఁడు
అంగరక్షక భటులట్టు । లనుసరింప
హనుమ, యుత్తాలవాల వ । జ్రాయుధమున
అసుర కుధరంబులను ద్రుంచె । నాహవమున.

మ. తుదియుద్ధంబిదియుగ్రుఁడై స్వయముఁగా । దోషాచరేంద్రుండు ప
ట్టుదలన్ గైకొనివచ్చె; వానరుల యా । టోపంబు వారించి య
భ్యుదయంబొందుట చచ్చుటో యనుచు దై । త్యుల్ ధీరులై క్రూరులై
సదసద్జ్ఞానముఁ దక్కి చూపిరి నిరా । శా దోర్బలోద్రేకమున్.

మ. అదియాలంబొ మహాలయంబొ దనుజా । ధ్యక్షుండు రక్తాక్షుఁడై
పదికోదండములన్ ధరించి విడిచెన్ । బాణంబులన్; వానరుల్
సద యా రాఘవ! దైత్యశిక్షక! జగ । త్సంరక్షకా! రావణ
ప్రదరంబుల్ బహుభీకరంబు లనుచున్ । పర్వెత్తిరొక్కుమ్మడిన్.

చ. పరుగిడుచున్న వానరుల । వాయుసుతుండు మఱల్చి నిల్పె; సు
స్థిరగతి లక్ష్మణుం డసుర । సేన కడుంగడుఁ దల్లడిల్లగన్
శరసముదాయమున్ విడిచె; । స్థైర్యము ధైర్యముఁ బాదుకొల్పి భీ
కరగతి వానరుల్ దనుజ । కాంతు పయింబడి రుగ్రమూర్తులై.

గీ. దనుజకాంతుండు వివిధ కో । దండముక్త
శరపరంపర విడిచి వా । నరుల( దోలె
ముసరి మూగిన వనదంశ । ములను చెల(గి
వాలమున( దోలు వ్యాఘ్రంబు । వరుస( దోప.

గీ. ఆగ్రహోదగ్ర విగ్రహుం(డై యమోఘ
బాణముల నేయు లక్ష్మణ । స్వామి ధాటి
కడలి సడలిరి దానవు । లసుర విభుఁడు
వెఱచి పర్వెడ వలదంచు । నఱచుచున్న.

మ. ఒకయోరన్ రఘురామచంద్రు( డసుర । వ్యూహంబు చెండాడ; వే
ఱొకచాయన్ చెలరేగి లక్ష్మణుఁడు కో । పోద్రేకమున్ జూప, నిం
కొకపజ్జన్ రవినందనాది కపి ము । ఖ్యుల్ దైత్య సేనాధి నా
యకులన్ దాకి వధింప(జొచ్చిరి; మహా । హంకార మేపారగన్.

గీ. అసురనాధుండు కర్తవ్య । మరసి యరసి
తొలుత లక్ష్మణుఁదాకి త । ద్దోర్బలంబు
వణ(పకుండిన నిత్తఱి । నసురబలము
నిలుప శక్యంబు గాదని । నిశ్చయించె.

చ. స్థిరముగ నాజిలో నిలిచి । చేకొనుఁడీ జయలక్ష్మి; భీతిచే(
బరుగిడి నంతనే బ్రదుక । వచ్చునె దానవులార! యెట్టు లేన్
తరుణముఁజూచి లక్ష్మణుని( । దాకి యణచెద వాని విక్రమ
స్ఫురణము; తాల్మిఁదక్కి వెను । జూపిన దైత్యులసంహరించెదన్.

గీ. అనుచు లక్ష్మణు నెదిరించి । యసుర విభుఁడు
అస్త్రముల శస్త్రముల నేసి । యదనుజూచి
శక్తి సంధించి విడిచె దో । శ్శక్తి మెఱయ;
లావు విడనాడి మూర్ఛిల్లె । లక్ష్మణుండు.

గీ. అంత హనుమంతుఁ డచ్చోటి । కరుగుదెంచి
దనుజ నాథుని తూపులఁ । దప్పుకొనుచుఁ
జెలఁగి లక్ష్మణుఁ గొంపోయె । శీఘ్రగతిని;
రాముఁడే తెంచి యెదిరించె । రాక్షసేంద్రు.

శా. వీరావేశమునన్ భయంకరగతిన్ । వీరాధికుండై మహా
క్రూరాస్త్రంబులనేయుచున్ జెలఁగు రక్షోనాధువీక్షించి యా
రారా రాక్షస రాజయంచు నరసింహ స్ఫూర్తి దీపించుచున్
శ్రీరాముండు ధనుర్ధరుండయి యెది । ర్చెన్ వేల్పులగ్గింపఁగన్.

గీ. అంత సౌమిత్రి క్రోధ తా । మ్రాక్షుఁడగుచు
లేచి సంగ్రామ రంగంబుఁ । జూచి రామ
చంద్రుఁ డసురేశుతోఁ బోరు । సరణిఁ గాంచి
యోడు గలచుచు నచ్చోటి । కరుగుదెంచి.

శా. అన్నాళీకభవ ప్రదత్తమగు శక్త్యస్త్రంబునన్ నేలకున్
నన్నున్ గూలఁగఁద్రోసె నెవ్వఁ డతనిన్ । దండింప కెట్లోర్చెదన్
మన్నారాచ పరంపరన్ దనుజునిన్ । మర్దింతు నొక్కండనే
అన్నా! తాళుమ యంచుఁ దాఁ గవిసె దైత్యాధీశునత్యుగ్రుఁడై

మ. కినుకన్ గన్నులు కెంపులన్ దెగడ, "శిక్షింతున్ పరీక్షింతు ని
ద్దనుజాధీశుని" నంచు జ్యారవమునన్ । ధర్షించుచున్ లక్ష్మణుం
డని వార్యుండయి సారథిన్ దునిమి రథ్యవ్రాతమున్ జంపి స్యం
దనమున్ గూల్చినయంత రావణుఁడు నూత్న స్యందనారూఢుఁడై

గీ. లక్ష్మణు నెదిర్చి "చూడు నా । లక్ష్యశుద్ధి
యనుచు దశహస్తముల శరా । సనము లూని
వివిధభంగులఁ దన ధను । ర్విద్యఁ జూపి
బాణవర్షంబు గురిపించె । భయదగతిని.

గీ. రాక్షస విభుండు విడిచిన । ప్రదరములను
నేర్పు దీపింప ఖండించి । నిరుపమాన
నిశిత నారాచముల నేసి । నిలువరించి
రావణునిఁ జూచి యిట్లనె । రాజసుతుఁడు.

మ. అరి లోకాంతకులైన యీ రఘువరుల్ । హంవీరకంఠీరవుల్
ధరణిన్ బుట్టని నాడు చూపితివి దో । ర్దర్పంబమోఘంబుగన్
సురలున్ సాధువులున్ మునీశ్వరులు సం। క్షోభింప; నీనాఁడు నీ
శరసంధాన విధాన చాతురిని మె। చ్చున్ యాతుధానాగ్రణీ."

గీ. అనిన విని మాఱుమాటాడ। కసుర విభుఁడు
పెక్కు తూపుల నేపుమై । విడిచి విడిచి
నేను పీఁడసాధ్యుండయి । నెగడ ననుచు
సమర విముఖుఁడై యించుక । సంచలించె.

ఉ. శుంభదమోఘ విక్రముల । శూరుల ధీరుల సంహరించి సం
రంభమునన్ జయేందిరఁ గ। రంబనురక్తి గ్రహించినాఁడ నీ
డింభకుఁ డక్కటక్కట క । డింది మగంటిమిఁ జూపెనంచుఁ దా
స్తంభిత గాత్రుఁడై నిలిచె । దైత్యవిభుండు ప్రకంపితాత్ముఁడై.

గీ. అంత సౌమిత్రి భాస్కరం । డస్తమించె
స్నాన సంధ్యాద్య నుష్ఠాన । సమయ మనుచుఁ
గదన రంగంబు విడిచె; రా। క్షస విభుఁడు
సదనమున కేగె సంతప్త । వదనుఁ డగుచు.

గీ. వైరుల జయింప నూతనో । పాయ మరసి
బహువిధంబులఁ దర్కించి । పట్టుదలను
దశముఖుండు చైత్ర బహుళ । దశమినాఁడు
చెలఁగి పాతాళ హోమంబు । సేయఁజొచ్చె.

గీ. యాగములకు హోమములకు । యజ్ఞములకు
ప్రభువరుఁడెవండు ఫలమిచ్చు । వాఁడెవండు
రామచంద్రుండు గాక; యా । రావణుండు
మూర్ఖుఁడు గ్రహింపఁ జాలక । మోసపోయె.

ఉ. దీమసమాత్మ నెక్కొనఁగ । దీక్షవహించి "పరాక్రమించి సం
గ్రామమునన్ జయింతు రఘు । రాముని"నంచు దృఢప్రతిజ్ఞతో
హోమమొనర్చుచున్నదను । జోత్తముయత్నము వ్యక్తమయ్యెఁబో
ధూమముచే నభంబునను । తోయజ మిత్రుఁడ గోచరుండుగాన్.

గీ. అమిత ధూమంబు దిక్కుల । నాక్రమింప
నెల్లర కెఱుంగనయ్యె దై । త్యేశు యత్న
మంతట విభీషణుండు భ । యప్రకంపి
తాత్ముఁడై రామునిం జూచి । యనియె నిట్లు.

శా. భావింపన్ గడు భీకరంబగు మహా । పాతాళ హోమంబు వే
గావింపంగఁ దెలంగె నేడు దృఢ సం । కల్పంబుతోడన్ దశ
గ్రీవుం డద్భుతమైన కార్యమిది ని । ర్విఘ్నంబుగాఁ జేసెనేన్
దేవా! వాని వధింపఁజాలఁడు మహా । దేవుండు నిక్కంబుగాన్.

ఉ. ఊహాకతీతమైన మహి । మోజ్జ్వల హోమము పూర్తిఁజేసి పూ
ర్ణాహుతి యిచ్చెనేని విల । యాంతక తేజముతో మహాహవో
త్సాహముతో రణంబునకు । దానవనాథుఁడు వచ్చెనేని సం
దేహములేదు వాఁడలిక । నేత్రునినైన జయించు వేల్మిడిన్.

గీ. నాడు దక్షాధ్వరంబును । పాడుజేసి
నట్టి వీరభద్రునిఁబోలు । దిట్టరులను
హనుమదంగద ప్రముఖులఁ । బనిపి వాని
యధ్వరము ధ్వంసముం జేయ । నగునుమనకు

చ. అనవిని రామచంద్రుఁ డపుఁ । డౌనని యానతి యిచ్చినంతనే
హనుమయు, వాలిపుత్త్రుఁడు ర । యంబున వానర వీరకోటితోఁ
జని రభసంబునన్ దనుజ । సంఘముఁ గూల్చుచు యజ్ఞవాటికన్
గనుఁగొని యందు రావణుని । గాంచిరి హోమ మొనర్చుచుండఁగన్.

క. క్షేమము తనకున్ రిపులకు
క్షామము వాటిల్లు ననెడు । సంకల్పముతో
ధూమము వ్యోమముఁ దాకగ
హోమముఁ గావించె దాన । వోత్తముఁ డెలమిన్.

ఉ. మౌనముఁ బూని దీక్షఁ గొని । మౌనివిధంబున నిచ్చటన్ బక
ధ్యాన మొనర్చినన్ విడువ । మంచు నెఱుంగవె? దక్షయజ్ఞ మే
మైనది నీ వెఱుంగవలె । నంచు నహంకృతి హుంకరించుచున్
వానరవీరు లధ్వరము । ధ్వంస మొనర్పఁ గడంగి రత్తఱిన్.

క. "దానవకుల నాశన యో
మానవ మాంసాశన రిపు । మార్గణ కాంక్షున్
ధ్యానముఁ జేసిన విడుతురె
వానరు"లని వాని యజ్ఞ । వాటిక నకటా.

గీ. ధ్వంసమును జేసి రంతనే । దాన వేశుఁ
డాగ్రహావేశమునను మ । హోగ్ర గతిని
వైరుల వధించుచుండ న । వ్వాలి సుతుఁడు
అంతిపురి నున్న కాంతల । నగడు పఱచె.

గీ. అంతిపురిఁ జొచ్చి యంగదుం । డంగనలను
బట్టి యవమాన మొనరింప । బిట్టు కినుక
నసుర నాయకుఁ డచ్చోటి । కరిగినంత
వెంబడించిరి వానర । వీరవరులు.

గీ. కోపమున దుఃఖమునను ర । క్షోవిభుండు
హనుమదంగద ప్రముఖుల । యాగడంబు
అణఁపఁ జాలక పురికొల్పె । నసురభటుల
రావణుని యంతిపురి యుద్ధ । రంగమయ్యె.

ఉ. దానవ వీరులున్ జెలఁగి । దానవ కాంతలు నాయుధంబులన్
బూని యెదిర్చి నంత కపి । పుంగవు లంగనలన్ వధింపఁగా
నానతి యీయలే దినకు । లాధిపుఁడంచుఁ దొలంగి శేరికిన్
హాని యునర్పలేక యసు । రాధిపునింగని యీసడించుచున్.

గీ. దనుజపతి వైరులంజూతి । తలల నూచి
దనుజ వీరులఁ గాంచి చే । యునది లేక
యోర్పు వహియించి వేడి ని । ట్టూర్పు పుచ్చి
ఆలమున సేన నిలుపంగ । నానతిచ్చె.

ఉ. "అక్కట నే నొనర్చిన ప్ర । యత్నము సర్వము వ్యర్థమయ్యె నిం
కెక్కడియుద్ధమే గతి జ । యించెద రాముని? యోధసింహులన్
పెక్కుర సంహారించి పృథి । విన్ నిరపాయగతిన్ చరించి పెం
పెక్కిన నన్ను వేడు బల । హీనుఁడు మర్త్యుఁడు సంహరించునే?

గీ. హేయమనియైనఁ దలఁపక । యీ యవస్థ
అధమవిధి నాకు ఘటియించె । నక్కటకట,
మనుజ భుక్కుల మనుజులు । దునుముటేమి?
అధమ విధి సేయలేని కా । ర్యంబు గలదె.

గీ. అని విచారించి హాని లే । దని తలంచి
అత్యధిక ధైర్యము వహించి । దైత్య విభుఁడు
రథమధిష్ఠించి వెడలె సం । గ్రామమునకు
దిశల దుందుభి ధ్వనులు ప్ర । తిధ్వనింప.

ఉ. రావణుఁ డేగుదెంచె సమ । రంబునకున్ వెనుదీయకుండఁ దా
జావగ వచ్చెనో చెలఁగి । శాత్రవులన్ బరిమార్పవచ్చెనో
దైవమెఱుంగు; భీతిలక । దానవులన్ బరిమార్ప లెండు సు
శ్రీ విజయాభి రాముఁడగు। శ్రీ రఘురాముని సంస్మరించుచున్.

క. ఇది తుది యుద్ధము రావణుఁ
డెదలేని ధృతిన్ వహించి । యేతెంచెఁజుడీ
కదనంబునకున్, వెనుదీయక
పదమడ మొనరింప వలయు । శాత్రవకోటిన్."

గీ. అనుచు హనుమంతుఁడు వచించి । నంత కపులు
అతని యానతి నాదల । నవధరించి
సమరమున నిల్చి నంతనే । యమర విభుఁడు
తరుణమిది యంచు నూతనో । త్సాహమునను.

గీ. మతి విచారించి యెంతయు । ధృతి వహించి
"రామచంద్రునకున్ దివ్య । రథముఁబంపఁ
దగిన తఱి"యంచుఁ దలఁచి స్యం।దనము తోడ
సారథిన్ మాతలిన్ బంపె । సత్వరముగ.

గీ. అమర నాథుని సారధి । నాదరించి
రథమును పరిగ్రహించె శ్రీ । రఘువరుండు
అసురనాథుఁ డీ వృత్తాంత । మాలకించి
అమరనాథుని దూషించె । నాగ్రహమున.

గీ. లోకులకు హర్షమిగు రాత్రి । లోకబాంధ
వుండు పూర్వాద్రి భాసిల్లు । పొలుపుదోప
శ్రీరఘువరుండు రథమధి । ష్ఠించి నంత
అంబరమునుండి పుష్ప వ । ర్షంబు గురిసె.

గీ. శీర్షము సుమంబులన్ గ్రాల । హర్షమునను
రామచంద్రుండు పుష్ప వ । ర్షంబు వలన
ఆహవోత్సాహమున్ బొందె । నమరకోటి
జయజయా రావములఁ జేసి । సంభ్రమింప.

సీ. ముని పుంగవ వ్రాత । పూజ నీయంబయి
వరజటా ముకుటంబు । భాసిలంగ
కోమల జలధర । శ్యామలాంగంబుపై
రమణీయ పీతాంబ । రము రహింప
ఆశ్రితకోటికి । నభయ ప్రదంబులై
యాజానుబాహువు । లతిశయింప
పంచానన స్ఫూర్తి । ప్రకటించు మధ్యంబు
తూణీర యుగళంబు । తోడఁగ్రాల

గీ. శ్రీ మనోహరో రస్థలిన్ । భృగుమహర్షి
పాద చిహ్నంబు నేత్రోత్స । వంబుగాఁగ
శార్ఙ్గ కోదండ హస్తుఁడై । స్యందనమున
నలరె రాముండు బ్రహ్మాదు । లభినుతింప.

సీ. నందనోద్యాన వ । నప్రభూత లతాంత
గంధంబు వహియించి । గాలి వీవ
సంతోష పారవ । శ్యంబున దేవతా
నాళీ శిరోమణుల్ । నాట్యమాడ
అఖిల వానరకోటి । కావేశ ముదయింప
దేవ దుందుభు లెల్ల । దిశల మ్రోగ
విజయంబు చేకూరు । వీరరాఘవ యంచు
నమర గురుండు శ్లో । కములఁ జదువ

గీ. వినయ మిగురొత్త సౌమిత్రి । యనుసరింప
హనుమదంగద ప్రముఖ వీ । రాధి వీరు
లంగ రక్షక భటులయి । యరుగు దేర
రఘుకుల వరుండు వెడలె సం । గ్రామమునకు.

గీ. దివ్యమంగళ విగ్రహా । మవ్యయ గతి
స్యందనంబున దీపింప । నమరు లెల్ల
కుసుమములఁ జల్లి జయము చే । కూరు నీకు
విజయ రాఘవ యంచు దీ । వించి రపుడు.

సీ. భూకంపము జనింప । నాకంబు విచలింప
బ్రహ్మాది దేవతల్ । ప్రస్తుతింప
సప్తాంబునిధు లందు । సంక్షోభ ముదయింప
సప్తాశ్వుని రథంబు । సంభ్రమింప
వీరులు వినుతింప । విజయలక్ష్మి వరింప
నసురకోటికి భీతి । యావరింప
సత్త్వసంతతి సాధ్వ । సమునఁ బ్రధావింప
దిశల నాదంబు ప్ర । తిధ్వనింప

గీ. సప్తకుల పర్వతంబులు । సంచలింప
జానకీదేవి యెంతయు । సంతసింప
రామచంద్రుండు త్రిభువన । రక్షకుండు
ధనువు బ్రయోగించెఁ దనదు స్యం । దనము నడుమ.

గీ. రామచంద్రునిఁ బరికించి । రావణుండు
అట్టహాసంబు గావించి । యసుర కోటిఁ
గపులఁ దాకంగఁ బురికొల్పెఁ । గదన సీమ
ప్రళయ కాలంబుఁ బోలెఁ బ । ర్వత తనూజ.

ఉ. ఇంక జయింప శక్యమగు । నే రణభీముఁడు గాక రాముఁడన్
శంక జనించియున్ దనుజ । సత్తముఁ డత్తఱి నించుకంతయున్
జంకక జ్యానినాదము ది । శావలయంబున మాఱుమ్రోఁగఁ దా
బింకమునన్ జెలంగి నడ । పించె రథంబుఁ గడున్ రయంబునన్.

ఉ. సైన్యము మధ్యభాగమున । స్యందనముల్ నడువన్ జిగీష యు
న్యోన్యజిఘాంస యాస్యముల । యందుఁ గనంబడ రామరావణుల్
జన్యము నర్పఁ జొచ్చిరి ని । శాత శరంబులు యుద్ధరంగ మం
దన్యులఁ దాకి ప్రాణముల । కాపద వాటిలఁ జేయ నల్లడన్.

గీ. వానరులు దానవులఁ దాకి । జయముఁ దక్కి
సంహరింపంగఁ దొడఁగిరు । త్సాహమునను;
యాతుధానాయుధ సమూహ । మా హవమున
శాత్రవుల నొడ నిష్ఫలో । జనములయ్యె.

ఉ. ఇంతకుమున్ను యుద్ధముల । నెల్ల విరోధుల సంహరించి ప్రా
ణాంతకముల్ మహాహవజ । యప్రదముల్ బహుభీకరంబులం
చెంతయుఖ్యాతిఁ గొన్న శిత । హేతిసమూహము వ్యర్థమయ్యె; దై
త్యాంతకుఁడైన రాముని మ । హాత్మ్యమ దెట్టిదొ మానినీమణీ

గీ. దనుజనాయకు భీతిచే । నసురభటులు
సంగరమున నిల్చిరి నిరు । త్సాహమునను
అంతకంతకు రణరంగ । మసురకోటి
కంతకుని పట్టణంబయ్యె । నద్రిపుత్రి.

శా. ఏమైనన్ వెనుదీయరాదు వినుఁడీ । యీవేళ యుద్ధంబునన్
రామాస్త్రాగ్నికి మృత్యుదేవికి శరీ । రంబుల్ సమర్పించి మీ
స్వామిన్ బ్రోచి యశశ్శరీరులయి యా । చంద్రార్కమున్ నిల్వుఁడీ.
సామర్థ్యంబును జూపుఁడీ వసుధ మీ । సామ్రాజ్యమున్ నిల్పుఁడీ.

గీ. అనుచు నాయకు లెల్లరు । నసురభటుల
నరుల నెదిరింపఁ బురికొల్పి । యాయుధములఁ
దగినరీతిఁ బ్రయోగించి । దనుజ విభుఁడు
మేలు మేలని మెచ్చంగ । మెలఁగి రపుడు.

గీ. దైత్యవీరులు నూతనో । త్సాహమునను
ఆహవోద్రేకమును జూపి । యవనియందు
వీరలను మించు వీరులు । లేరనంగ
నహమహమికను బోరాడి । రద్భుతముగ.

సీ. క్రమశిక్షఁబడసిన । రాక్షససైన్యంబు
ప్రళయకాలాంబుద । ప్రతతిఁబోల
అసురవీరుల భీక । రాయుధ దీప్తులు
తరళ విద్యుల్లతా । తతులఁబోల
సమద సామజ హయ । స్యందనస్వనములు
సంవర్త మేఘ గ । ర్జనలఁబోల
అరులపై దుముకు వా । నరుల మహోత్తాల
వాలంబు లింద్రచా । పములఁబోల.

గీ. కుండలీకృత చండ కో । దండ ముక్త
శరసమూహంబు భయద వ । ర్షంబుఁ బోలఁ
బిడుగులంబోలి పైఁబడె । వీరవరుల
పర్వతంబులు పర్వత । ప్రభు తనూజ.

గీ. సంగరంబున నుభయ ప । క్షములవారు
తీరములుగాగ విఱిగిన । తేరులెల్ల
ఇసుక దిబ్బలు గాగ సొం । పెసఁగ నపుడు
రక్తనది ప్రవహించెఁ బ । ర్వత తనూజ.

మ. పుడమిన్ గూలిన దైత్యవీరతనువుల్ । భూజంబులంబోలి నె
య్యెడఁజూడన్ జలజంతుసంచయము మ । త్తేభాశ్వబృందంబుగాన్
సుడిగుండంబులఁబోలి చక్రములు సం । శోభిల్ల నొక్కుమ్మడిన్
కదు వేగంబునఁ బాఱె రక్తనది సం । గ్రామాటవిన్ బార్వతీ.

ఉ. ఆ నదిలోఁబిశాచనిచ । యంబతి హర్షముతోడఁ బ్రీతితో
దానవ వీరదేహములఁ । దాండవమాడుచు నీదులాడుచున్
గానమొనర్చున్ పలల । ఖండములన్ దనివోవ మెక్కుచున్
స్నానముఁ జేయుచుండె రభ । సంబున మున్గుచుఁ దేలియాడుచున్.

గీ. ఆప్రవాహంబునను దేలి । యాడుచున్న
శవములను నావలను పక్షి । సంచయంబు
ఎలమిఁ గూర్చుండి సంచరి । యింపఁజొచ్చె
నావికా విహారోత్సాహ । మావహిల్ల

శా. భూతప్రేత పిశాచ సంతతికి స । మ్మోదంబునిండన్ ఖగ
వ్రాతోత్సాహము మేరమీఱ ననిలో । రక్తంబువర్షింపగా
భీతింబొందిన యట్టి దైత్యులుఁ గపుల్ । వెన్నిచ్చి పర్వెత్తఁగన్
ప్రీతిన్ తాండవమాడె మృత్యువు మహా । బీభత్సరూపంబునన్.

శా. వ్యక్తావక్తము రామభద్రునిప్రభా । వంబంచు భావించుచున్
భక్తానీకము నాకలోకము నుతిం । పన్ రామ కోదండ ని
ర్ముక్తాస్త్రక్షత దైత్యవీర తనువుల్ । పోతంబులన్ బోలగన్
రక్తాంభోధి తరంగ సంఘము సమి । ద్రింగంబునన్ శోభిలెన్.

శా. హోరాహోరిఁ బెనంగి నిశ్చలధృతిన్ । యుద్ధంబునన్ జచ్చినన్
వీరస్వర్గముఁ బొందవచ్చు ననుచున్ । నిర్భీతితోఁ బోరి హాం
వీరుల్ కొందఱు రామబాణనిహతిన్ । పృథ్వీస్థలిన్ గూలి రా
శ్రీరామున్ త్రిగుణాభిరాము విజయ । శ్రీధామున్ జూచుచున్

శా. వీరావేశమునన్ దెగించి దనుజుల్ । బీభత్సరూపంబునన్
పోరాడన్ పరికించి వానరులకా । మోదంబు నిండారఁగన్
జ్యారావంబు ప్రతిధ్వనింప దిశలన్ । సంరంభ మేపారఁగన్
శ్రీరాముండు వధింపఁజొచ్చె దనుజ । శ్రేష్ఠుండు భ్రష్టుండుగాన్.

మ. అరుణాబ్జంబులఁ బోలునేత్రముల సం । ధ్యాకాంతి దీపింపఁగన్
దురహంకారము మేరమీఱ వనిలో । దుర్వారకోదండియై
నరసింహాకృతి రాఘవుండసురసే । నన్ జెండుచుండంగ న
స్థిరుఁడై చూచుచు నిల్చియుండె దనుజ । శ్రేష్ఠుండు విశ్శేష్టుఁడై.

శా. ఏరా రావణ నీవొనర్చినయఘం । బీనాటికిన్ నిండెఁ బో
రారా రాక్షసరాజ రాక్షసుల సం । రక్షింప దక్షుండవేన్
పోరాటంబున నిల్చియుండఁ దగునే । మూఢుండ వచుగ్రుఁడై
శ్రీరాముండు పరాక్రమించె విజయ । శ్రీకామినీ కామియై.

కం. క్రొవ్వాడివాలుఁ దూపుల
రివ్వున వెడలంగ విడిచి । శ్రీరాముఁడనిన్
ముప్పంతుల ముప్పాతిక
ముప్పీసము దైత్యసైన్య । మునువధియించెన్.

గీ. కలనఁ బ్రవహించుచున్న ర । క్తనదిలోన
శైల శిఖరోపమాన శీ । ర్షములు రాల
జూచిసహియింపలేక ర । క్షోవిభుండు
రథము పోనిచ్చె నధిక సం । రంభమునను.

శా. రామా! జంకక సంహరింపుమనుచున్ । ప్రార్థించి కీర్తించి సు
త్రామాద్యష్టదిగీశులేకమయి ప్రా । ర్థింపనుత్సాహియై
సామాన్యుండగు మానవాకృతిని ర । క్షస్సేనఁ జెండాడు శ్రీ
రామున్ సంగరరంగ భీముఁగనియెన్ । రక్షోవిభుండుగ్రుఁడై.

శా. త్రుంతున్ వాసరవీరకోటి సమరేం । ద్రున్ బట్టి బంధించి శి
క్షింతున్ చూడుడు భాస్కరాన్వయముని । శ్లేషంబు గావించి ర
క్షింతున్ దైత్యులనంచు వేవిడిచెనా । గ్నేయాస్త్రమున్ మారాప ఘ
క్ష్మాంతుఁడాగ్రహవిగ్రహోగ్రుఁడగుచున్ । గర్జించి తర్జించుచున్

ఉ. రాక్షసనాయకుండు రఘు । రాముని మించి తృణీకరించి ఫా
లాక్షుని నన్ స్మరించి యన । లాస్త్రము నేసినయంతఁ బుండరీ
కాక్షుడు వారుణాస్త్రమున । నయ్యనలాస్త్రము సంహరించి హా
ర్యక్షముభంగి దైత్యకరి । రాజు పయింబడె హుంకరించుచున్

ఉ. రాణువఁద్రుంచి యద్భుత శ । రంబుల నేయుచు దైత్యరాట్తను
త్రాణముఁ జించి యున్నత గ । ధంబును నేలకుఁ గూల్చి తజ్జహా
రాణములన్ వధించి సమ । రంబున నిల్చి పరాక్రమించెఁ గ
ల్యాణ గుణాభిరాముఁడగు । నా రఘురాముఁడు మానినీమణీ.

గీ. రథముఁ గూల్చిన వేళొండు । రథము నిలిచె
శిరముఁ ద్రుంచిన నింకొక । శిరము మొలిచె
అహమహమికను పోలిచె డీ । యనుచుఁ బిలిచె
రావణు వధింపఁ జాలునే । రాఘవుండు.

ఉ. గోత్రభిదాది దిక్పతులు । కోటివిధంబుల హెచ్చరింపఁగా
పౌత్రకులావతంస నుత । సద్గుణధాముఁడు రాముఁడే డహో
రాత్రము లేకరీతి సమ । రంబు నిల్చి పెనంగెఁ బో జగ
చ్ఛాత్రవుఁడైన రావణునిఁ । జంపగ లోకము నుద్ధరింపఁగన్

శా. సప్తాంభోనిధి వేష్టితావని మన । స్సంక్షోభమున్ బొంద సం
తృప్తానేక పిశాచ జంతు ఖగముల్ । క్రీడించి హర్షింపఁగా
సప్తాహంబులు రావణాసురునితో । సంగ్రామమున్ జేసె సం
ప్రాప్త శ్రీవిజయాభిరాముఁ డగు శ్రీ । రాముండు ఘోరాకృతిన్

గీ. శార్ఙ్గకోదండ ముక్త ని । శాతకాండ
ఖండితంబులై త్రెళ్ళిన । కంధరములు
బాహువులు నాకసంబున । రాహువులను
కేతువులఁబోలె దేవతల్ । భీతిలంగ.

శా. హోరాహోరిఁబెనంగి రావణుఁడుమా । యోపాయనుల్ బన్నిదు
ర్వారాస్త్రంబులనేసి వానరభట । వ్రాతంబు బోకార్వఁగన్
శ్రీరాముండసురేంద్రుఁబట్టుకొన సు । గ్రీవాదులన్ యోధులన్
బ్రేరేపించి యమోఘవైఖరిని జా । పెన్ యుద్ధనైపుణ్యమున్.

శా. సుగ్రీవాంగద వాయుపుత్త్రులు మహా । క్షోభంబుఁబుట్టించెఁబం
క్తిగ్రీవుండని ముట్టడింపఁ జనినన్ । కీడ్పాటు వాటిల్లు నం
చు గ్రుండై దశకంధరుండు నిజమా । యోపాయమే పారగన్
వ్యగ్రుండై కపిముఖ్యుపై విడిచె శ । స్త్రాస్త్రంబులొక్కుమ్మడిన్.

గీ. భానుపుత్త్రుండు మూర్ఛిల్లెఁ । బవనసుతుఁడు
రావణుండేడి యనుచు ది । గ్భ్రమను బొందె
అంగదుఁడు జాంబవంతుండు । నక్క జమున
దిశలఁజూచుచు నిలిచిరి । తెలివిఁ దక్క.

ఉ. బొబ్బమెకంబు పోల్కి భట । ముఖ్యులదాకివధించి వెంటనే
మబ్బుమఱుంగునన్ నిలిచి । మార్తురనెల్లర మోసపుచ్చి త
బ్బిబ్బులఁబెట్టి యొక్క మొగిఁ । బెక్కు శరంబులనేసి యేపుమై
గబ్బి మగండురావణుఁడు । కాచుకొనుండని బొబ్బరించుచున్.

గీ. ముప్పువాటిల్ల నిప్పుల । నుప్పి ఉప్పి
మంటలంబెట్టి వైరుల । మాడ్చిమాడ్చి
రావణుండార్చి నంతనె । ప్రళయకాల
సంక్షుభిత సాగరముఁ బోలె । సంగరంబు.

ఉ. బంటుతనంబుఁ దక్కి యొక । పందవిధంబున నక్కియుండెనో
కంటికిఁ గానరాఁడు దశ । కంధరుఁ డెచ్చట నున్న వాని వె
న్నంటి వధింపఁ గావలయు । నంచు నహాంకృతి వాయునందనుం
డొంటరియై చెలంగె దను । జోత్తము చిత్తము తత్తఱిల్లఁగన్.

గీ. అసురమాయా నణంపక । యాలసించి
హానిఁ జేకూర్చినాఁడ సై । న్యమున కనుచుఁ
జెలఁగి యనిలాస్త్రమున మేఘ । ములఁ జెదర్చి
రావణు నెదుర్పఁ గాఁ బోయె । రాఘవుండు.

మ. అవకాశంబు లభించెనేని వెనుదీ । యంబోల దెల్లని రా
ఘవులన్ బట్టుఁడు కొట్టుఁడంచు దనుజ । క్ష్మానాథుఁడన్నంతనే
అవివేకంబున దైత్యసైన్యమని వా । ర్యస్ఫూర్తి జృంభించె; దా
నవసంరంభమణంచె రాముఁడు మహా । నారాయణాస్త్రంబునన్.

గీ. వెడలె నారాయణాస్త్రంబు । వెనుక కేగె
దైత్యసైన్యంబు కోపించి । దైత్యవిభుఁడు
సత్వరంబ సమ్మోహనా । స్త్రంబు విడిచె
రామచంద్రుండు మూర్ఛిల్లె । రాజవదన.

మ. అదిరా రాముఁడు నేలఁ గూలెనని దై । త్యస్వామి జృంభింపగన్
వ్యాధిభీతిల్లుచు లక్ష్మణుండు నిలిచెన్ । శ్రీరాముఁగాపాడ; నం
గద వాటిల్లిన దంచు నెంచి కపిలో । కంబెల్ల దుఃఖింపఁగన్
గదచేఁ బూని విభీషణుండు వెడలెన్ । కాలాంతకుండో యనన్.

శా. చిచ్చుంబోలిన కిన్కతోడను గదన్ । చేబూని రౌద్రాకృతిన్
వచ్చెన్ వచ్చె విభీషణుండు దనుజ । స్వామిన్ నిరోధింప నం
చచ్చో దానవు లవ్విభీషణుని రో । షావేశ సంరంభమున్
మెచ్చన్ పోరు ఘటిల్లె సోదరులకున్ । నీరేజపత్రేక్షణా.

ఉ. సిద్ధుల సాధ్యులన్ విబుధ । శేఖరు జే యనిపించి మించె ది
గ్బద్ధ యశోధ్వజుండసుర । నాయకుఁ డంతటివాని గెల్చునే
బుద్ధి విహీనుఁడై వెసలెఁ । బోయని యెంచకుమా భువిన్ గదా
యుద్ధమునన్ విభీషణుని । నోర్వఁగ శక్యమె యెట్టివానికేన్

గీ. చండ దోర్దండ ధృత గదా । దండ నిహత
శాత్రవుండయి యవ్వి భీ । షణుఁడు దనుజ
నాయకు నెదిర్చి యాతని । సాయకములఁ
దప్పుకొనుచుఁ బోరాడె చ । ద్దండ గతిని.

ఉ. భీకరుఁ డా విభీషణుఁడు । పెన్ గదఁ బూని యురమ్ముఁ గొట్టి "సు
శ్లోకుని రామభద్రుఁబుయి । లోడక మూర్ఛిలఁ జేసినంతనే
నీకు జయంబుచేకురునె । నే వెనుదీయక నిన్ వధించెదం
గాక గధాయుధంబునను । గాకులు గ్రద్దలు సంతసింపఁగన్.

గీ. అనిన విని విభీషణుని గ । దాయుధంబుఁ
దునుమ వలె నన్నదలపున । దనుజవిభుడు
వివిధ నిశితేషు వితతిని । విడిచి విడిచి
వాని దేహంబు నొప్పించి । పలికె నిట్లు.

ఉ. నీ సము లెవ్వరిట్టి యవి । నీతికిఁ జొచ్చిన నీచులందు? నీ
కోసము చూచుచుంటి నినుఁ । గూల్చికులంబు సముద్ధరించి సం
తోసముఁబొందనుంటిననుఁ । ద్రుంచెదొ చచ్చెదొ రమ్మతమ్ముఁడా
మోసము సంభవించె నిను । మున్నువధింపక మిన్నకుండుటన్

గీ. అని విరోధించి తమ్ముని । నాక్రమించి
శరపరంపరఁ గురిపించి । క్షణములోన
నాయుధ విహీనుఁ గావించి । యసురవిభుడు
అనుజుని వధింప ఖడ్గంబుఁ । గొనినయంత.

గీ. అక్కజంబుగ నొక బాణ । మసురవిభుని
చేతి ఖడ్గంబుఁ గుసియలఁ । జేసియరిగె
మెఱవు మెఱసిన యట్టుల । క్కఱకుటమ్ము
ఎట్టు లేతెంచె నెటకేగె । నెవ్వఁ డెఱుఁగు.

ఉ. ఎచ్చటినుండి వచ్చె నొకొ । యీ నిశితేషు వమోఘవైఖరిన్
ఎచ్చటి కేగె నంచు దను । జేశ్వరుఁ డచ్చెఱువొంది చూచుచున్
హెచ్చిన కిన్కతో రఘుకు । లేంద్రుని బాణమయంచు నెంచి,లో
మచ్చరికించుచున్ దురభి । మానమునన్ ధనువూని చెచ్చెరన్

గీ. అనుజునిన్ దాకి నంతనె । యవ్విభీష
ణుండు ఖండన భీముఁడు । ద్దండ బలుఁడు
వడి గదాదండ మూని రా । వణు నెదిర్చి
పెక్కు విధములఁ బోరాడి । ధిక్కరించె.

మ. అనుజున్ జంపెదనంచు రావణుఁడు శ । క్త్యస్త్రంబు సంధించినం
త నె శ్రీ రాముఁడువచ్చిముందునిలిచెన్ దైత్యేంద్రుఁడాశ్చర్యసం
జనితస్వేద కణపరిపూర్ణ ముఖుఁడై । స్తంభించి యత్యుగ్రుఁడై
కనులన్ నిప్పులరాల్చి పేర్చి యఱచెన్ । కంఠీరవస్ఫూర్తితోన్

గీ. అఱచి వింట సంధించిన । యస్త్ర మసుర
విభుఁడు శ్రీరామభద్రుపై । విడిచినంత
నిర్వికారుండు రాముండు । నిలిచి నవ్వి
జృంభకాస్త్రంబు విడిచె సం । రంభ గతిని.

గీ. అతిభయంకరమైన య । య్యస్త్రమునకు
ఆవులించుచు రావణుం । డా క్షణంబ
సహజచేష్టావిహీనుఁడై । శవముఁబోలె;
సత్వరమ సారధి మరల్చె । స్యందనమును.

గీ. పౌలస్త్యుఁడిసమ్మోహ నాస్త్రము । మోఘమగుట
మూర్ఛిలిన యట్లు త్రిగుణాధా । ముఁడు నటించి
మాటి మాటికి శక్త్యస్త్ర । మహిమఁ జూపి
గండుమీఱిన రావణు । గర్వమణఁచె.



గీ. తరుణ మిడియుంచుఁ గపుల సం । తాప మణఁచి
అయుధా ఘాతములకు గా । యములఁ గొన్న
కాయములకు నారోగ్యంబుఁ । గలుగఁ జేసి
వీర రాఘవుఁ డించుక । విశ్రమించె.

ఉ. అంత విభీషణుండిన కు । లాధిపుఁ జూచి వచించె నిట్లు "దు
ర్దాంతమహాబలాఢ్యుఁడగు । రావణుతోడఁ బెనంగుచుంతయున్
వింతగనున్నదేమొ? రణ వీర । భయంకరుఁడైన వైరితో
నొంత వినోదమున్ జఱుపఁ । గోరిక బుట్టెనొ జానకీ వరా.

గీ. రావణుని యస్త్ర విద్య శ । స్త్ర ప్రయోగ
సరణిఁ బరికించు తలఁపునఁ । జంప కుండ
నాలసించుచు నుంటివ । బ్జాయతాక్ష
సేగి ఘటియిల్లు నాలసిం । చిన కొలంది.

ఉ. దుష్టుఁడు రావణుండకట । దుమ్ములు చిల్లులు వోవఁ గొట్టె నా
కష్ట మెఱుంగవై తనఘ । కాయముఁ జూడుముగాయమయ్యె; వా
డష్ట దిగీశులన్ గెలిచి । నట్టి బలాఢ్యుఁడు వానిఁ జంప నీ
కిష్టము లేక యున్నయది; । యింత విళంబ మొనర్ప వచ్చునే?

శా. శ్రీరామా రిపులోకభీకరరణ । క్రీడాభిరాముండవై
ప్రారంభించిన దాడి దుర్భరమహా । బాణాగ్నిచే శత్రుసే
నారామంబు దహింపఁ జేసితివి దై । త్యాధీశుఁ ఛేదించి యీ
పోరాటంబుముగింపఁ జేయుముకరం । బుల్ మోడ్చి ప్రార్థించెదన్

శా. ఎన్నాళ్ళీట్లు వినోదమున్ జఱపెదో । యీయుద్ధరంగంబునన్
గన్నారన్ గనుఁగొన్నచో నెఱుఁగవే । కష్టంబులన్ గుందియె
ట్లున్నారో మనవీరులెల్లరును లో । నూహింపుమా రాఘవా
అన్నారీమణి సీత యేమగునో యి । ట్లాలస్యమున్ జేసినన్.

శా. రామా! జంకకు మాలసింపకుము హా । రాహోరిఁ బోరాడిసు
త్రామాద్యష్ట దిగీశులెల్లరు మహో । త్సాహంబునన్ నీదు సం
గ్రామంబున్ గని సన్నుతింప గరుడుల్ । గంధర్వు లగ్గింపఁగా
భీమాస్త్రక్షతగాత్రుఁ జేయుము జగ । ద్విద్రావణున్ రావణున్

ఉ. ఆర్తికిఁ జిక్కియున్నదచ । లాత్మజ రావణుఁడెట్టి వీరుఁడో
పూర్తిగఁ జూతుఁగాకయని । బుద్ధిఁదలంచి పెనంగుచున్నచో
నోర్తురె లాతివారకట । యుద్ధము దుస్సహ మయ్యె నెట్టులేన్
మార్తురఁగూల్చి గెల్పుగొను । మార్గముఁజూడుము సత్వరంబుగన్.

గీ. రామ! లోకసంక్షోభకా । రణము రణము
వ్రణము చందాన జనులకు । బాధఁ గూర్చు
క్షామము ఘటించు నక్కటా । క్షేమ మగునె
కీడు వాటిల్ల కున్నె? ము । గింపకున్న.

మ. అణుమాత్రంబును సంశయింపకుము బ్రహ్మాస్త్రంబు సంధించి రా
వణు శీఘ్రంబుగ సంహరింపుము జగ । త్ప్రఖ్యాతిఁ గైకొమ్ము; బ్రా
హ్మణు నేరీతి వధింపవచ్చునని యి । ట్లాలస్యమున్ జేసినన్
రణభూభాగమునంద యెల్లరకు । వార్ధక్యంబు ప్రాప్తించెడున్.

గీ. వినుము శ్రీరామ! బ్రహ్మాస్త్ర । మునను దొలుత
హృదయపుటభేదనంబొన । రింప వలయుఁ
బిదప శీఘ్రంబ యొక్కొక్క । పదరమునను
వాని శిరములఁదునుమాడ । వలయు నీవు.

గీ. అపుడు లక్ష్మణుఁడప్పలుకు । లాలకించి
సంచలించిన వీరుల । సరణిఁ గాంచి
నయనముల మోడ్చి వినుచు మా । నంబుఁగొన్న
ఇనకుల వరేణ్యుఁబరికించి । యిట్టులనియె.

గీ. చాలునాలస్య మక్కటా । కాలమెల్ల
సమర భూమిని వెచ్చింపఁ । జనునె మనకు
అంతకంతకు సంక్షోభ । మధిక మయ్యె
నెల్లరు సహింప నేర్తురే । యికను లేంద?

గీ. సత్యముఁ దలంపుమా విభీ । షణుని తోడ
రావణుని సంహరించి సా । మ్రాజ్యలక్ష్మి
నీకొసంగెద ననలేదె । నిర్మలాత్మ
సత్త్వహీనుని కైవడి । జంకెదేల.

చం. అనఘ!మహాత్మ! నీ వనృత । మాడెడువాడవె?సత్యవాక్యపా
లన మొనరింపఁగాదె పుర । లక్ష్మిఁ ద్యజించి వినిశ్చలుండవై
వనముల కేఁగుదెంచితివి । పల్కిన పల్కులఁ దప్పిపోదురే
ఇనకులసంభవుల్ ధృతి వ । హింపుము రావణు సంహరింపుమా.

కం. అనుపమ బలవంతులగో
అనిరుద్ధ మహాపరాక్రమ । మాఢ్యుఁడవగుటన్
మనమునఁ జింతించిన నీ
వొనరింపఁగ రాని కార్య । మున్నదె జగతిన్.

కం. అన్నా! నిను మించిన వా
డున్నాఁడా లోకమందు? । నొక త్రుటి లోనన్
ఇన్నాకారినిఁ దునుమక
ఇన్నాళ్ళు పెనంగు చుంటి । వేటికిఁ జెపుమా.

మ. అనఘా! వాక్యములు పెక్కులేల? సమర । వ్యాపారమింకేల? నే
డినుఁ డస్తాంబుధి నస్తమించుటకు ము । న్నే జానకీ దేవి లో
నను మోదింపఁగ రావణాఖ్యదనుజ । వ్యాఘ్రంబు శీఘ్రంబుగా
ననిలో నెమ్మెయి సంహరించి నృపసిం । హ ఖ్యాతి స్థాపింపుమా.

కం. అనవిని తల పంకించుచు
నినకుల వరుఁడపుడ లేచి । హెచ్చిన కినుకన్
ధనువున్ గైకొని వంతనె
హనుమంతుండే గుదెంచె । నతి రభసమునన్.

గీ. అతి రయంబున వచ్చిన । యనిలసుతుని
సరణిఁ బరికించె రాముఁ డా । శ్చర్యమునను;
ఆత్మఁ బుట్టిన యుద్రేక । మణఁచుకొనుచు
ఇనకులునిఁ జూచి హనుమంతుఁ । డిట్టులనియె.

ఉ. చిచ్చుఱకన్ను దాచి యొక । చేతఁ ద్రిశూలముఁ దాల్చి యాజికిన్
వచ్చెను కాలకంఠుఁడని । వానర వీరులు తల్లడిల్లఁగా
జెచ్చెఱ నేగుదెంచె రణ । సీమకు రావణుఁ డుగ్రమూర్తియై
ఎచ్చట నున్నవాఁ డినకు । లేంద్రునిఁ గూల్చెదనంచుఁ బ్రేలుచున్.

ఉ. తెచ్చితి శూలమున్ ద్రిశిగ । తిన్ గరవాలము భిండివాలమున్
ఎచ్చటికేగినన్ విడువ । నెమ్మెయి రాముని పేరురంబునన్
గ్రుచ్చి వధించెదన్ బ్రళయ । రుద్రుఁ డెదిర్చిన జంకనంచు వే
వచ్చిన వాఁడు దైత్యకుల । వర్యుఁ డవార్య మహాబలాఢ్యుఁడై.

ఉ. అందఱ సంహరింప విల । యాంతకుఁడై వివిధాయుధాన్విత
స్యందనుఁడై దశాస్యుఁడు భ । యంకరుఁ డిప్పుడు గ్రీష్మకాల మ
ధ్యందిన భానుబింబము వి । ధంబున భాసిలుచున్నవాఁడు; నీ
ముందఱ శాత్రవుం బొడఁగ । బోలదు నిక్కముఁ జెప్పవచ్చితిన్.

ఉ. వందనమాచరించి యొక । వాక్యముఁ బల్కెద రామచంద్ర; మే
మందఱమున్ తెగించి దను । జాధిపుఁదాకెద మోర్చియుండుమ
స్పందధృతిన్ వహించి రభ । సంబున వచ్చినవైరి నిత్తఱిన్
దొందఱపాటు సైఁకొని యె । దుర్పఁగరాదని నాకుఁ దోఁచెడిన్.

తే. దుర్జయులు వీరవానరుల్ । తోడు పడఁగ
నేకనెదిరించి వైరి యు । ద్రేకమణఁతు;
నంతవనుకను శాంతింపు । మంబుజాక్ష
తరుణముంగని యెదిరింపఁ । దగును నీకు.

గీ. అనిన ననిలాత్మజుని గని । యినకులుండు
ఇంచుక హసించి వినుమని । యిట్టులనియె;
"శాత్రవునిఁ జూచి యుత్తమ । క్షత్రియుండు
తలఁకి యోర్చునె యనుకూల । తరుణమునకు.

ఉ. వానర ముఖ్యనేఁ బిఱికి । పందనె యౌనని సమ్మతింపఁ బం
చాననమెన్నఁడేన్ మదగ । జంబును గాంచివధింపఁ గోర్చునే?
ఏను రిపు ప్రతాపము స । హింతునె, భానుడు నేఁడు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయ । మున్న వధించెదఁ గాక రావణున్.

ఆ. వె. రాఘవుల జయింప । రావణుండేతెంచెఁ
గోపమున మహాగ్ని । రూపమునను;
ఉరము శిరము నొక్క । శరముతో ఖండింతుఁ
బలుకు లేలఁ బెక్కు । ములుకు లేల?

శా. ఏఁడీ రాముఁడు? సంహరింతునని దై । త్యేశుండు జృంభించి పో
రాడన్ వచ్చిన యప్పుడేను వెనుదీ । యన్ జాలనేమైన నా
నేఁడో రేపో యెదుర్పకుండ నగునే । నేఁడే రిపుంజంపి నా
వాడిన్ జూపెద రాచపాడి విడువన్ । భావ్యంబు గాదెన్నఁడున్.

ఆ. వె. "రావణుని వధించి । రాజ్యంబు నీకిత్తు"
నని విభీషణునకు । నభయ మొసఁగి
చాలకాల మయ్యె । శాత్రవు నీనాఁడు
చంపుఁగొండె లేక । చచ్చుటొండె.

ఆ. వె. వీర వరులు విసఁగి । వేసారి రీసారి
దనుజుఁ దునుమకుండ । ధనువు విడువ;
శౌర్యమునఁ దెగించి । సంగరంబు ముగించి
విజయలక్ష్మిఁ గొందు । వినుమ హనుమ."

చం. అని తన నిర్ణయంబు సమ । యంబు విశిష్టుల చిత్తవృత్తితో
ఇనకులభూషణుండు వచి । యించిన యంత నమస్కరించి య
య్యనిలసుతుండు పల్కెఁ "దిగు । ణాత్మక దేవ మహానుభావ నీ
వనుకొనినట్టి కార్యమెపు । డైన ఫలింపక యున్నె యెట్టిదేన్.

గీ. హనుమ సమ్మతింపఁగ వీరు । లనుగమింప
రథమధిష్ఠించె నిష్ఠతో । రఘువరుండు;
తేరు సమరంబునకు బయల్ । దేర ననఁగ
ఇనకులుఁడు విభీషణుఁ జూచి । యిట్టులనియె.

ఉ. అన్న విభీషణా! యభయ । హస్త మొసంగితి నీకు, నేడు నీ
యన్నను సంహరించి యలి । కాత్ముని సాక్షిగ నిన్ను రాజ్య సం
పన్నునిఁ జేతు, దైత్యకుల । నర్త్యుఁడు దానవమాయ లెన్ని యేన్
బన్ననఁ బన్నుఁ గాక, యన । పాయగతిన్ వధియింతు వేల్పుల్మెడిన్.

గీ. అని గుణధ్వని యొనరించి । యనికిఁ జనిన
అనిల పుత్త్రుండు శీఘ్రంబ । యనుసరించె;
లస్త్రశస్త్ర హస్తుండై । లక్ష్మణుండు
సమరరంగంబు నన్ నిల్చె । నమరు లలర.

ఉ. శ్రీరఘు రామచంద్రుఁడత । సీసుమగాత్రుఁడు కాలభైరవా
కారము మీఱఁగ యాహవ ము । ఖంబుననిల్వఁగఁ గాలమేఘ గం
భీరరవానుకూల గతి । వేల్పుల సంగరరంగ దుందుభుల్
బోరున దిక్తటంబులను । మ్రోగి జగంబులు సంచ లింపఁగన్.

ఉ. ధారుణి దిగ్గిరందిరిగెఁ । దారలుడుల్లె దిశల్ చలించెఁ గూ
పారము లేకమై జగతి । పైఁబడి నట్టుల ఘూర్ణిలెన్ మహా
భైరవ రావముల్ దనుజ । వల్లభు నుల్లము తల్లడిల్ల టం
కార మొనర్చి రాముఁడు ము । ఖాముఖ నిల్చియెదిర్చి నంతనే.

చం. తనకు విపత్తుచేకుఱు వి । ధంబునఁ దోఁచిన దుర్నిమిత్తముల్
గనుఁగొని దుర్నిమిత్తములఁ । గాంచి భయంపడ నేటికంచు వే
దనుజులనెల్ల వానరులఁ । దార్కొనఁగన్ బురికొల్పి తీవిమై
ఇనకులవర్యుఁగాంచి, దను । జేశ్వరుఁడాగ్రహ విగ్రహాగ్రుఁడై

ఉ. కాలము చెల్లె నీకసుర । కాంతువధించెద వేమి? మత్తశుం
డాలముఁ జంపనోపునె బి । డాలము? నిన్నువధింపకుండ నే
జాలము సైపఁ జాల నిఁకఁ । జచ్చితి వంచు నరాతి సంచరా
భీలము శూలమున్ విసరె । బింకమునన్ గదు హుంకరించుచున్.

చం. పకపక నవ్వి భానుకుల । వర్యుఁడుశూలముఁజూచియొక్కయం
బకమునఁ దుంచినన్ దనుజ । వర్యుఁడు భీకర భిండివాలమున్
వికలిత చిత్తుఁడై విడిచె । వెంటనె రాముఁడు తుంచెఁ నీ గతిన్
శకలము లయ్యెఁ బో సకల । శస్త్రములున్ తృటిలోఁ దృణంబులై.

గీ. అఖిల వీరులఁ దునిమ వి । ఖ్యాతిఁ గొన్న
శస్త్రములు నేఁడు నిష్ప్రయో । జనములయ్యె;
దైవబలము దుర్బలమైన । తరుణమునను
అక్కఱకురావు ప్రభువుల । కాయుధములు.

చ. తలఁకె యమోఘశస్త్రసము । దాయమువ్యర్థముగాఁగ ఖిన్నుఁడై
వెల వెలఁబోయి, వైరి శర । విద్యమహామహిమాన్వితంబుగా
దలఁచి, మహాస్త్రముల్ విడిచి । దాశరథిన్ వధియింతునంచు ని
శ్చలమతి నిశ్చయించి వడి । స్యందనమున్ నడపించి యుగ్రుఁడై.

ఉ." అక్షయ బాహువీర్యమహి । మాన్వితుఁ డప్పుడు శస్త్రవిద్యక
ధ్యక్షుఁడు వీఁడసాధ్యుఁడని । కాక్షునినైన జయించు నంచు వే
రాక్షస వీరులన్ సమర । రంగమునన్ బురికొల్పి యార్చుచున్
రాక్షసవైరిపై విడిచె । రాక్షస నాథుఁడు రాక్షసాస్త్రమున్.

గీ. ఉగ్రతర రాక్షసాస్త్ర ప్ర । యోగమునను
నిర్జరుల నైన నిర్జించె । నిర్జరారి;
రాక్షసాంతకుఁ డీ వీర । రాఘవుండు
జయముఁ బడయుని రాక్షసా । స్త్రంబువలన.

గీ. రాక్షసాస్త్రంబ మోఘంబు । రాఘవునకు
మంటలు జనించె నాపాద । మస్తకమున
నిదియ తఱియంచు రావణుం । డేపుఁ జూపి
పెక్కు శరముల విడిచె వి । ల్లెక్కు వెట్టి.

గీ. రామ చంద్రుండు రాక్షసా । స్త్రంబువలన
నించుక చలించి బాధ స । హించి నిల్చి
యొక్కమొగ్గి వచ్చి పైఁ బడు । చున్న వాలుఁ
దూపులకుఁ జిక్కి యెంతయుఁ । దొట్రువడియె.

"గీ. కుంభకర్ణునిఁ గూల్చి సం । రంభమునను
హరి విరోధిని జంపించి । యతిశయించి
రావణు వధింప వచ్చితే । రాజపుత్రి
రావణుఁ డెవండు? లోకవి । ద్రావణుండు.

గీ. పిఱికితనమున వెన్నిచ్చి । వెడలకుండ
విల్లిఁ బోరాడుమా యొక్క । నిమిషమునను
నీ పొగరణఁగు నేటితో । నృప తనూజ"
అనిన విని వైరి యిట్లనె । యినకులుండు.

ఉ. మంటలు నిన్నుఁ గ్రమ్మఁ గొన ! మాడ్చెదఁ గారులఁ గొన్ని పేలినన్
తుంటరి వౌదు గాక నను । దాటిలఁ జేసిన యంతమాత్రనే
ఒంటరి వౌదువేమి? నిశి । తోగ్ర శరంబుల కోర్చి యాజిలో
దంట విధంబునన్ నిలుమ । దానవ నాయక! వ్యర్థ సాయకా

ఉ. బంటు విధంబునన్ జెలఁగి । పక్షులఁ బల్కుకుమా వనంబులో
నొంటరి పాటునన్ మెలఁగు । నొక్క సతీమణి దొంగిలించు వాఁ
డొంటరియౌనొ పందయగు । నో ఖలుషాత్మక నేను పీనుఁగుం
బొంటల లోన నీ తనువు । మెక్కకయుండునె కాకగృధ్రముల్.

మ. మునులన్ సాధుజనంబులన్ విబుధులన్ । పూబోణులన్ లోకపా
వనమార్గంబున సంచరించు ఘనులన్ । బాధించి సాధించి చే
సిన పాపంబులకున్ రణంబునను నిన్ । శిక్షింపఁగా వచ్చితిన్
వినుమా ధర్మ విరుద్ధ జీవన జగ । ద్విద్రావణా రావణా.

కం చూపోపమి నన్యుల నే
లా పీడించితివి ధర్మ । మరయక యకటా
నీ పాండిత్యముఁ గాల్పనె
పాపాత్మక క్రూరచిత్త । భ్రాతృద్రోహీ.

కం. క్రూరుండవు ధీరుండవె
దూరీకృత ధర్మమార్గ । దోషాచర, హం
పీరుండవె చోరుండవు
జారుండవు నేఁడు నిన్నుఁ । జంపక విడువన్.

కం. నిను మించిన బలవంతుని
వనచరవరు వాలిఁ దొల్త । వధియించితిఁ బో
విని మతిమంతుఁడ వయ్యెద
వని యోర్చితి నింత దనుక । వసురకులేంద్రా.

కం. శూలముఁ దెచ్చిన వడిఁగర
వాలముఁ గైకొన్న ధిండి । వాలములున్నన్
కాలము వచ్చెను నీకీ
యాలమునన్ చావు తప్ప । దమర విరోధీ.

మ. నరకద్వారకవాటముల్ దెఱచి యు । న్నాడల్లదే కాలు డో
నరమాంసాశన,నీమహాస్త్రములు నా । నా శస్త్రముల్ వ్యర్థముల్
దురపిల్లన్ దగదిక ద్వేషమున నన్ । దూషించినన్ జెల్లునా
దురహంకార మణంచికొమ్ము తులువా । దోషాచరాగ్రేసరా

ఉ. నీతియు జాతి లేని యతి । నీచతముండవు, నిన్నుఁ జంపినన్
నీ తనుమాంసమున్ మెసఁగ । నీచమృగంబులకేని యక్కటా
రోత జనింపకున్నె? నినుఁ । దున్మక తప్పదు నీ శరీరమున్
భూతములున్ పిశాచములు । ముట్టిన ముట్టక యున్న రావణా.

ఉ. ఏడ్చినవారలెవ్వరసు । రేంద్రుఁడు చచ్చిన వాని భూమిలోఁ
బూడ్చిన వార లెవ్వరని । బుద్ధిఁ దలంపక యెట్టులేని నిన్
మాడ్చిన సాధుకోటికిఁ బ్రి । మోదము బుట్టక యుండు;నాకుఁగే
ల్మోడ్చిన వారలెల్లరుఁ బ్రి । మోదముఁ బొందెద రింత యేటికిన్

ఉ. నిన్ను వధించి లోభి నయి । నీదు ధరిత్రి హరింతు నంచు లో
నెన్నకుమా, విభీషణుఁడ । హీనగుణాఢ్యుఁడు దైత్యులందున
భ్యున్నతిఁ బొందఁగాఁదగిన । యుత్తముఁ డాతఁడు, దైత్యరాజ్య సం
పన్నుఁడు కాఁగలండనుచుఁ । బల్కితిఁ బల్కిన యట్లొనర్చెదన్.

మ. ఇనుఁ డస్తాంబుధి నస్తమించుటకు ము । న్నే నేడు యుద్ధంబునన్
నిను నిర్జించి భవత్సహోదరునకున్ । నీరాజ్య మర్పించెదన్
దనుజాధీశ్వర! యీశ్వరున్ దలఁచెదో । ధ్యానించెదో పద్మజున్
అనుమానింపక సంస్మరించుకొనుమా । వ్యామోహ మింకేటికిన్

కి. ఆసమహోగ్రుఁడై శ్రీరాముఁ । డాకుఁడంబ
నిగ్రవిరోధి నెదిరించి । నిలువరించి
పెక్కు తూపుల నేసిన । లెక్కఁ గొనక
రాముని దృణీకరించె నా । రావణుండు.

గీ. రామచంద్రుండు కోపించి । రాక్షసవిభు
శిరము ద్రుంచిన వేఱొక । శిరము మొలిచె
భుజముఁ దునిమిన కొండొక । భుజము పొలిచె
రావణు వధించు టెట్టు లా । రాఘవుండు.

గీ. చెలఁగి తూపుల నేసి త్రుం । చిన కొలంది
భుజములు శిరంబులున్ మొల్చి । పొల్చె నపుడ;
విషయసౌఖ్యాను రక్తి సే । వించుకొలఁది
వాంఛ లభివృద్ధిఁ బొందిన । వరుసఁ దోప.

ఉ. భీతిలకుండఁ జూచి రఘు । వీరుఁడు రావణు నుత్తమాంగమున్
శాతశరంబునన్ దునిమి । చయ్యన నొక్కమొగిన్ మహాశుగ
వ్రాతము నేసి తక్కిన శి । రంబులఁ ద్రుంపగ నద్భుతంబుగా
నాతల లట్టివే యచట । నప్పుడ మొల్చె నమోఘవైఖరిన్

గీ. ఈ విచిత్రంబుఁ బరికించి । మునకులుండు
ఉల్లమునఁ దల్లడిల్లుచుఁ । దెల్లఁ బోనె
అట్టహాసంబుఁ గావించి । యతిశయించి
బింకమున దైత్యనాథుండు । హుంకరించె.

"ఉ. వాలినిఁ జంపినాఁడ నొక । బాణమునన్ ఖరదూషణాదులన్
గూలిచినాఁడ నొక్కరుఁడ । క్రూరులఁ బెక్కుర నొక్కతూపునన్
వాలి వధించినాఁడ నని । వార్యబలాఢ్యుఁడు రాముఁడంచు నన్
వేలుపు లెల్లరున్ బొగడ । వీని వధింప నుపాయ మున్నదే?

ఉ. చెట్ట ఘటిల్లు నేమొ యని । చింతిలకుండఁ బ్రతిజ్ఞఁ గొంటి నే
నిట్టి యసాధ్య కార్యమిపు । డెట్లొనరించెద నేమిసేయుదున్?
ఎట్టి తపంబు జేసి జని । యించెనొ వీఁడు విచిత్ర వీరుఁ డీ
దిట్టరిఁ బోలఁ జాలు రణ । ధీరులు లేరు ధరాతలంబునన్.

ఉ. కోటి శరంబులన్ విడిచి । కోటి శిరంబులఁ ద్రుంచినాఁడ ని
ప్పాటనిమిన్న కెన్ని శిర । ముల్ గలవో? యిల వీర కోటిలో
మేటి విధంబునన్ చెలఁగి । మీఁదు దలంపక యే ప్రగల్భ వా
గ్ధాటిఁ బ్రతిజ్ఞలన్ బలికి । గ్రక్కున వచ్చితి సంహరింపఁగన్

ఉ. వేళ యతిక్రమించె నర । విందసఖుండును పశ్చిమాబ్ధికిన్
జాల మొనర్పకుండఁ జనుఁ । జయ్యన వీని వధింపకున్నచో
మేలొన గూడ దాజి విర । మించియొకింత యుపాయమారయన్
కాలము చాల దెక్కరణిఁ । గైకొని నట్టి ప్రతిజ్ఞ నిల్పుదున్

కం. తలపోయినఁ దలమొలచుట
తలపోయఁగ జిత్రమిట్టి । తతి నేఁ జేయం
గల కార్యమేమి? దనుజుని
బలమంతయు నణఁగకున్న । బ్రహ్మాస్త్రమునన్.

గీ. దనుజనాథుండు బ్రహ్మాస్త్ర । మునను గాని
చావఁడా యనా ధారణ । స యతమునకిఁ
తిరుగ యత్నించి చూచెద । తిరుగులేని
మార్గణమునఁ ద్రుంచెద ముఖ్య । మస్తకంబు.

ఉ. అంగద కేమి యున్నదని । యాత్మఁదలంచుచు వజ్రి భూమిభృ
చ్ఛృంగముఁ ద్రుంచినట్లు రఘు । శేఖరుఁ డుగ్రశరంబునన్ పృథా
నాగముఁ ద్రుంపఁగని దిరుగ । నట్టి శిరంబు జనించె నాత్మ ను
ప్పొంగుచు నవ్వుచున్ దనుజ । ముఖ్యుఁడు హుమ్మని హుంకరించుచున్

తే. నను వధింపఁగఁ జాలఁడీ । మనుజుఁడనుచు
దాశరథి తాళుమా యనుచు । దారుణముగ
బాణవర్షంబుఁ గురిపించెఁ । భానుకులుఁడు
జలదసంఛన్న భానుని । సరణిఁ దోఁచె.

గీ. ఇన కుల వరుండు బ్రహ్మాస్త్ర । మెఱుఁగఁడనుచు
దనుజ నాథుండు దర్పించి । యనుపమాన
మహిమఁగల రామచంద్రుని న । మ్మానవేంద్రు
నొక్క మొగిఁ బెక్కు తూపుల । ధిక్కరించె.

గీ. ఒక్క తూపునఁ బెక్కుర । నుక్కణఁచి
ధరణి దైత్యాంతకఖ్యాతిఁ । దనరినాఁడ
నితఁడనఁగ నెంత బ్రహ్మాస్త్ర । మేటి కనుచు
నింతదనుకును వెనఁగెన । యినకులుండు.

ఉ. రావణు బాణసంచయము । రామునిఁ గప్పినయంతనే కపుల్
భావములన్ కలంగి రఘు । వర్యునిఁ బ్రోవఁగ నేగుచుండ బా
ణావళిఁ ద్రుంచి రాముఁడు ర । యంబున నీవలకేగుదెంచి మే
ఘావరణంబుఁ దప్పుకొని । నట్టి యహస్కరు పోల్కి భాసిలెన్.

ఉ. రాచతికంబుఁ జూపుచు వి । రాజిలు రాముని సుప్రతాపమున్
జూచి సహింపఁజాలక య । సూయత దృక్కులయందుఁ గ్రక్కుచున్
లోఁచి వధించెదన్ రఘుకు । లప్రవరానిలు మంచు నుగ్రుఁడై
ఏచి పరాక్రమించె దను । జేశ్వరుఁడున్ వివిధాస్త్రఘాటితోఁ.

గీ. దనుజ విభుఁడు శస్త్రములన । స్త్రములు వరుసఁ
గోపమునఁ బ్రయోగించి ప్ర । తాపమెసఁగ
ధైర్య గాంభీర్య సాహస । శౌర్యములను
సరభసంబునఁ జూపె నా । శ్చర్య మొదవ.

ఉ. రాముఁడు రావణుండును ప । రస్పర నిర్జయనాభిలాష ను
ద్దామబలప్రతాపమునఁ । దార్కొనియస్త్రములేయుచుండ సం
గ్రామము భాసిలెన్ ప్రళయ । కాలము కైవడి; భీతిశోక సు
త్రాముఁడుచూచుచుండరఘు । రామునియుద్ధముసంశయాత్ముఁడై

ఉ. అప్రతిమాన శౌర్యనిధు । లైరఘురాముఁడు రావణుండుఁ జా
పప్రవిముక్త సాయక వి । తానము దివ్యస నేయుచుండ బా
ణప్రతిబాణ ఘర్షణము । నన్ జనితానల కీల లెల్లెడన్
క్షిప్రగతిన్ జ్వలించెఁ బరి । కింపఁగ శక్యమె యెట్టివానికేన్

ఉ. దెబ్బకు నిబ్బరంబుడిగి । దిక్కులు ఘూర్ణిల బొబ్బరించు పెన్
బొబ్బమెకంబు చందమున । భూమినణంకఁగ హుంకరించె నా
గబ్బిమగండు రావణుఁడు । కశములన్ దునుమాడుచున్ జగం
బబ్బుర మొందనట్లినకు । లాధ్యుఁడు యుద్ధమొనర్చు చుండగన్

ఉ. పర్వత శృంగతుల్య సుర । వైరిశిరంబులు దైత్యరక్త సి
క్తోర్వి గుభాల్ గుభాలుమని । యుగ్రగతిన్ పడిరాలుచుండస
త్పర్వముగాఁ జూచి "దశ । కంఠుఁడు చావకనిల్చె వీని దో
ర్గర్వమణంగ కున్నదని । గాసిలుచుండిరి సుపర్వులెల్లరున్.

ఉ. ఉమ్మలికంబుతోడ దను । జోత్తముఁ డత్తఱిఁదత్త జెల్ల భ
ల్లమ్ములనేయుచున్ భుజము । లన్ వరుసన్ నిశితార్ధచంద్రబా
ణమ్ములచే శిరంబులఁ దృ । ణమ్ములకైవడిఁ దుంపఁగన్ వినో
దమ్ముగఁ జూచి వానరులు । దాశరథిన్ ప్రణుతించిరెంతయున్

ఉ. భల్లము లేయుచున రఘు | వల్లభునింగని మర్త్యమాంస భు
గ్వల్లభుఁడాగ్రహించి, యని | వార్యజవంబున విల్లువంచి జ్యా
వల్లి ధ్వనింపఁగన్ నిశిత | బాణసమూహము లెన్నియేసెనో
జల్లెడఁబోలె నయ్యెనర | సారథి దేహము మానినీమణీ.

ఉ. పంటవలంతికిన్ వ్రణము | నాటిఖలుండు దశాననుండు నె
న్నంటి వధించు నెంతటి బ | లాఢ్యుని నేన్ వెనుదీయకుండ! న
య్యొంటరిఁ జంపఁ బుట్టిన ర | ఘూద్వహుఁడక్కట గాసిలంగఁ బెన్
మంటలు బుట్టె దేహమున | మార్గణకోటి సముద్భవాగ్నికిన్.

కం. సీతా పతి హేలాగతి
శాతాశుగ కోటి నసుర | సారథిఁ గూల్చెన్
భీతిల్లె దైత్యనాయకుఁ
డే తీరునఁ బోరవచ్చు | నిత్తఱి ననుచున్.

గీ. అంత మఱి యొక్క రక్కసి | యరుగుదెంచి
రావణుఁడు మెచ్చుకొనఁగ సా | రథ్యమూనె;
రామచంద్రుండు రావణు | రథ్యములను
జంప యత్నించె నిష్ప్రయో | జనమ యయ్యె.

ఉ. సారథి ధీ విశారదుఁడు | స్యందనమున్ నడపించుచుండఁగన్
వారువముల్ రఘూద్వహుని | బాణములన్ వడిఁదప్పుకొంచు దు
ర్వారగతిన్ చరింప నసు | రప్రభు వెంతయు నుల్లసిల్లి దో
స్సారముఁజూప నయ్యెమర | సారథి రాముని తోడ నిట్లనెన్.

గీ. తాడి తాంగుడనైతిఁ బ్రి | క్ష్వేడనముల
నెట్టులోర్వంగ వచ్చు నీ | వెంత కాల
మిట్లు పోరాడఁ దలఁచితో | యెఱుఁగరాదు;
దనుజ నాథుని శీఘ్రంబ | దునుమ వలయు.

ఉ. బాణములెన్నియేన్ విడిచెఁ । బాతముఁ జేసెనుఁ గాల్పు, మత్తను
త్రాణముఁ జించె మేనుబహు । రంధ్రసమన్వితమయ్యెఁ; బొందెలో
ప్రాణము లెట్టు లున్నవని । యాశ్చర్యగమందు సంశయింతుఁ; గా
పాణమువంటి రావణుఁడు । చావఁడు నీ శరకోటి కక్కటా.

ఉ. ముచ్చటఁ దీర్చికొమ్ము సుర । పుంగవుతో రణరంగకేళిలో
నొచ్చె శరీరమంతయుఁ గ । నుంగొనుమా బహురంధ్రజాలసం
బిచ్చుకు వచ్చినట్లు వచి । యించిన వాఁడను గాను; రాఘవా
అచ్చెరుపాటు పొందిరి వి । యచ్చరు లెల్లరు నా యవస్థకున్.

ఉ. దానవులన్ వధించి వర । ధన్వియశంగరహించినట్టి భూ
జాని శిరోవిభూషణుని । సారథికీ దురవస్థ రాజు పెం
డ్లానికి ముష్టివాత యను । లాగున నున్నది; దివ్యబాణ సం
ధాన విధానమున్ మఱచి । నావె దాశరథీ వచింపుమా.

మ. దనుజేశుండు వరప్రసాద మహిమన్ । దర్పించి యున్నాఁడు; వీ
నిని సాధారణ దైత్యవీరుల వలెన్ । నిర్జింపఁగా శక్యమే?
జననిన్ జానకిఁ జూడఁగోరినఁ బ్రతి । జ్ఞన్ నిల్పభావించినన్
అనఘా! రాఘవరామచంద్రవడి బ్ర । హ్మాస్త్రంబుసంధింపుమా

మ. ఇనుఁడస్త్రాద్రికి నేగుచుండెఁ గనుమా; । యీరీతి నెన్నాళ్ళుఁ బో
రిన సాధారణ సాయకంబులను ని । ర్జింపంగ శక్యంబు గా
దని నిర్ధారణఁ జేసికొమ్మనఘ; బ్ర । హ్మాస్త్రంబువంగాని యి
ద్దనుజాధీశుఁడు చావఁడింతయును త । థ్యంబంచు నూహింపుమా

ఉ. వధ్యుఁడు వీఁడసాధ్యుఁడు ధ్రు । వంబుగ రుద్రునకేని; నాదు సా
రథ్యము వమ్మొనర్పగ శ । రంబుల నాపయి నేసె, నిర్జరా
రాధ్యుఁడ వైన నీవ యసు । రప్రభువున్ వధియింపఁ గావలెన్
తథ్యమెఱుంగఁ జేసితిని । దాశరథీ! సురథీ! సుధీ నిధీ.

చం. ఎఱుఁగనివాఁడవే రఘుకు । లేశ్వర! నీమహిమంబ మోహముం
చెఱిఁగియు నిశ్చయంబుగ సు । రేంద్రుఁడు తోడ్పడఁ గోరి పంపె న
న్నరదముతోడ; దైత్యవిభుఁ । డాకినుకన్ ననుఁ జావఁగొట్టె; నే
డైన నసురన్ వధింప వెను । దీసినఁ దాళఁగఁజాల సుంతయున్

చం. అనవిని రాఘవుం డదర । హాసము మోమున నంకురింప ని
ట్లనియెను, "రావణుండను భ । యంబున స్థైర్యము దక్కి నీవు నె
మ్మనమున సంచలించుటఁ బ్ర । మాద మొకించుక సంభవించె; స్యం
దనమును దోలుమా క్రమముఁ । దప్పక నిశ్చల చిత్తవృత్తితో.

ఉ. ముప్పు ఘటిల్లునంచుఁ దల । పోసెదవేమి మహాహవంబులన్
గొప్పయసంబుఁ గొన్న రణ । కోవిద! తప్పుల దిద్ది నీకు నేఁ
జెప్పెడి పాటివాఁడనె? వి । శేష బలాఢ్యుని దానవేంద్రు నే
నిప్పుడె సంహరింతు నొక । యించుక యోర్చినఁ జాలు మాతలీ.

ఉ. గండు మగండు రావణుఁడు । కాలుని కైవడి నున్నవాఁడు బ్ర
హ్మాండము మ్రింగు నేమొయను । నంతటి కోపభరంబు తోడ ను
గ్రుండయి యేగుదెంచె నది । గో; రథమున్ నడపింపు మక్కటా
నిండు మగంటిమిన్ విడిచి । నెమ్మది జంకెద వేమి యిత్తఱిన్.

ఉ. చావక తప్పదింక నప । సవ్య గతిన్ చనుదెంచెఁ బో యహం
భావ వశంబునన్ దనుజ । వర్యుఁడు; నిశ్చల చిత్తవృత్తితో
నీవు శతాంగమున్ నడుపు । మించుక నేరుపుఁ జూపి, లోక వి
ద్రావణుఁడైన రావణునిఁ । దప్పక యిప్పుడె సంహరించెదన్.

ఉ. పంతముఁ బూనినాఁడ గద । వైరివధింపక తప్ప దిత్తఱిన్
స్వాంతమునన్ చలింపకుము । పగ్గములన్ సడలంగ నీకు మా
వంతయు హానియుండదని । యాత్మఁ గడుంగడు విశ్వసించి వి
భ్రాంతిఁ బరిత్యజించి వెస । రథ్యములన్ నడపింపు మేపుమై.

కం. పది తూపు లొక్క సారిగ
పదితలలన్ దాకి నపుడె । బ్రహ్మాస్త్రంబున్
హృదిఁదాకు నట్లు విడిచెద
పది తల లిలరాలు నసుర । వసుధన్ గూలున్.

ఉ. మానవమాత్రుఁడన్ వినుము । మాతలిలోపములుండవచ్చుఁబం
చానన విక్రముండగు ద । శాననుఁ డల్పుఁడె యుద్ధరంగ పం
చాననుఁ డండు; దేవవిభు । సారథి వయ్యునెఱుంగ కుంటివే
పూనికతో శతాంగమును । మున్ నడపింపుము నిర్భయంబుగన్.

గీ. అనుభవజ్ఞాన శూన్యుండ । నాహవముల
నాఱితేఱిన దిట్టరి । యసుర వరుఁడు;
తలఁప వ్యత్యాస ముండక । తప్పదనుము;
అంతమాత్రాన వెనుదీయ । నగునె మనకు.

ఉ. సవ్యగతిన్ దొలంగి యప । సవ్యగతిన్ చనుదెంచు చున్నవాఁ
డవ్యయ దోర్బలాఢ్యుఁడ సు । రాధిపుఁడెంతయుగర్వితాత్ముఁడై
దివ్యరథంబు నక్రమ గ । తిన్ నడపింపుము రావణుండు హం
తవ్యుఁడు గాక యేమగు? న । దన్ దలపోయుమ ధీ పయోనిధీ.

ఉ. వేధయు వచ్చి నన్నిపుడు । వేఁడ్కొనినన్ విడనాడఁ జూవె; గో
సాధుజనంబుఁ గూలిచి మ । సంగిన ద్వీపికి ఘోరపాపి న
శ్లాఘ ఘటించి చంపుటయె । శ్లావ్యముగాఁ దలపోసి మత్ప్రభు
జ్ఞాఘనితోఁ బెనంగితిని । కంఠములన్ దునుమాడు వేడుకన్.

ఆ. వె. అడలి పగ్గములను । నడల నీయకు మయ్య
బెదరఁ బోకు దృష్టి । చెదర నీకు;
చూచుచుండు మింక । సుస్థిరాత్ముండవై
అసుర విభుని తోడి । యాహవంబు.

శా. శీర్షంబుల్ పడి నేల రాలు ననుచున్ । శ్రీరామచంద్రుండు జ్యా
కర్షానాదముమాఱు మ్రోగఁ గదిశల్ । కంపింప కాండంబులన్
వర్షించెన్; రఘురామచంద్రుని శర । వ్రాతంబు ఖండించుచున్
ధర్షించెన్ దశకంధరుం డఖిల దై । త్యశ్రేణి హర్షింపఁగన్.

ఉ. దెబ్బకు దెబ్బఁ గొట్టి వెను । దీయక రాముని యుబ్బణంచెదన్
నిబ్బర మున్న మేటి రజ । నీచర శేఖరుఁ డెట్టి వీరుఁ డో
యబ్బుర మందఁ గాకజగ । మంతయు నంచు నహంకృతిన్ మదిన్
ప్రబ్బిన కిన్కతోఁ జెలఁగి । రమ్మనిహుమ్మని హుంకరించుచున్

గీ. భుజము దునిమిన వేఱొండు । భుజము బుట్టు
శిరముఁ ద్రుంచిన మఱి యొండు । శిరము మొలుచు
నిర్భయంబుగ నెదిరించి । నిలువరించి
రాముని జయింతు ననియె నా । రావణుండు.

గీ. ఆకసంబున కుపమాన । మాకసంబ
సాగరంబునకున్ సాటి । సాగరంబ
రామ రావణ భీమ సం । గ్రామమునకు
సాటి యెయ్యది వర్ణింప । శక్యమగునె.

ఉ. ధీరులు మృత్యువన్న వెను । దీయని వీరులు వీరవిర్యులున్
వైరుల సంహరింప నని । వార్యులు వీరికి వీరె సాటి యీ
ఘోర రణంబుమున్నుగను । గొంటిమెవింటిమె చూడుడంచు లో
వైరములన్ త్యజించి యిరు । వా గులవారును నిల్చిరత్తఱిన్

గీ, దైత్యనాథుని నొప్పించి । ధ్వజముఁ ద్రుంచి
రథ్యములఁ ద్రున్మి చెలఁగి సా । రథి వధించి
స్యందనముఁ గూల్చె దశరథ । నందనుండు;
కడల వ్యాపించె దానవా । క్రందనములు.

శా. రోషావేశ విభీషణాస్యుఁడగుచున్ । క్రోధాకృతిన్ రుద్రుఁడై
ఈషాదంశముఁబూనిదైత్యవిభుఁడున్ । జృంభించెద్వేషించి;సం
తోషించెన్ దనుజోత్కరం బసురరా । ట్ద్రోద్దర్పముంజూచి యు
ద్ఘోషించెన్ కపిసంచయంబు సురలా । క్రోశించి రాక్కుమ్మసిన్.

గీ. ఇనకులుఁడు సుస్థిరాత్ముఁడై । యెల్లకపులు
ప్రస్తుతింపఁగ లస్తక । న్యస్తహస్తుఁ
డై ప్రయోగించె బాణంబు । లక్ష్యతముగ
నసుర నాయకు నుద్రేక । మణఁగునట్లు.

గీ. పరిఘ తోమర ముద్గర । ప్రాసఖడ్గ
పట్టిస కుఠార సాధన । వ్రాతమునను
అసుర నాయకుఁ డలిగి పో । రాడుచుండ
రథముతో వచ్చె దనుజ సా । రథి యొకండు.

గీ. స్యందనంబెక్కి నూతనో । త్సాహమునను
దశధనుస్సులఁ జేఁ బూని । దశముఖుండు
ప్రళయ మార్తాండ బింబు । పగిదిఁ గ్రాలి
తన ప్రతాపంబుఁ జూపె న । త్తరుణమునను.

శా. సంధిన్ గోరక సాధుమార్గమున; దు । శ్చారిత్రుఁడై క్రూరుఁడై
రంధిన్ బెట్టిన రావణున్ దునిమి ధ । ర్మంబున్ ప్రతిష్ఠింపఁగా
సంధించెన్ రఘురామచంద్రుఁడు జగ । త్సంత్రాణమున్ బాణమున్
కంధిప్రావృతమేదనీ వలయ భ । క్తవ్రాత కళ్యాణమున్.

గీ. అట్లు సంధించి నట్టి సా । యకముఁ జూచి
అతిభయంకర బ్రహ్మాస్త్ర । మాత్మఁ దలచి
రౌద్రరసమును వర్షించి । రాఘవుండు
రావణున్ జూచెఁ ధిల్లి । రావణుండు.

ఉ. ద్వాదశభాస్కరుల్ నయన । పద్మయుగంబున భాసిలంగ నే
కాదశరుద్రు లాస్యమునఁ । గ్రాల "లయాంతకు రీతినుండె నా
రా దశవేషిగాక రఘు । రాముఁడు మర్త్యుఁడె యంచు భీతితో
నా దశకంధరుండిన కు । లాబ్జముఁ జూచెఁ బ్రకంపితాత్ముఁడై

మ. హనుమజ్జాంబవదాది వానరులు బ్ర । హ్మానందమున్ జొందఁగా
ఇనుఁడస్తాద్రికి నేగుచున్న సమయా । వీక్షించి లోకావనుం
డన ఘంటా రఘురాముఁ డుగ్రగతి బ్ర । హ్మాస్త్రంబు సంధించి ని
ల్చిన క్రోవింగవి తల్లడిల్లె దనుజ । శ్రేష్ఠుండు నిశ్చేష్టుఁడై.

గీ. రామచంద్రుని దివ్య వి । గ్రహముఁ గాంచి
మంత్రముగ్ధ సర్పంబుల । మాడ్కి నుభయ
సైన్యముల వారు స్తంభింప । సమరభువిని
అద్భుతంబుగ నిశ్శబ్ద । మావహిల్లె.

ఉ "దైత్యకులాధిపుండ నను । దర్పమొకింత తొలంగ నెమ్మదిన్
సత్యమెఱుంగఁ జాలితిని । జానకి మానవిఁ గాఁ దలంచి యా
దిత్య కులోత్తమున్ జడమ । తిన్ నరమాత్రునిగా దలంచి యీ
మృత్యువుఁ దెచ్చికొంటినిపు । డెట్టి యుపాయము దోపదక్కటా

గీ. అని ప్రతిక్రియ నూహించి । యసుర విభుఁడు
వారుణాస్త్రంబు సంధించు । తరుణమునను
అర్కకులవర్యు బ్రహ్మాస్త్ర । మర్ధచంద్ర
బాణ దశకంబుతోడ రా । వణునిఁ గవిసె.

కం. పదిబాణము లొక్కుమ్మడిఁ
బడి తలలన్ దాకినపుడ । బ్రహ్మాస్త్రంబున్
హృదిఁ దాకునట్లు విడువఁగఁ
బడి తల లిల రాలె నసుర । వసుధం గూలెన్.

గీ. అంబరము నుండి పుష్ప వ । ర్షంబు గురిసె
దేవతా కోటి దుందుభుల్ । దిశల మ్రోగె
మంగళము మంగళము జయ । మంగళమని
విజయరాఘవు వినుతించె । విబుధ విభుఁడు.

గీ. భూధరము లేక యున్నత । భూరుహంబొ
పుడమి తడఁ బడు వసువునఁ । బడిన యట్లు
నిర్జరారాతి కాయంబు । నేలఁ గూలె
నాది శేషుని శీర్షంబు । లణఁగి మణఁగె.

గీ. అప్పుడె పతంగుఁ డస్తాద్రి । నస్తమించె
నంతటఁ బతంగ కుల రవం । బలము కొనియె;
అసుర నాయక భాస్కరుం । డస్తమించె
క్రిందుకొనె సర్వ దాన వా । క్రందనంబు.

ఉ. చచ్చిన జేని కై వగచి । చచ్చిన లాభము లేదు, పోరినన్
మెచ్చిన నాథుఁ డెవ్వఁడు? స । మీకమునం బడి చావ నేటికిన్
హెచ్చిన దుఃఖమున్ నిలిపి । యిచ్చట నిల్చిన నిల్వనీయరం
చచ్చటి నుండి పాఱిరి భ । యంపడి దానవ సైన్యనాయకుల్.

చం. అసుర విభుండు చచ్చెనని । యార్తికిఁ జిక్కి ప్రకంపితాంగులై
అసురులు "వెంబడించి కపు । లందఱుఁ బైఁబడవత్తు రెట్టులేన్
ఉసురుల నిల్పుకొంద"మని । యొక్క మొగిన్ భయవిహ్వలాత్ములై
పసచెడి లంకకున్ బరువు । వాఱిరి వేల్పులు చూచి నవ్వఁగన్.

కం. గర్వాంధకార కలనన్
సర్వేశ్వర్యస్థానము నెఱుఁగఁ । జాలక యకటా
యుర్విం బడెఁ రావణుఁడు సు
పర్వుల కెన లేని నేత్ర । పర్వముగాఁగన్.

కం. చచ్చెన్ రావణుఁ డను నుడి
చిచ్చువలెన్ దిశలఁ బ్రాకె। చిత్తము లలరన్;
అచ్చరలయాట పాటలు
మెచ్చుకొనందగిన యట్లు। మింటఁ జెలంగెన్.

ఉ. ఉల్లము లుల్లసిల్ల నిక। లోర్విఁ జరించెదు జీవకోటికిన్
సల్లలిత ప్రసూనముల। సౌరభముల్ వహియించి యెల్లెడన్
చల్లని గాలి వీవఁగఁ బ్రి। సన్నతఁ బొందె నభంబు మానసభు
గ్వల్లభుఁడై గ్గ నంచమర। వల్లభుఁ డాతయు సంతసింపఁగన్.

సీ. విజయ రాఘవ నీకు। విజయంబు చేకూరె
సకల జీవులకుఁ। గళ్యాణమొదవె
లోకేశ శ్రీరామ। లోకకంటకుఁ డీల్గె
లోకంబులకు నెల్ల। శోకమణఁగె.
అఖిలమానవులకు। సత్యవ్రతంబైన
కార్యంబు గావించి। ఘనతఁ గొన్న
నిత్య సత్యవ్రతా। దైత్యాంతక ఖ్యాతి
అఖిలదేశంబుల। నాక్రమించె

గీ. ధర్మకర్మానుకూల వ। ర్తనము వలన
జయము చేకూరు ననెడు వి। శ్వాస మవని
జనులకు జనింప మెలఁగిన। జనవరేణ్య
ఆశ్రిత శరణ్య సర్వలో। కాగ్రగణ్య.

ఉ. వందనమార్యహృత్కమల। భాస్కర, యాశ్రితచందనా! దశ
స్యందన నందనా సకల। సద్గుణ ధామ పవిత్రనామ సం
క్రందన ముఖ్యదిక్పతులు। రంజిల నేటికిఁ గ్రూరదానవా
కందన మాలకించితిమి। కర్ణ పుటంబుల కింపు నింపఁగన్.

ఉ. ఎందఱో యేడ్చునట్టులను । కేందురిన కెల్లవరంబు లిచ్చితిన్
కొందలమందె డొందమని । కుంది కృశించిన యట్టి యా శతా
నందుఁడు సంతసించెఁ దన । నామము సార్థక మయ్యెనంచు సం
క్రందన చిత్తరంజన ని । రంజన దానవ లోక భంజనా.

సీ. సద్గుణా రామ శ్రీరామ । జయము జయము
అని బృహస్పతి వినుతించు । నంతలోన
ఒక్కమొగినెల్ల దిక్కులఁ । బిక్కటిల్లె
రాక్షసాంతః పురాంగ నా । క్రందనములు.

గీ. రోదసిన్ మాఱు మ్రోఁగఁగ । రోదనంబు
వినత వదనలై సవతులు । వెంబడింప
పృథ్వి శోకంబు మూర్తీ భ । వించి నట్లు
భండనస్థలి కేతెంచెఁ । బట్టమహిషి.

ఉ. సోదరి వాక్కులన్ విని కృ । శోదరి జానకి లక్ష్మియన్న నన్
గాదని యాదరింపక య । కారణ వైరముఁ బెట్టుకొంటి వీ
వే దరి కేగినావో హృద । యేశ్వర యేనును వత్తునంచు మం
దోదరి యేగుదెంచెఁ గను । దోయిని నశ్రులు జాలువాఱఁగన్

గీ. త్రెళ్ళిన శిరంబు లెల్ల శ । రీరమునకుఁ
గూర్చి భండనస్థలిఁ బండు । కొన్నయట్టు
లున్న రావణుఁ జూపించి । యోధవరులు
బోరుమని యేడ్చి రప్పు డం । భోరుహాక్షి.

గీ. అవనిఁ బడియున్న రావణు । నాక్రమించి
చుట్టు సవతులు గూర్చుండఁ । బట్టమహిషి
శీర్ష దశకంబుఁ దన బాష్ప । వర్ష ధారఁ
గడిగి విలపించి కరఁగించె । గండశిలల.

సీ. మదన శాస్త్రమునకు । సదనంబు లన నొప్పు
వదనంబు లే యివ్వి । ప్రాణనాథ
సామ్రాజ్య లక్ష్మికి । సంస్థాన మనఁ గ్రాలు
వక్షంబె యియ్యది । ప్రాణనాథ
ఆలింగనము నన్న । న్నలరించి యలరిన
బాహువులే యివ్వి । ప్రాణనాథ
నడచిన పుడమిని । గడగడ వడకించు
నడుగుఁదమ్ములె యివ్వి । ప్రాణనాథ.

గీ. సంహరించెన నరుఁడు నిన్ । సింహమధ్య
సగము చచ్చిన నాకింక । జగము మిథ్య
దాన వాధీశ! నీతోడి । దానవేను
బ్రదికి యెట్లోర్తు నీబాధ । ప్రాణనాథ.

ఉ. భావ్యముగాదు రాఘవుని । భార్యను దెచ్చితి వంచుఁ నీదు బాం
ధవ్యము రోసి శీఘ్రగతి । దాశరథిన్ బురికొల్పి మాకు వై
ధవ్యముఁ గూర్చె నీయనుఁగుఁ । దమ్ముఁడు దానవనాథ యింక క
ర్తవ్యము దోప కిట్లు బహు । ధా విలపించుచు నుంటి మిచ్చటన్.

గీ. దుర్జయుల సంహరించిన । దోర్బలాఢ్య
అడవి మనుజులకుం జిక్కి । మడసినావె;
ఏడు సంద్రంబులను దాటి । యింటిముందు
కాల్వలోఁ బడి చచ్చిన । కరణి నకట.

కం. సుర దైత్య మర్త్య వీరులఁ
బరి మార్చిన సాటిలేని । బలుఁడవు నరవా
నరులా నినుఁ బరి మార్చిరి
నరమాత్రుఁడా రాఘవుండు । నారాయణుఁడో.

"సీ. పరమపావన మైన । బ్రహ్మవంశంబున
నిరుపమానముగ జ । న్మించినావు
అనుపమాన బలాఢ్యు । లనుజులు సేవింప
బహుతపంబు లొనర్చి । ప్రబలినావు
సుత్రామ జిన్ముఖ్య । సురవరేణ్యులఁ
గొడుకులఁ గనుపారఁ । బడసినావు
దశముఖంబుల తోడ । దశదిశానాథుల
గడగడ లాడించి । యడరినావు,

గీ. పెక్కు వీరాధి వీరుల । యుక్కణంచి
మ్రొక్కు లంగొన్న నీవిట్లు । దిక్కు లేక
ఒక్క మనుజుచే మడసితే । యక్కటకట
సమర సమవర్తి దానవ । చక్రవర్తి.

సీ. రాముండు శంకరా । రాధ్యుండసాధ్యుండు
వైరంబు వలదంటిఁ । బ్రాణనాథ
రాముండు నిర్జిత । రాముండు వినత సు
త్రాముండు వినుమంటి । ప్రాణనాథ
రాముండు దుర్వార । రాక్షస కరిరాజ
హర్యక్షు మని యంటిఁ । ప్రాణనాథ
రాముండు లోకాభి । రాముండు రణభీముఁ
డాలింపు మంటినో । ప్రాణనాథ

గీ. ఎంత బ్రతిమాలి చెప్పిన । సుంతయైన
వినక లోకసమ్మత మార్గ । మునను జనక
జనక జందెచ్చి శ్రీరాముఁ । జెనకఁ బోయి
ప్రాణములఁ బాసితే నీవు । ప్రాణనాథ.

కం. నినుఁ బట్టి కారఁ బెట్టిన
జననాథునిఁ గార్తవీర్యు । సమయించిన రా
ముని నోడించిన రాముఁడు
మనుజుఁడె వినుమని నిను బ్రీతి । మాలితి నాథా.

కం. పరకాంతా చోరుని నినుఁ
బరిమార్పఁగ సీత నట్టు । వనమున విడిచెన్
పరికింపుము శ్రీరాముఁడు
నరుఁ డంచు భ్రమింప వలదు । నాథా" యంటిన్.

కం. ఖర దూషణాది రాక్షస
వరులను రాముండొకండ । ఖండన సేయన్
పరిమార్చె నపుడ పలికితి
నరుఁడంచు భ్రమింప వలదు । నాథా యనుచున్.

కం. కర మరుదుగ నొక శరమునఁ
బరి పూర్ణ బలాఢ్యుఁడైన । వాలిం గూల్చెన్
పరమాత్ముఁడు శ్రీరాముఁడు
నరుఁడంచు భ్రమింప వలదు । నాథా యంటిన్

కం. కరువలి కొడు కుద్ధతి నీ
పురిలో జొరబడిన యపుడ । బోధించితి వా
నరులన్ గూడిన రాముఁడు
నరుఁడంచు భ్రమింప వలదు । నాథా యనుచున్.

సీ. నాకారి పేర్వెన్న । పాకారి భీతిల్లు
నని దైత్యు లెవ్వాని । నభినుతింతురు
రాక్ష సాధ్యక్షుండు । యక్షేశునకుఁ బిక్క
బల్లె మంచెవ్వానిఁ । బ్రస్తుతింతురు

సంగ్రామ సమవర్తి । సమవర్తి నోడించె
నని మెచ్చని జగంబు । లాదరించు
దశకంఠుఁ డేతెంచె । దశదిక్కులల్లాడె
ననివైరు లెన్నని । కణఁగి యుండ్రి

ఆ. వె. కందు కంబు కరణిఁ । గైలాస కుధరంబు
నెవని కరము లాడు । నిరవు కొసఁగె
అట్టి పోలరేఁడు । ఖ్యాతికెక్కిన ఱేఁడు
దిక్కులేక నేఁడు । తెగిన వాఁడు.

మ. అకలంకుండగుఁగాక దివ్యచరితుం । డౌఁ గాక యమ్మర్త్య బా
లకుఁ డుత్తుంగ తరంగ సంఘపరిఖా । లంకాపురింజొచ్చి, నిన్
సకల ద్వీప పరీత భూతల మహా । సామ్రాజ్య ధౌరేయునిన్
అకటా యొల్ల వధించె? మద్విధక నా । థ్యంబెద్ది ప్రాణేశ్వరా

గీ. మనుజ మాత్రుండు బలహీనుఁ డనఁగరాదు
అఖిల జీవులయందు నే । నలరుచుందు;
అలుపు లెవరంచుఁ దెలుపనిన్ । బిలుకుమార్చ
మనుజుఁ డనిపించు కొన్నయ । మ్మాధవుండు.

మ. అతిసర్వత్ర విసర్జయేత్తనెడి న్యా । య్యంబున్ విసర్జించి దు
ర్మతినై యన్యసతీ కరగ్రహణ దు । ర్వ్యాపార పాపాగ్ని కా
హుతిఁ గావించితి పున్నతాన్వయనవం । బూహింపఁగా నిట్టిదు
స్థితికిన్ మృత్యువుఁ దెచ్చికొంటి నకటా । సీతాపదేశంబునన్

ఉ. చెప్పితి నీకు శూర్పణఖ । చెప్పిన యట్లొనరింపఁ బోకుమా
గొప్ప యుపద్రవంబు నమ । కూడక పోదని, లోకధర్మమున్.
దప్పి బలుండనంచు భుజ । దర్పమునన్ జని సీతఁదెచ్చితే
ముప్పు ఘటిల్లునంచుఁ దల । పోయక దానవ లోకనాయకా

గీ. శూర్పణఖ నిన్నుఁబురికొల్పె । సుదతి కొఱకు
నీతుల వచించి తమ్ముండు । నిన్ను విడిచి
వైరులంగూడె వంశంబు । ధ్వంస మయ్యె;
నకట నీ వారె నీ వైరు । లరయ వైతి.

ఉ. మాయలుమంత్రముల్ సకల। మారణయంత్రములున్ కుతంత్రముల్
ఆయుధముల్ విమానములు । నస్త్రములున్ గలవిన్నియుండియున్
తోయధి మధ్యభాగమున । దుర్గమునన్ గల దైత్య సింహ! నీ
కాయువుమూడె;ధర్మరహి । తాత్ముల కెయ్యెడ క్షేమముండు నే

గీ. ఉదధి మధ్యస్థ దుర్గమం । దున్ననిన్ను
మానవుఁ డొకండు పరిమార్చె । దానవేంద్ర!
గిరి గుహాంతర సుప్త కే । సరినిఁ గూల్చె
హరిణ శాబక మన్నట్టు । లరి కృతాంత.

ఉ. శర్వుని నిత్యమున్ గొలిచి । శాత్రవులన్ బరిమార్చిపేర్చి యి
య్యుర్వి నజేయుఁడైన దను । జోత్తమునిన్ పతిగా గ్రహించి దో
ర్గర్వమునన్ జగన్నుతులఁ । గాంచిన యిందజిఁగంటి; నామనో
గర్వము సర్వమున్ తొలఁగె । గా నర మాత్రులవిక్రమంబునన్.

సీ. నడయాడ నేర్చిన । నగముఁ బోలిన వాఁడు
జృంభించి పోరాడు । కుంభకర్ణుఁ
డమరేంద్రు నోడించి । యమరుల నేడ్పించి
యేపుఁ జూపిన వీరుఁ । డింద్రజిత్తు
పాతాళ లంకేశ । ప్రఖ్యాతి కెక్కిన
రణజీవనుండహి । రావణుండు
దుర్వార దోర్బల । గర్వారి భూవర
ప్రాణాంత కుండు న । రాంతకుండు

గీ. రావణుఁడ వీవు లోకవి ౹ ద్రావణుఁడవు
ఎల్లరు నశించి రమ్మర్త్యు ౹ లెట్టి వారో?
కాకములు గృధ్రములు నీదు ౹ కంఠములను
మెసఁగు చున్నవి ప్రాణేశ ౹ మేదినీశ.

కం. మృత్యుంజయునకు నిక్కపు
భృత్యుండవు మృత్యువెట్లు ౹ మ్రింగెన్ నిన్నున్
దైత్యేశ్వర! మనుజునిచే
సత్యంబుగఁ గూలినావె ౹ స్వప్నంబేమో.

సీ. నినుఁదక్క మఱియొక్క ౹ వనితను వాంఛింప
నని బాస చేసితి ౹ వసుర నాథ!
మన్నింపుమా నన్ను ౹ నిన్నాదరించెద
నిది నిక్క మంటివి ౹ హృదయనాథ
అలరింపుమా నిన్ను ౹ వలచితి మనసార
దయఁ జూడు మంటివి ౹ దనుజనాథ
నిను రాజ్ఞిఁ గావించి ౹ నీయాజ్ఞ నిరతంబుఁ
పాలింతు నంటివి ౹ ప్రాణనాథ

గీ. ఇట్లు వచియించి వలపించి ౹ యేలు కొనుచు
దినమునకు నొక్కసతిఁ గూడి ౹ తనివిసనక
జనక జఁదెచ్చినా విట్లు ౹ చచ్చినావు;
హారున కేన్ దప్పు నొక్కొక ౹ ర్మానుభవము.

కం. మతిమాలి యితర సతులను
రతికేళిన్ గూడఁ గోర ౹ రాదని నిన్నున్
బ్రతిమాలితి నా పతివని
క్షితిఁ గూలితివి విట్టు లొక్క ౹ సీతాపతిచే.

ఉ. చక్కని చుక్కలైన నెఱ । జాణల మించిన యందకత్తెలన్
పెక్కురఁ దెచ్చికూడితివి । వేల్పుల సానులలోన సొంపు పెం
పెక్కిన రంభఁగూడితి వొ । కించుక యైనను తృప్తి లేక నీ
వక్కట సీతఁ దెచ్చి తఱి । లాసుర కోటికి కాలమృత్యువున్.

ఉ. ఓర్పొక యింత లేక స్వబ । లోన్నతి కుబ్బిన నట్టి భూపుఁడేన్
నేర్పరియై భువిన్ బొసఁక । నేర్చిన యెల్లర గెల్చినీవు కం
దర్పు జయింపఁ జాలని క । తంబున వ్యర్థమ యయ్యె నీదు దో
ర్దర్పము కామిని హృదయ । తస్కర దానవ లోక భాస్కరా.

చ. చదివితి వెల్ల శాస్త్రముల । సాధ్యుఁడు రావణుఁడంచు నెన్నఁగన్
చదివిన దానికిన్ ఫలము । చక్కఁగఁ జేసితె, నొక్క కాంతకై
హృదయము నిల్ప లేక కుల । మెల్ల నశింపఁగఁ జేసి తీవు కో
విదుఁడవె పాడితుండవె వి । వేకివె చెప్పుము దానవేశ్వరా

గీ. జలధిపై నమ్ము తంబుగ । శిలలఁ దేల్చి
సేతువుంగట్టి వానర । సేన నడపి
రామచంద్రుండు లంకా పు । రంబుఁ జొచ్చి
నప్పుడే చెప్పితిని నీకు । నసుర నాథ.

ఉ. సీత మహాపతివ్రత వి । శిష్టజన ప్రణుతాదిశక్తి యి
భ్భూతల మందుఁ బుట్టెఁదల । పోయఁగ మానవిగాదు, మానవా
తీతుఁడు రాఘవేశ్వరుఁడు । దేవ హితార్థము దానవాంతక
ఖ్యాతికిఁ బుట్టినట్టి హరి । యంచు వచించితి నాలకించితే.

ఉ. బంగరు బొమ్మఁ గోరి, రఘు । వర్యుని దవ్వుగఁ బంపనెంచి మేల్
బంగరు లేడిఁ బంపితివి, । బంగరు బొమ్మను జూపి, నిన్ వధిం
పంగ దలంచినట్టి రఘు । వర్యు నభీష్టము మోహమై ఫలిం
చెంగద నీవెఱుంగక న । శించితి వుగ్ర రణాంగణంబునన్.

చం. ఎఱుఁగనిమూఢుఁడేరవికు । లేంద్రుఁడుబంగరులేడి యుండదం
చెఱిఁగియె యేగెఁ గామివగు । నీవు సతీమణి దొంగిలింప; నీ
వెఱుఁగనివాఁడవేరఘుకు । లేంద్రుఁడవార్యమహాబలాఢ్యుఁడం
చెఱిఁగియె దొంగిలించి తిటు । లెల్లరు దుర్మరణంబు బొందగన్.

గీ. గౌతముని భార్యఁ బాకారి । గవిసి వచ్చె
నమర గురు భార్యఁ గోకారి । యపహరించె;
సమరమున వారి నెవ్వఁడు । సంహరించె
సోదరులు లేక బ్రదికిరా । చోరవరులు.

మ. పరకాంతా పరవిత్త హారులెపుడేన్ । పాపాత్ములెన్నైన, ని
ద్ధరలో నెందఱులేరు వారినవరేన్ । ధ్వంసంబుఁ గావించిరే?
తరుణిన్ దెచ్చితివంచునిన్ విడిచెనా । తమ్ముండు నీకొంప సం
గరరంగంబునఁ గూల్చె నీదు కలిమిన్ । కాంక్షించి దైత్యేశ్వరా.

గీ. వనిత లెందఱు నీబాహు । పంజరమున
నీ బలాత్కారమునను బం । ధింపఁ బడరు?
నీదు సోదరుఁడే నాఁడు । నిన్ను విడిచెఁ?
గోరి రాజ్యార్థియై రాముఁ । గూడెఁగాక.

చం. బవరమునందు బంధుపరి । వారముతో సుతసంచయంబుతో
నెవఁడు నశించెనన్న దను । జేశుఁడు రావణుఁడొక్కఁడంచు మా
నవులు ప్రమోదమొందఁగ ర । ణంబునఁ గూలితివెంత యేడ్చినన్
సవతులు నేను నగ్నిఁ బడి । చావక తప్పదు దానవేశ్వరా”

ఉ. రోదన మాలకించిన వి । రోధుల కన్నులుఁ జెమ్మగిల్ల నా
వేదన నోర్వలేక పృథి । వింబడి నెత్తిని మొత్తుకొంచు మం
దోదరి యేడ్చి యేడ్చి పటు । దుఃఖపయోధి మునింగినంతనే
రోదసి మాఱుమ్రోఁగె నవ । రోధజనంబుల యార్తనాదముల్.

సీ. లాలించి ననుఁ గూర్మిఁ । బాలించు పతి వంచు
దుఃఖించె నపు డొక్క । తోయజాక్షి
పద్మినీ మానస । పద్మ భాస్కర యంచు
శోకించె నపు డొక్క । సుందరాంగి
హా నాథ ననుఁ బాసి । యరిగితే నీ వంచు
విలపించె నపు డొక్క । వెలఁది మిన్న
ప్రాణముల్ నిలుచునా । ప్రాణేశ్వరా యంచు
మూర్ఛిల్లె నపు డొక్క । పువ్వుబోణి.

గీ. అమిత సంతాప తప్త బా । ష్పముల విడిచె
రావణుని వక్షమున నొక్క । రాజవదన
రామ శర వినిర్దళిత శీ । ర్షములఁ జూచి
భోరుమని యేడ్చె నొక్కయం । భోరుహాక్షి.

గీ. క్షోభమును బొంది యేడ్చిన । లాభ మేమి?
దాల్మిఁ జూనుఁడు ననుఁ గన్న । తల్లులార
అనుచు దైత్యాంగనలఁ జూచి । యినకులుండు
కంటఁ దడిఁ బెట్టి యోదార్చెఁ । గనికరించి.

గీ. రాక్షసాంతః పురాంగనా । క్రందనంబు
దిశల వ్యాపించెనో లేదో । తెల్లవారె;
దహన సంస్కార దర్శనో । త్సాహి యగుచుఁ
గర్మసాక్షియుఁ దోఁచెఁ బ్రా । క్తటము నందు.

గీ. అంతి పురికాంతలం జూచి । యన్నఁ జూచి
తుదకు వినశించెఁ గుల మంచు । దుఃఖభార
వినత వదనుఁడై యున్న వి । భీషణుఁ గని
ఎలమి శ్రీరాముఁ డోదార్చి । యిట్టు లనియె.

సీ. అమరులు వినుతింప । నజుని వేదములకు
భాష్యంబు పలికిన । పండితుండు
శర్వుని వినుతించి । సర్వమంగళఁ గొల్చి
మహిమంబుఁ జూపిన । మంత్రివేత్త
శాస్త్రముల్ శోధించి । శస్త్రాస్త్ర సంతతిఁ
గూర్చి పేర్చిన రణ । కోవిదుండు
అడిగిన యంతనే । యాశ్రిత కోటికి
ధనమొసంగిన మహా । త్యాగమూర్తి.

ఆ. వె. నిక్కువంబు వినుము । నీకును నాకును
తండ్రి వంటి వాఁడు । దనుజ విభుఁడు;
అన్న ఋణముఁ దీర్చి । యతని సింహాసన
మాక్రమింప వలయు । నసురవర్య.

గీ. బాష్పములఁ దిలోదకముల । బంధు తతికి
విడుచుటకు నీవమి గిలితి । వ్వాడమి యందు
శ్రద్ధఁ గైకొని దహన సం । స్కార విధుల
కుత్సహింపుము దానవ । యోధ వర్య.

చం. సహగమనం బొనర్చుటకు । సాహసముం గల వీరకాంతలన్
గృహముల కేగునట్టు లొన । రింపుము; భర్తృవిహీన లెల్ల దు
స్సహమగు దుఃఖభారమునఁ । జావఁ దెగింతురు; మిన్నకుంట బం
ధుహితము గాదు సర్వజన । దూషితమయ్యెడి దానవోత్తమా

చం. అనవిని జానకీ వరుని । యానతి సోదరుఁ దాల్చి లేచి య
ద్దనుజకులావతంసుఁడు య । థావిధి సర్వమొనర్చ నెంచి చం
దనచితిఁ బేర్చి యద్దనుజ । నాథుని నందుఁ బరుండఁ బెట్టి య
గ్నిని తగిలించి యేడ్చెఁదన । నేత్రములన్ జలధార లూరఁగన్

ఉ. భర్గుని మెప్పులన్ బడసి । బ్రహ్మను గొల్చి వరప్రసాదివై
స్వర్గము సంచలింప రిపు । వర్గము గెల్చిన నీకు నేటికీ
దుర్గతి సంభవించె విధి । దుస్తర మంచు విభీషణుండు నై
సర్గిక దుఃఖమున్ నిలుపఁ । జాలక యేడ్చె ననేక భంగులన్.

కం. చితిపై జ్వాలల నడుమన్
పతి దేహముఁ గాంచి దుఃఖ । భారము కలనన్
మతిఁ గోలుపోయి మూర్ఛిలి
సతి మందోదరి సహింపఁ । జాలక యేడ్చెన్.

ఉ. " పూజ్యుని నిన్నుఁ బాసి రఘు । ముఖ్యుని గొల్చి విభీషణుండు సా
మ్రాజ్యము మీఁది కాంక్షఁ బర । మానిని దొంగిలి తెచ్చినాడవన్
వ్యాజ్యముఁ జూపి నిన్నణఁచె; । భర్తృ విహీనల కెల్ల దేహముల్
త్యాజ్యము లౌటఁ బ్రాణముల । నాహుతిఁ జేసెద నగ్నికీలలన్.

మ. " అనురోధింపకుఁడీ విభున్ గలయఁగన్ । ప్రాణంబు లర్పించి యీ
తనువుం బాసెదఁ గాక దుర్భర మన । స్తాపాగ్ని చల్లారఁ గా"
నని మందోదరి యగ్నిలో దుముకగన్ । యత్నించి మూర్ఛిల్లి నం
తనె యాపెం గొని యేగిరంతిపురికిన్ । దైత్యాంగనల్ కుందుచున్

గీ. అగ్రజన్మునకుఁ దిలోద । కాదు లొసఁగి
దానధర్మంబు లొనరించి । దనుజు లలర
ధనము వెదఁ జల్లి మెల్లరఁ । దనియఁ జేసి
స్నానముం జేసి నూత్న వ । స్త్రములఁ దాల్చె.

గీ. ఆశ్రితులఁ జూచి యాప్తుల । నాదరించి
హితుల నలరించి సచివుల । నేర్పరించి
వెడలి వచ్చెద ననుచు వి । భీషణుండు
ఇన కులోత్తము వీక్షింప । నేగుదెంచె.

మ. అహితారణ్యమహాదవానలుని సృ । త్రాఖ్యాసురున్ గూల్చి ప్ర
త్రిహుఁ డుత్సాహమునన్ విరాజిలుచు నం । దానన్ ప్రకాశించుచున్
సహసైన్యుండయి వాయునందనునితో । సౌమిత్రితోడన్ రఘూ
ద్వహుఁ డుండెన్ తిలకించి భక్తి మెయిన । ద్దైత్యోత్తముం డిట్లనెన్.

ఉ. దానవులెల్లరున్ బొగడ । దానవ భర్తకు శ్రద్ధతోడ నీ
వానతి యిచ్చినట్లు శ్రీయు । లంచిత రీతి నొసర్చి ముక్తికై
స్థానముఁ జేసి నూత్నవస । నంబులఁ దాల్చి యేగుదెంచితిన్
మానవ రూపమున్ గొనిన । మా హృదయేశ్వర జానకీ వరా

చం. అనవిని రాఘవుండు దర । హాసము మోమున నంకురింప న
ద్దనుజ కులావతంసుఁ గని । తద్దయు రమ్మని యాసనంబుఁ గై
కొనుమని గౌరవించి కపి । కోటిని గాంచి బహూకరించి నె
మ్మనమున సంత సంబొదవ । మాతలిఁ జూచి వచించె నీ గతిన్

గీ. స్యందనము తోడ హరికి నా । వందనముల
నందఁ జేయుము, డెందమా । నంద మొంద
విజయము లభించె; విజయంబు । విబుధ విభుని
దని వచింపుము మాతలీ! । యరిగి రమ్ము.

గీ. అమర సారథిఁ బంపి య । త్యాదరమున
హనుమ దంగద ప్రముఖ వీ । రాధివీర
వర్యు లాలించునట్లు సో । దరునిఁ జూచి
ఇన కులోత్తముఁ డనురక్తి । నిట్టు లనియె.

"ఉ. దానవ వంశభూషణుఁడు । ధర్మపరుండు విభీషణుండు స
న్మానముఁ బొందఁగాఁ దగిన । మాన్యుఁడు; మానవులందు వైరమున్
మానిన సాధువర్తనుఁడ । మాయికుఁ డంచు నొసంగి పట్టి వా
ద్దానముఁ బూర్తి చేయవలెఁ । దమ్ముఁడ! యింక విళంబమేటికిన్.

ఉ. అన్న యధర్మవర్తనుఁడ । యంచుఁ దలంచి పరిత్యజించి యీ
పన్నత నున్న నన్ గొలువ । వచ్చినవాఁడని యెంచి నిన్ను సం
పన్నునిఁ జేయువాఁడనని । పల్కితి నన్ను భజించు భక్తుల
భ్యున్నతిఁ బొందగావలయు । నున్నత భాగ్యరమా ధురీణులై.

గీ. అఖిలము పరిత్యజించి, న । న్నాశ్రయించు
భక్తవర్యులఁ గాపాడ । వలయు నేను;
శీఘ్రముగఁ బొమ్ము పట్టాభి । షిక్తుఁ జేయు
మీ విభీషణు నాలస్య । మేటి కింక.

గీ. అనిన విని యన్న యానతి । నవధరించి
అర్క పుత్రాది కపి వీరు । లనుసరింప
సైన్య సహితుఁడై విభీ । షణుని తోడ
లక్ష్మణుండు నిరాతంక । లంకఁ జొచ్చి.

గీ. పట్టముంగట్ట వలె నంచుఁ । బౌర వరుల
సభకుఁ బిలిపించి శ్రీరామ । చంద్రు నాజ్ఞ
నెల్లర కెఱుగఁ జేయుచు । నుల్లమలర
న వ్విభీషణు రత్న సిం । హాసనమున.

గీ. శుభ ముహూర్తంబునందుఁ గూ । ర్చుండఁ బెట్టి
రాజ్య తిలకంబుఁ బెట్టించి । రావణుని కి
రీటమున్ శీర్షమునను సం । ప్రీతిఁ బెట్టి
శ్రీ విరాజిల్లఁ బట్టాభి । షిక్తుఁ జేసె.

గీ. ధ్వజములం బూని మంగళ । ధ్వను లొనర్చి
యసురు లెల్లరు నుత్సాహ । మతిశయింప
సంచరించిరి; శ్రీరామ । చంద్రుఁ డపుడు
వాయు పుత్రునిఁ బరికించి । పలికె నిట్లు.

కం. వినుము విభీషణుఁ డిప్పుడు
దనుజేశ్వరుఁ డయ్యె నతని । దర్శింపుము; యా
తని యనుమతిఁ గొని వనమున
జనకజఁ గని దెలుప వలయు । సమర జయంబున్.

మ. రణవృత్తాంత మెఱుంగఁజే సీసతికిన్; । రక్షోవిభుం గాంచి" రా
వణుఁ డన్యాయగతిన్ మెలంగి మడసెన్; । భావింపఁ గా నీవు స
ద్గుణవంతుండవు లోకులెల్లరును సం । తోషింపఁ గాంతా శిరో
మణి నర్పింపుము సత్వరంబ"యని ర । మ్మా జానకీదేవితో.

గీ. అనిన విని రాముభక్తుని । యానతిఁ గొని
వాయు పుత్త్రుండు శీఘ్రంబ । బయలు వెడలి
అసుర విభుఁ గాంచి శ్రీరాము । నాజ్ఞఁ దెలిపి
జనకజం గాంచి మ్రొక్కెఁ గాంచె । సమర సరణి.

మ. హనుమన్ వేయివిధంబులన్ బొగడి బ్ర । హ్మానందమున్ బొందుచున్
కనులన్ బాష్పకణంబులన్ విడుచుచున్ । క్ష్మాపుత్త్రి భాసిల్లె; "నో
జననీ! జానకిమమ్మఁబ్రోవుమనుచున్ । స్నానంబుఁ జేయించి నూ
తన వస్త్రాభరణోత్కరంబొసఁగియ । ద్దైత్యేంద్రుఁడత్యాదృతిన్

గీ. పుష్పక విమానమున దివ్య । పుష్పములను
ఫలముల నవర్ఘ్య నవరత్న । ములను పసుపుఁ
కుంకుమున్ కుంకుమము స్వర్ణ । కుంభములను
వెల్వగల వల్వలం బెట్టి । వినతుఁ డగుచు.

మ. అనిశంబున్ విమలాంతరంగమున నిన్ । ధ్యానించి పూజించి, ప్రా
ర్థనఁ గావించుచు నుందు నీకృపను మ । త్సంకల్ప మీడేఱు నం
చనుమానింపక యీవిమానమున ర । మ్మా పద్మ పద్మాలయా
జననీ క్షీరసముద్రరాజ తనయా । సద్భక్త భాగ్యోదయా.

ఉ. భర్గయువాణియుక్ శివ్రుడుం । దోయజగర్భుడు నీకటాక్షసం
సర్గముసంగదా సకల । సంపదలన్ దుల తూగు చుందు రో
భార్గవి నీమనోహరుని । భక్తుడ నన్ గురుణింపు మాశ్రిత
స్వర్గవి మా రమా విబుధ । వందిత! యిందిర! పద్మమందిరా

గీ. భక్తులకు నిత్యమును గల్ప । వల్లి వీవు
ధరణిఁ బుట్టిన దేవి మ । తల్లి వీవు
ధ్యానముం జేతు నన్నుఁ గన్న । తల్లి వనుచు
సన్నుతించెద నీవాది । శక్తి వనుచు.

ఉ. దానవులెల్ల నీకుఁ బరిఁ । తాపముఁ గూర్చిరి క్రూరచిత్తులై
మానవ రూపముం గొనిన । మంగళ దేవత వీవు నాదు స
న్మానము గొమ్ము పుష్పకవి । మానముపై దయసేయుమమ్మ న
వ్యానన సీమఁ గాంచ నమ్మ । తాంధపులెల్లరు నుల్లసిల్లగన్

చ. జనని సమస్త జీవులకు । జానకి సృష్టికి నాదిశక్తి యం
చనఘులు సన్మునీశ్వరు ల । హర్నిశమున్ వినుతించుచుందు ర
జ్జనక మహాక్షితిన్ జనక । శబ్దము సార్థక మయ్యెఁగా దె నిన్
బెనుచుటఁ జేసి దైత్యులవి । వేకులెఱుంగరు మానినీ మణీ

మ. హనుమ జ్జాంబవదంగదాది కపివ । ర్యశ్రేణి హర్షింపఁగన్
జననాథోత్తముఁ డైననీదు విభుఁడా । జ్ఞాపించె వే జానకిన్
గొనిరండంచు;విమానయానముననిన్ । గొంపోదు; శ్రీరామభ
ద్రుని వీక్షింపఁగవచ్చు శీఘ్రగతి; సం । తోషించు ముల్లోకముల్.

గీ. అనుచు వినుతించి మంగళ । ధ్వనులతోడ
పుష్పకారూఢ ధారుణీ । పుత్రితోడ
బయలు వెడలె దానవకుల । ప్రభు వరుండు;
అంబరమునుండి పుష్పవ । ర్షంబు గురిసె.

గీ. పుష్పక విమానమును డిగ్గి । భూతనూజ
సరసకేతెంచినన్ రామ । చంద్రుఁడపుడు
విముఖత నటించి నిలిచిన । వీరవరుల
నెల్లరం జూచి సతిఁజూచి । యిట్టులనియె.

"ఉ. వీటికిఁ గూల్చినాఁడ దను । జేశుని? జెప్పెద నాలకింపు డీ
బోటికిఁ గాదు; లోకులు ప్ర । మోదముఁ బొందగ లోకకంటకున్
హాటక గర్భుచే వరము । లంది మదించిన దుర్మదాంధునిన్
పోటరి మిన్నులన్ దునిమి । పొల్చిన రావణు సంహరించితిన్.

గీ. అని సతిన్ జూచి వైముఖ్య । మభినయించి
గడగడ వడంకి భీతితోఁ । గన్నులు నిలువ
కంటఁదడి బెట్టి దనుజు ల । క్కటిక మొంద
ఇన కుల వరుండు శ్రీరాముఁ । డిట్టులనియె.

"శా. ఏరూపంబున నుండ నిన్నుఁగొనెనై । దైత్యేశుఁ డ రణ్యంబునం
దారూపంబుననున్న నిన్ గొనను; మా । యామోహితాత్ముండనై
సారాసారవిచార హీనమతితో । సంసార వాంఛారతిన్
శ్రీరాముండు సతిన్ గ్రహించుననుచున్ । చింతించితే మానినీ

కం. అనుమానము మానవులకుఁ
బెనుభూతంబండ్రుదాని । విడువగవలయున్;
మనమునఁ గల యనుమానం
బనలమువలెఁ గాల్చు సంశ । యాత్మని సతమున్.

ఉ. లగ్నమునాడు నిన్ను గృహ । లక్ష్మిగఁ గొంటిని యగ్ని ముందు; ని
న్నగ్ని పరీక్షఁ జేసిన య । నంతరమేను పరిగ్రహింతు; ను
ద్విగ్నమనంబుతోడ వెను । దీయకుమా; యనుమానపంక ని
ర్మగ్నుఁడ మానవుండ నను । మానముఁ బాపుమ మానినీమణీ

కం. దనుజేశు నింట నుంటివొ
వనమున నుంటివొ? యెవండు । పరికించె నినున్;
అనల ప్రవేశముననే
అనుమానము తొలఁగు సంశ । యాత్ముల కలివా!

ఉ. పాపమొ పుణ్యమో వినుము । పల్కెదనాదు మనోవికారమే
పాపము గోడనుండ నియుఁ । గ్రూరుఁడు దైత్యుఁడు దొంగిలించెనా
రూపము రోత నాకతివ । రో యనలంబున వేల్చినన్ మన
స్తాపము దీఱు లోకులకు । సంశయ ముండదొ కించుకంతయేన్.

చం. అనవిని సంశయాత్ముఁడగు । ప్రాణవిభున్ బరికించి నవ్వుచున్
జనక తనూజ యిట్లనియె । సంశయ చిత్తుల నెల్లలోకులన్
దనుపఁగ శక్యమానె యల । ధాతకునైన భయంకరంబుగన్
అనలముఁ జొచ్చినన్ మఱియు । నద్భుతకార్యములెన్ని చేసినన్

సీ. దనుజ పతి సాక్షి, పంచ భూ । తములు సాక్షి
భాస్కరుండును సాక్షి దేవతా । ప్రతతిసాక్షి
అనిలజుఁడుసాక్షి సియుంత । రాత్మసాక్షి
సాక్షులున్నారు తీఱునే । సంశయంబు?

చం. భవనమునన్ వసించితినొ । ఫాలమునన్ కరమూఁది దిక్కులే
ని వనమునన్ వసించితినొ । నీవు కనుంగొనఁ బంపినట్టి య
ప్పవనసుతుండెఱుంగు; ననుఁ । బాయక బాధలఁ బెట్టినట్టి దా
నవసతు లున్న వారడిగి । నన్ గల దిక్కు మెఱుంగఁగుందువే.

ఉ. ఈవొకమానవుండవయి । యిభ్భువిఁ బుట్టినవాడ వయ్యు నా
భావము నీకొసంగి యన । వద్యగతిన్ భవదీయ పాద రా
జీవములన్ భజించి నివ । సించితి ఘోరవనంబునందు; నా
జీవిత మిట్లు వ్యర్థముగఁ । జేయఁదలంచితె జీవితేశ్వరా.

గీ. అతి భయంకర మృత్యు జి । హ్వలను బోలు
మంట లొక్కుమ్మడిన్ లేచి । మింటికెగయఁ
కాంతి వెదఁ జల్లు విస్ఫులిం । గముల తోడ
ధగ ధగద్భీక రాగ్ని హో । త్రము జ్వలించె.

గీ. ప్రాణనాథుని వలఁ గొని । భక్తితోడ
ననల మునకుఁ బ్రదక్షిణ । మాచరించి
చేతులన్ మోడ్చి సుస్థిర । చిత్తమునను
ననలమున్ గాంచి యిట్లనె । జనకపుత్రి.

"ఉ. నిత్యము సత్యమార్గమున । నేను మెలంగినదాన నేని యా
దిత్యకులావతంసుని మ । తిన్ రఘురాముని సంస్మరింతు నేన్
అత్యనుకంపఁ జూపి భవ । దగ్నికణంబులు పుష్పరాశిగాన్
శైత్యగుణంబు దాల్పుము య । సత్యవినాశన యో హుతాశనా.

చం. త్రికరణ శుద్ధిగాఁ బతి మ । తిన్ నిరతంబు స్మరింతు నేని, నే
నకలుష చిత్తనేని, నన్ను । గాంధసులున్ నరవానరాసుర
ప్రకరము నాదు శీలమతి । పావనమంచుఁ దలంతురేని నన్
సకరుణ నాదరింపుము య । సత్యవినాశన యో హుతాశనా.

చం. నగమున నున్న ఘోరవిపి । నంబుననున్నను వహ్నిఁ జొచ్చినన్
అగణిత సద్గుణాఢ్యులకు । హాని ఘటిల్ల దొకించుకంతయున్
జగముఁ గ్రహించుఁగాక యని । సత్యముఁ జూపగ నిన్నుఁ జొచ్చెదన్
ధగధగ మండుచున్ననిను । ధ్యానముఁ జేయుచు హవ్యవాహనా.

చం. ఘనతర సంపదన్ తృణము । గా నిరసించితి నేని, నాథుతో
వనమున సంచరించుటది । స్వర్గసమంబని యెంచియుంటి నేన్
మనమున వాక్కునన్ క్రియల । మామకనాథునతిక్రమింప నేన్
జనకుని భంగి నన్ గొనుమ । చల్లని చూపున హవ్యవాహనా.

గీ. సాధు పక్షమున వర్తించు । సాత్త్వికులకు
చందనముఁ బోలు నినుఁ జొచ్చి । కుందనంబుఁ
బోలు నెమ్మనిలో వత్తుఁ । బుసుమఁజలర
అఖిల భువనత్రయ పవిత్రి । యగ్నిహోత్రి.

గీ. అని నిశ్చల చిత్తయై । యవని పుత్రి
వీతిహోత్రుని వినుతించి । విభునిఁ దలఁచి
ధగ ధగద్భీకరాగ్ని హో । త్రంబుఁ జొచ్చెఁ
పొలఁతి పుట్టింటి కేగిన । పొలుపు దోప.

గీ. రావణుఁడు నాఁడు పూర్వమ । రణ్యమునను
తన స్వరూపంబు నగ్నిలో । దాచుకొనియె
ఆ స్వరూపంబుఁ గైకొన । నగ్నిఁ జొచ్చె
జనని మాయా స్వరూపిణి । జనక తనయ.

గీ. భూమి కంపించెఁ దారలు । భువిని డుల్లె
గాలి స్తంభించెఁ దివ్యాంశు । మాలి మాసె
అఖిల దిశలఁ హాహా రవం । బాక్రమించె
తరుణి తరళాగ్నిఁ జొచ్చిన । తరుణమునను.

చం. కలవర మొందె వానరని । కాయము, కాయము సంచలింపగా
అలజడిచే విభీషణుఁడు । హాయనెఁ, గన్నులు చెమ్మగిల్లఁగా
వెల వెలఁ బోయె రాఘవుఁడు । వేకువజామునఁ జంద్రికై వడిన్;
వలవల యేడ్చె లక్ష్మణుఁడు । వాయుతనూజుఁడు నిల్చె నవ్వుచున్.

గీ. అమర కిన్నర గంధర్వ । యక్షకోటి
యాకసమునుండి వీక్షించి । యభినుతింపఁ
బ్రజ్వరిల్లిన యగ్నిహో । త్రంబు నడుమ
కొమ్మ శోభిల్లెఁ బుత్తడి । బొమ్మపోల్కి.

గీ. స్వర్ణవార్తి సీత భూ । జాత లోక
మాత, నాగర్భమున్ జొచ్చె । మహితచరిత;
అబ్ధిబలె నేను ధన్యుండ । నైతి ననుచు
జాతవేదుండు శీతలుం । డై తనర్చె.

మ. చలికిన్ జంకక ప్రాణిహృన్మణుండు శుచియై । స్నానంబుఁ గావింపగా
జలమున్ జొచ్చిన భంగి జానకి జ్వల । జ్వాలా కరాళాగ్నిలో
నెలమిని జొచ్చె నిజస్వరూపము గొనెన్ । బృందారకుల్ చూచి పు
ష్పిలవానన్ గురిపించి రంత మొరసెన్ । వ్యోమంబునన్ దుందుభుల్

గీ. అగ్నిసంతప్త కనక మ । ట్లతిశయించి
తల్లియే తెంచె నగ్నిహో । త్రంబునుండి
కడలిలోనుండి హరిఁజూడ । వెడలివచ్చు
క్షీరసాగర కన్యక । చెలువు దోప.

గీ. దివ్యనాకృతిఁ గైకొని । వీతిహోత్రుఁ
డవని పుత్రిక వెంబడి । నరుగుదెంచి
రామభద్రుని భక్తిమైఁ । బ్రస్తుతించె
నభము ఘూర్ణిల్ల దేవదుం । దుభులు మ్రోఁగ.

“శా. ఆదిన్ క్షీరసముద్రుఁ డిందిరను నీ । కర్పించె ధన్యాత్ముఁడై
క్ష్మాదేవీసుత నీకొసంగె జనకు । క్ష్మాభర్త ప్రఖ్యాతి సం
పాదింపంగఁ దలంచి తెచ్చితిని రా । మా రత్నమున్ గొమ్ము నీ
పాదాబ్జంబుల నమ్మ నేఁగడిగెదన్ । భద్రాత్మకా రాఘవా.

గీ. అవధరింపుము శ్రీరామ । రఘువిరామ
ఇప్పుడీ జగన్మాత వ । హ్నిప్రభూత
జలధి సంభూతగాదు క్ష్మా । జాతగాదు
మెఱుఁగువ వహించి వర్తింప । వలయు నీవు.

గీ. అన్యులేమను కొనువారొ । యనితలంచి
మగఁడు మగువను శోధింపఁ । దగునె చెప్పుము
క్ష్మాతనూజాత వహ్ని ప్ర । భూతయగుట
శాంతము వహింపఁజాలదు । సచ్చరిత్ర.

చ. అనలపరీక్షకున్ సిలిచి । నట్టి పతివ్రత యీపె నెట్టు లే
ల్కొ నవలెనో మెఱుంగుము; ఖ। లుం డెవఁడో మతిమాలి మూఢుఁడై
అనుచితమాడఁగాక యప । హాసముఁ జేయుచు; మాటిమాటికిన్
వనితఁ బరీక్ష సేయుటది । భర్తకు భావ్యముగాదు రాఘవా.

ఉ, హాటక గర్భుచే వరము । బొంది యుదించిన నైరృతుల్ప నీ
నాటకమాడితీవు లల । నామణి యున్నెడ; నాట కాంతయుం
దేటికి నీ పరీక్ష ఘటి । యించితొ? రోపివి నీవ యోజగ
న్నాటకసూత్రధార రఘు । నందన యాశ్రిత బృందచందనా.

గీ. అనుచు వచియించి శ్రీరాము । నభినుతించి
వెలఁది నర్పించి వెడలె న । వ్విప్రవరుఁడు
అవని సుతఁ జూచి యెల్లరు । నాలకింప
నిన కులుఁడు సోదరుని గాంచి । యిట్టులనియె

"మ. అనిశంబున్ ప్రజమెచ్చగా నపయశో । యద్యస్తికిం మృత్యునా
యని భావించుచు రాజదంపతులు లో । కారాధ్యులై లోక పా
వనమార్గంబున సంచరింపవలె; లో । పంబున్న భూపాలునిన్
గని లోకంబు తృణీకరించు నిది ని । క్కంబంచు నూహింపరో.

చ. పరపతితో లతాంగియును । పైసతితోఁ బురుషుండు స్వేచ్ఛగా
దిరిగిన లోకధర్మము గ । తిన్ దలపోయిడి యెట్టులుండునో
పరగృహవాసమున్న యొక । భామినివృత్త మెఱుంగకుండ నే
పురుషుఁడు సమ్మతించినను । పొల్లుక భర్త నతిక్రమింపదే.

ఉ. నాతిపరాభిమానమునఁ గన్యను న్యాయ్యముఁ జేకొ-నియగ్నిసాక్షిగా
నాతిఁ బరిగ్రహించుఁ గద నాథుఁడు; నాథునిచిత్తవృత్తికిన్
నీతికి దూరమై మెలఁగు నే సతి? భర్తయు జారుఁ దక్క యా
రీతిని సంచరించినఁ ధరిత్రిఁ గులంబులు సంకరంబు లౌ.

గీ. సతులఁ బురుషుల స్వైరంబు సమ్మతించు
మార్గమును బ్రజాతి రాజదం పతులయందు
పావనత లేకయుండిన సేవగించు
నవిన నంగీకరించు నా యార్యజాతి.

చం. జనకతనూజ యెట్టిగుణ సంపదఁ గల్గినదో యెఱుంగుదున్
మనమున సీతఁ గూర్చి యను మానముఁ బొందితి నంచు నెంచితే
జనము గ్రహించునే జనక జాత పవిత్రచరిత్ర యంచు? ని
ప్పనల పరీక్షఁ జేసితి య థార్థము లోక మెఱుంగ లక్ష్మణా.

గీ. పరపురుష దోషములఁ గల తరుణి శోభ
సింహపీఠి వసించినఁ జెల్లదు మఱి
సింహపీఠిక నే నధిష్ఠింపకున్న
భరతుఁ డంగీకరించునే వహింపఁ బడఁడె?.

గీ. అవనిపుత్రిక సుచరిత్ర యైన నేమి?
ఉవిద లెల్లరు సీతలే యుర్వియందు;
పరగృహంబునఁ గొన్నాళ్ళు తరుణి మెలఁగి
వచ్చిన విధంబు సైరింప వలెనె చెపుమ.

గీ. అగ్నిముఖమున శుచియయ్యె నవనిపుత్రి
అపయశముఁ బాసె నిఁక సంది యంబు లేదు
జనము జనకజన్ జననిగ సమ్మతించుఁ;
తరుణులకు నెల్ల సీత యా దర్శ మయ్యె.

గీ. రాజకాంతతుల్ సమస్త | త్రింబుఁగలిగి
ప్రజకు నాదర్శముగనుండ | వలయునందు
ప్రజను రక్షింప నలసిన | ప్రభువరుండు
నిష్కళంక చరితుఁడైన | నెగడవలయు.

ఉ. క్షత్రియశిరోమణిని | యేను గ్రహింపితి నిప్పుడంచు భూ
జాతఁబరిగ్రహించె రఘు | సత్తముఁ డంతట సర్వదేవతా
వ్రాతముతోడ నచ్చటికి | వచ్చె సురేంద్రుఁడు సన్నుతింప న
బ్జాత భవుండు వచ్చెముని | సంఘముతోఁ బటువేదఘోషతో.

గీ. సీతతోఁ లక్ష్మణునితోడఁ | జెలువు మీఱు
సద్యశస్సాంద్ర శ్రీరామ | చంద్రుఁ జూచి
స్వార్థ పరులయి తమ పర | మార్థమునకు
అమరు లెల్లరు వినుతించి | రవిపుత్రి.

గీ. రవి కులాన్వయ సంభూత | రత్నదీప
అప్రతి హత ప్రతాప లో | కైక భూప
అఖిలగుణధామ! రఘురామ! | యఘ విరామ
ఆశ్రితావనకామ! లో | కాభిరామ.

గీ. కఠిన చిత్తుండఖిల లోక | కంటకుండు
రావణుఁడు కాముకుండు దు | ర్మార్గచరుఁడు
పాపమార్జించి తనకుఁదా | ధ్వంసమయ్యె
దీన జన బంధు ముని నుత | జ్ఞానసింధు.

గీ. ఈ విశాల విశ్వంబు నం | దెల్లయెడల
ననిశమున్ తేజరిల్లెడు | నచ్యుతుఁడవు
నిర్వికారుండ వూహింప | నిర్గుణుఁడవు
శాశ్వత వినాశ! యూశ! వి | శ్వప్రకాశ.

సీ. ఆద్యంతశూన్యుండ । వవినాశనుండవు
కర్తవు భర్తవు । హర్తవీవ
సత్యంబునకు హాని । సంభవించిన యప్పు
డాకృతిం గైకొని । యవతరించి
దుష్టశిక్షణమును । శిష్టరక్షణమును
గావింతు వఖిల యు । గంబులందు;
మత్స్య కూర్మ వరాహ । మానవరూపంబు
లొందిన యద్వితీ । యుండవీవు

గీ. అసురుల వధించి [illegible] । బలుల ఖలుల
మదమణంపంగ నెట్టి జ । న్మమునకైన
సిద్ధమగుదువు లోకైక । సిద్ధపురుష
నీదు మహిమంబ మోఘంబు । నిరుపమాన."

కం. అమరులు వినుతింపంగ విని
అమరేంద్రుండాదమఱచి । యావేశమునన్
"కమలాప్త వంశభూషణ
కమలాక్ష కమలనాభ । కమలానాథా!"

గీ. అనుచు నయనంబులను మోడ్చి । యభినుతించి
కరకమలముల మోడ్చి కిం । కరుఁడ నన్నుఁ
గరుణఁ గనుమంచు శ్రీరామ । చరణ కమల
ములకుఁ బ్రణతుండై భక్తిమై । మ్రొక్కి నిల్చె.

గీ. "మునులు త్రిగుణాత్మకుని నిన్నుఁ । బొగడుచుండ
హృదయమున సంశయించితి । నించుకంత;
రావణుని సంహరింపంగ । రామభద్ర
విశ్వసించితి నీవాది । విష్ణు వనుచు.

చం. జయ జయ పద్మనేత్ర, రిపు । సంచయకానన వీతిహోత్ర, దు
ర్జయ సురవైరి భంజన ని । రంజన సన్ముని లోకరంజనా
జయజయ రామభద్ర సుర । సన్నుతసంగర రంగరుద్ర నీ
జయము నుతించు భక్తజన । జన్మము సార్థకమంచు నెంచెదన్.

ఉ. తూణము దాల్చి ఖడ్గయుగ । హస్తుల దోర్బలులం గూల్పు గాధను
ర్బాణములన్ ధరించి నర । పాలక బాలకమూర్తివై జగ
త్త్రాణపరాయణుండవయి । ధర్మము నిల్పితి వీవు లోక క
ల్యాణగుణాఢ్య రామ పర । మాత్మ! గ్రహింపుము మన్నమస్కృతుల్.

ఉ. భీకర మత్స్యమూర్తివయి । వేధకు వేదము లిచ్చినాడ వో
సూకర రూపముంగొని వ । సుంధరఁ బ్రోచితొ యేమిచేసితో
లోకులు సన్నుతింపఁగ త్రి । లోక రమాధిపనీ పదాపగా
శీకర సంచయంబు విన । శింపఁగఁ జేయును తాపవహ్నులన్.

ఉ. రాముని పాదపద్మమక । రందఝురిన్ సిరిఁబోడఁ బుట్టు వా
సోమునితో సమానముగ । శూలి శిరంబునఁ దాల్చెనంచు నా
నాముని సంఘమే విమల । నాముని సంస్మరియించు నా పరం
ధాముని నిన్ నుతించి నిర । తంబు భజించెద నాత్మశుద్ధికిన్.

ఉ. మాన్యుఁడనే నయంచు నభి । మానవశంబున నెంచి నీ వసా
మాన్యుఁడవం చెఱింగియభి । మానము సర్వముఁ బాపుకొంటి; దా
ర్జన్య విధానముంగొని ప్ర । జా పరిపాలకులైన దుష్ట రా
జన్యుల సంహరించుటకు । జన్మముఁ గైకొనుచుందు విభ్యువిన్.

గీ. నిగమ సముదాయ మవ్యక్త । ముగరహించు
నిర్గుణబ్రహ్మ మని యెంచి । నిన్నుఁ బొగడు;
సగుణ రూపంబున రహించు । సుగుణ వంతు
నిన్ను ధ్యానింతు నిరతంబు । నీరజాక్ష.

కం. శరణాగతు శుద్ధాంతః
కరణంబునఁ బ్రోతువీవు । కరుణాకర నీ
చరణాబ్జసేవ భువి సం
సరణాంబుధి నావ భక్త । సంకట హరణా.

ఉ. పావన హాసముం గొలిచి । మాధవ! నీచరణప్రభాత గం
గావని పొదలన్ గడిం । కంటుఁగా గ్రొక్కొని యెల్లవేళలన్
స్నానమొనర్చి నీ యతుల । నామ సుధారస మాని నిశ్చల
ధ్యానరతిన్ మునీన్ద్రనికుడ । తంబుస్స్వర్గంబునుండు భార్యతో.

గీ. అనుచు వినుతించి ధ్యానించి । యమర విభుఁడు
అమృత వర్షంబు గురిపించి । యాత్మగంబ
విగత జీవుల వానర । వీర వరుల
నెలమి బ్రతికించి యరిగెం । దిన కులేంద్ర.

గీ. ఇన కులుండిట్లు సీఁ గాంచి । యిట్టులనియె
నాకొఱకు యుద్ధమునను బ్రా । ణముల విడిచి
నట్టి యాప్తుల బ్రతికించి । తమృతమునను;
నీకు నేను కృతజ్ఞుండ । నిర్జరేంద్ర.

చం. అనిన విరించనుండు దర । హాసముఁ జేయుచు రాముఁ జూచి యి
ట్లనెఁ బరమాత్మ మానవుని । యట్లు వచించెద వీవెవండవో
సనకసనందనాదిముని । సంఘమెఱుంగు శివుండెఱుంగు నీ
, తనయుఁడ నేనెఱుంగుదును । తక్కిన వార లెఱుఁగ నేర్తురే.

## —దండకము—

శ్రీరామ, మార్తాండవంశాబ్ధిసోమా, గుణగ్రామ సంగ్రామ భీమా, పరంధామనామా నమద్భీమ సుత్రామ సర్వామరస్తోమ, నిష్కామ, శ్రీకంఠ సంసేవితాకుంఠ వైకుంఠ లీలా జగత్కల్పనాకల్ప

సంకల్ప శేషాహి పర్యంక, నిశ్శంక క్షేమంకరా శత్రునాశంకరా, సర్వ సర్వంసహా నాయకా శాశ్వతానంద సంధాయకా శిష్టులన్ జూచి రక్షింప దక్షుండవై, దుష్టులంజూచి శిక్షింపఁ దీక్షుండవై సృష్టికిని కర్తవై భర్తవై హర్తవై, యార్తులన్ బ్రోవఁగా ధూర్తులన్ జంపగాఁ జిత్రచైతన్యకళ్యాణమూర్తి సదావేదమార్గానువర్తీ, భవద్దివ్యపాదాబ్జ సంసేవ సంసార వారాశికిన్ నావ, మోక్షంబు సాధింపఁగాఁ దోవ దేవా మహాభావ, నీభావమున్ తత్త్వమున్ లోన నూహింప మోహింపగాఁ జేయు; క్షుద్రుండవో శేష రుద్రుండవో వీరభద్రుండవో రామభద్రుండవో ధీసముద్రుండవో నీకు ప్రఖ్యాతి నీ సత్కీర్తి నేరీతి వర్ణింప శక్తుండ? నే నీ చరిత్రంబు రక్తుండ నీపాద భక్తుండ; విజ్ఞానపాథోధి మధ్యస్థ వేదాంతసౌధాగ్ర భాగంబునన్ మోక్షలక్ష్మీ పరిష్వంగ సౌఖ్యంబు ముఖ్యంబుగా నెంచి వాంఛించి యశ్రాంతమున్ నిన్ను ప్రార్థించు ప్రజ్ఞానిధుల్ ప్రాజ్ఞులో యజ్ఞులో మోహసందేహ గాఢాంధ కారాంధు లేనాటి కేన్ నిర్ణయింపంగ శక్యంబె? నీదివ్య మాయామహాబ్ధిన్ తరింపంగ శక్యంబె యెవ్వారికేన్ వారిజాతాక్ష దేవారి లోకంబు లోకంబునన్ గానరాకుండ ఖండింప దండింపగా దక్షుఁడెవ్వండు? నానామునిస్తోమ సంస్తుత్య మానాదరానూన మీనాకృతిన్ దాల్పవో వేద మర్యాదఁ గాపాడవో యెల్లరుం గాంచి వాంఛింప వంచింపవో దివ్యశృంగారశోభా కళావాహినీమోహినీ రూపముంజూపవో రామ సత్సార్వభౌమా కళాధామ! యీ ధారణీదేవి కాధార మే నంచు ధర్మావనోద్ధార భూదార రూపంబు నుంబొందవో దివ్యపాదారవిందద్వయా యద్వయానందగోవింద! ప్రహ్లాదు నాహ్లాదుఁ గావింపవే దైత్య రాట్సింహ సంహార రంహా,నృసింహా నృసింహాస్తుతాకార! ఓనిర్వికారా!సురల్ చూచివర్ణింపఁగా వర్ణివై యేగి వైరోచనుంజూచి యాచించి పాదత్రయిన్ సర్వలోకత్రయిన్ నిండి వ్యాపించి చూపింపవే విక్రమంబెల్ల నిర్వక్రదోర్విక్రమా విక్రమా! యద్భు తాశ్చర్య కార్య క్రమా బ్రహ్మచర్యప్రభావంబుఁ జూపింపఁగా బ్రహ్మవర్చుస్సుదీపింపగా బ్రాహ్మణద్వేష భూపాలలోకంబు

కంపింపఁగా శత్రురాష్ట్రస్థరున్ శాస్త్రవిద్యాజ్ఞరున్ గాంచి గర్జించి
తర్జించి శాంతంబు వర్జించి భర్జించి యార్జింపవే సర్వభూచక్రమున్
చక్రధారీ మురారీ సురారీశ వంశాటవీ ఝూటవైశ్వానరా, వానరానీక
సేనాసమానుండవై మానవుంబోలి మానావమానంబులంగోరి
సైరించి, కాంతార సంచారివై, యన్యకాంతా రతిన్ సాధుహింసా
రతిన్ జీవులన్ గోవులన్ ధారుణీ దేవులంబట్టి బాధించు పాపాత్మునిన్
కామ మోహాద్యహంకార కుస్వాంతునిన్ దుర్గుణాక్రాంతునిన్ మాం
సభుక్కాంతునిన్ ఘోర కల్పాంత వేళా మహాభీల కాలాభ్ర గర్జాను
కూలోగ్రసంగ్రామ ఢక్కా ఢణం ఢాణ ఢాణా ధణారావ భీతాన్య భూ
కాంతకాంతామణీ గర్భవిశ్రావణున్ లోకవిద్రావణున్ రావణున్
గూల్చి, లోకైక కోదండపాండిత్యమున్ జూపితే రాజ వేదండ; సం
సారదారిద్ర్య భారాపనోదా మహామేయ మాయావినోదా, జగత్ఖే
దమున్ బాపుమోంకార నాదప్రమోదా జగత్పావనా భక్తలోకా
వనా నీవు సోముండవై యోషధీశుండవై యోషధిస్తోమమున్
బెంచి పోషించుచున్నావు; తీవ్రాంశుధాముండ వీవే జగద్భాసక
ఖ్యాతి భాసిల్లుచున్నావు; కాముండవై జీవసంతాన సంధానముం జేసి
యుత్పత్తికిన్ హేతుభూతుండవై భూత ధాత్రిన్ బ్రమోదించు
చున్నావు; రాముండవై సర్వజీవంబు లాదాత్మవై విష్ణు విఖ్యాతి
వ్యాపించుచున్నావ సాధ్యుండ వీవంచు వేదాంతి వేద్యుండ వీవంచు
నాద్యుండ వీవంచు భావింతు జీవంబులన్ భిన్నరూపంబులన్ భిన్న
భావంబులన్ దోచి భాసిల్లు లోకైక శోభస్కరా చిత్కళా భాస్క
రా, మానివ్యాప్తస్వరానాసమ స్వారముంగొమ్ము—నిత్యుండవో భక్త
భృత్యుండవో శిక్షితాశేష దైత్యుండవో సత్యమార్గంబునందక్షర
బ్రహ్మ రూపంబుతో సృష్టికిన్ మున్ను భాసిల్లు దీపంబ వీవంచు
భావించి సేవించి ప్రార్థించు చున్నాఁడ; నెవ్వండవో నిక్కమూ
హించి భాషింప శక్యంబు గాదెల్ల వేదంబులున్ నీవ, వాదంబులున్
నీవ, శాస్త్రంబులున్ నీవ శస్త్రంబులున్ నీవ, యస్త్రంబులున్ నీవ
తంత్రంబులున్ నీవ యంత్రంబులున్ నీవ మంత్రంబులున్ నీవ

సర్వస్వతంత్రుండవున్ నీవ యజ్ఞంబులున్ నీవ యాగంబులున్ నీవ
సర్వాగ్నులున్ నీవ స్వాహా వషట్కారముల్ నీవ, జ్యోతిస్స్వస్తికైల
నారాశికాంతార సంతాన సంయుక్త సర్వంసహాచక్రసంహారివిన్
నీవ; దేవా యెవం "దాత్మ వశ్యస్య భూతాని" యన్ భావముంగ్ర
వర్ణించి నీనామమున్ నిన్నుఁ గీర్తించి నుతించు వాఁడే వరేణ్యుండు
పుణ్యుండు లోకాగ్రగణ్యుండు అవిద్యాంధకారాంధులై బ్రహ్మవిద్యా
ప్రభావంబు భావింపఁగా లేక యాశా పిశాచ ప్రభావంబునన్
కూటకై బోటికై హీనులై దీనులై నీచ విద్యాసముల్లాసులై వృత్తి
ధర్మంబు యంచెంచి వంచించి నీతిన్ విసర్జించి విత్తంబు నార్జించి
హింసించి మాంసంబు భక్షించుచున్ మద్యమున్ గ్రోలుచున్
సోలుచున్ భోగసంపూర్ణులై రోగసంకీర్ణులై యాధికిన్ వ్యాధికిన్
సుక్షేత్ర వర్ణాశ్రమాచారధర్మంబులన్ మాని లోకుల్ దురాచారులై
చోరులై జారులై క్రూరులై యన్యధర్మానుకూలాత్ములై తుచ్ఛులై
మ్లేచ్ఛులై వాచనోద్దండులై పాప భూయిష్ఠ పాషండులై మందులై దేశ
మున్ నాశముం జేయు దుర్మార్గులై దుర్గుణాధీన చేతస్కులై యుండ స
న్మార్గముం జూపి తత్త్వంబు బోధించి వాదిం సాధించి స్వాధీనులం జేసి
సంప్రీతితో నుద్ధరింపంగ నేవేళ సిద్ధంబు గానుండు వెందెందు వీక్షింప
నందందుఁ గన్పట్టుఁబో యేక మేవా ద్వితీయంబునాఁ గ్రాలు నీదివ్య
తేజంబు భూదేవికిన్ దీప రాజంబు భక్తాళికిన్ కల్పభూజంబు నీమంద
హాసంబు సుశ్రీనివాసంబు; నక్షత్రముల్ నీకు నేత్రంబులై యుండ
నీకన్నులం గప్పి కార్యంబు లంజేయ నెవ్వానికేన్ శక్యమే? బూట
కంబీ జగన్నాటకం బాడుచున్నావు విభ్రాంతిఁ గల్పించి నీచిత్త
సంకల్పమారా యనల్పంబు, నాశక్తి యత్యల్ప మేరీతి వర్ణింపఁగా
నేర్తు? నారాయణీస్తోత్ర పాత్రైకరామావతారంబు వీక్షించి మోక్షం
బుఁగాంక్షించి ధన్యుండనైతిన్ పరంధామ శ్రీరామ భూపా! పవిత్ర
స్వరూపా మహాపాపవల్లీలవిత్రా స్ఫురన్నీలగాత్రా సితాంభోజ
నేత్రా త్రిలోకైక జైత్రా నమద్రాజచూడామణీ రాజచూడామణీ
యార్తరక్షామణీ భక్తచింతామణీ దేవతాగ్రామణీ సద్గుణీ నిర్గుణీ

భక్తసంత్రాణ పారీణ నారాయణా నిత్యకళ్యాణ! దుర్వార గర్వాతిరేకాసురానీక సంహారక కాకోదరా! సర్వ లోకోదరా! శాంభవీ సోదరా దేవ దామోదరా శ్రీధరా యాదరింపంగదే భక్తమందార! వందారు బృందారకస్తోమ,విజ్ఞానకందా! ముకుందా చిదానంద సామ్రాజ్య సింహాసనాసీన తేజో నిధానా పరేశా నరేశా నిరాశా పరిభూత శాశ్వతైశ్వర్య పట్టాభిరామా! రమానాథ! రామా! నమస్తే నమస్తే నమః

సీ. నినుఁగన్న వ్యామోహ । మునఁదల్లిదండ్రులు
నందనుండనుచు నా । నందమొంద
అనురాగ వశమున । ననుజులు సేవించి
యగ్రజుండనుచు ని । న్ననుసరింప
మానవ శ్రేష్ఠుండొ । మానవాతీతుండొ
యని మానవులు నిన్ను । నభి నుతింప
అఖిల బాంధవకోటి । కత్యాప్తుఁడీ తఁడంచు
బంధు వర్గంబు నిన్ । బరిస్తుతింప.

గీ. ఎల్ల భంగుల నెల్లరి । యుల్లములను
మెలఁగు నీవెవ్వఁడవొ నాకుఁ । దెలియకున్న
మేదకుని లీల మెలఁగి భ్ర । మింపఁజేయుఁ
దలఁపకుము రామ శుద్ధచై । తన్యధామ.

గీ. ప్రాజ్ఞుఁడవొ మూఢుఁడవొ నీ స్వ । భావసరణి
నెఱుంగుము నేమియు । నెఱుఁగనట్టి
బాలకుని లీల మెలఁగి వి । భ్రాంతిఁ గొలుపఁ
దలఁపకుమ రామ శుద్ధచై । తన్యధామ.

కం. దశరథుఁడు పుత్త్రుఁడనుచున్
దశకంఠుఁడు శత్రుఁడనుచుఁ । దనువులు విడువన్
విశదముగ మెలఁగి శాశ్వత
యశమొందితి వవనియందు । నసదృశ చరితా!.

మ. పరిపూర్ణుండవు దోషహీనుఁడవు స । ర్వవ్యాపివై యుందువో
పరమాత్మా వివిధ స్వరూపములతో । భాసిల్లి రూపారూపముల్
చరియింపంగ నొసర్చువాఁడవు పరే । శా సర్వభూతాంత రా
త్మ రమానాయక రామచంద్ర గుణసాం । ద్రా విశ్వసంరక్షకా"

గీ, అజుఁడు (శ్రీ) రాము నిరీతి । నభినుతించి
నిశ్చలధ్యాన నిరతిని । నిలిచియుండ;
దశరథుఁడు చూచి రాముండు । తనయుఁడనెడి
భావముం దక్కి మోక్షంబుఁ । బడసె నపుడు

గీ. ఇఁతదనుకను దశరథ । నృపవరుండు
రాముమహిమంబుఁ దెలియక । బ్రహ్మమనుచు
నెఱుఁగఁజాలక మోక్షంబు । నెనయలేక
అద్రిజా యిప్పు డుద్బోధి । తాత్ముఁడయ్యె

గీ. ఎప్పుఁడుద్బోధి తాత్ముఁడై । యెఱుకఁగలిగి
భక్తి వైరాగ్య భావాను । రక్తితోడ
రాము ధ్యానించునో పర । బ్రహ్మమనుచు
అపుడు మోక్షంబు. బడయు వాఁ । డ ప్లుఁడగును.

"ఉ. నీదయ యున్నఁజాలునని । నిత్యము నీల గళుండు నిన్నుఁబ్ర
హ్లాదుని భంగి నెమ్మదిఁ ద । లంచి నుతించి తపించు; సర్వలో
కాదరమూర్తి వీవు; । భవ । దద్భుత దివ్యకథా సుధా రసా
స్వాదన మెట్టులబ్బు? భవ । పాప విమోచన పద్మలోచనా.

సీ. వ్యామోహ జలధర । వ్రాతంబు విదళింపఁ
బవనంబు నీ పదా । బ్జద్వయంబు
నిగమాంబునిధి సంజ । నిత మోక్ష లక్ష్మికి
భవనంబు నీ పదా । బ్జద్వయంబు

ఘనతర సందిగ్ధ । వని దగ్ధమొనరింప
జ్వలనంబు నీ పదా । బ్జద్వయంబు
కామాది దుర్గుణ । ఖలుషిత జగతికిఁ
బ్రీయంబు నీపదా । బ్జద్వయంబు.

గీ. భూరి సంసార సాగర । మును మథించి
అమృతమును గ్రహింపఁగ మంథ । రాచలంబు
సకల జనులకు నీ పదా । బ్జద్వయంబు.
అషయ నిషంగ మంగళ । శ్యామలాంగ.

చం. అనివినుతించి మ్రొక్కి దర । హాసము మోములఁ జెంగలింప న
వ్వనరుహసంభవుండు ముని । వర్యులతోఁ బటు వేదఘోషతోఁ
జనిన యనంతరంబ సుర । సంతతితోడ నమస్కరించి తా
ననుమతిఁ బొంది యేగె నమ । రాధిపుఁడున్ నిజరాజధానికిన్.

ఉ. అంత విభీషణుండు, కపు । లందఱు మేలని సంతసింప వా
క్కాంతుని వైఖరిన్ బొగడి । కన్నులమోడ్చి స్మరించి రామ నా
స్వాంతమునన్ వసింపు మని । శంభుఁ దరించెద నంచు జానకీ
కాంతునిఁ గాంచి తచ్చరణ । కంజములం బడి మ్రొక్కి యిట్లనున్.

గీ." అసుర వరుతోడఁ బోరాడి । యలసి సొలసి
వెంటనే రాజధానికి । వెడల వలెనె?
భరతుఁడున్నాఁడు గద రాజ్య । భారమునకు;
రమ్ము నాపూజలం గొమ్ము । రామచంద్ర.

గీ. అనుజ వరునితో సీతతో । నరుగు దెంచి
నా సపర్యలఁ గైకొమ్ము । నరవరేణ్య!
రాజశేఖర పూజిత । రాఘవునకుఁ
గాపురంబగుఁ గాక లం । కాపురంబు.

గీ. అసుర సామ్రాజ్య రత్నసిం । హాసనమున
నీవు రాజిల్లినం జాలు । నీరజాక్ష!
తాపము లణంచు నీనామ । రూపములను
అనిశము స్మరింపం బూజింప । నగును నాకు.

గీ. పుష్పక విమానముం గొమ్ము । పురుషసింహ!
రమ్ము నా పురమ్మునకు వి । శ్రాంతిం గొమ్ము
అనిన సుందర దరహాస । మంకురింప
దనుజ పతిం జూచి యిట్లనె । నిన కులుండు.

"చం. అలఘు చరిత్ర! నీవొసంగు । నట్టి సపర్యలం గొంటి, లిప్తమేన్
నిలువంగరాదు పోవలయు । నిర్ణయవేళకు; నిశ్చలుండు ని
స్తులుండు దృఢవ్రతుండు భర । తుండు సహింపండు వేళ దప్పినన్
దలంపక వహ్నిలోం బడును । ధ్వంసముగున్ రవివంశ మిప్పుడిన్.

గీ. అఖిల కష్టంబుల సహించి । యాహవమున
నాకుం దోడ్పడి నట్టి వా । నరుల నీవు
తనియం జేసినం జాలు నన్ । దనిపినట్లు
సంతసించెద దానవ । త్రాత లేంద్రి.

చం. ఫలములం దెత్తువో మధుర । భక్ష్యములన్ దనివోవనిత్తువో
వలువల, విల్వయింతయని । వా కొనరాని యనర్ఘరత్నరా
శులం గొనుండంచొసంగెదవొ । చూచెద నేం గనుదోయి విందుగా
నలరెద నే మొసంగెదవొ । యాశ్రితకోటికి దానవేశ్వరా.

గీ. అనిన విని హస్తముల మోడ్చి । దనుజ విభుండు
ఇన కులునిం జూచి నమ్రుండు । నిట్టులనియె;
"నీవు కోరిన దొనరింతు । నీ మనంబు
ఆశ్రితావన కామ లో । కాభిరామ.

చం. ఫలములం దిచ్చెదన్ మధుర । భక్ష్యములన్ దనివోవ నిచ్చెదన్
వలువలు విల్వ యింత యని । వాకొన రాని యనర్ఘరత్నరా
శులు గురిపించెదన్ వినుము । చోద్యముగా వడ గండ్లరీతి; నీ
వలసిన నే మొసంగుటకు । నైనను జూకము నే రఘూద్వహా.

గీ. అంబరమునుండి యీ కాంబ । రంబుమీఁద
అంబరంబుల స్వర్ణ ర । త్నాభరణము
లఖిల వానర వితతికి । హర్ష మొదవఁ
గురిపింపించెద శ్యామల । కోమలాంగ.

గీ. అనఘ శ్రీరామ నీయాజ్ఞ । నాదలఁగొని
ఎట్టిపనికైన వెనుదీయ । నిది ధ్రువంబు;
ఒక్క త్రుటిలోన సర్వంబుఁ । జక్కఁజేతు
నని విభీషణుఁ డసురుల । కానతిచ్చె.

"చం మధుర పదార్థకోటి నన । మాన ఫలంబులఁ బుష్పరాశులన్
మధురస భాండకోటిని వి । మానముపై నదే బంపు డాపయిన్
రథముల తోడఁ దెండు బహు । రత్నమయాభరణాదులన్ మనో
రథములు దీరెనంచు రఘు । రామునితోఁ గపు లుల్ల సిల్లగన్.

ఉ. ఇప్పుడ సర్వవస్తుచయ । మెల్లవిధంబుల సంగ్రహింపఁగా
నొప్పనుమీకు మార్పలుక । నోపరు పౌరులు; నాదు నానతిన్
దప్పిన రాము నానతిని । దప్పిన యట్ల వినుండు నేర్పుమైఁ
జెప్పిన యట్లొనర్చు యతి । శీఘ్రగతిన్ చనుదెందు పొండిఁకన్.

చం. అనవిని దానవోత్తముని । యానతి నాదలఁ దాల్చి రామ భ
ద్రునకు నమస్కరించి యని । రుద్ధగతిన్ పురి కేగి, సర్వ వ
స్తునిచయమున్ గ్రహించిదను । జుల్ చనుదెంచి యొసంగినంత నే
కనుఁగొని సంతసించి రఘు । కాంతుఁడు మెచ్చుకొనెన్ విభీషణున్.

"చం. వినుము విభీషణా దనుజ । వీరులు పౌరులు సన్నుతించు వ
స్త్రసముఁ గట్టినాఁడవిది । తథ్యము గానియెడన్ క్షణంబులో
దనుజులు సర్వవస్తుసము । దాయముఁ దెచ్చి యొసంగువారె? నా
మనమునఁ బుట్టినట్టి యది । మానవు నన్ విడనాడె నేటికిన్."

చం. క్షితిపతిఁ జేసితిన్ దనుజ । శేఖరు తమ్ముని మిత్రరత్న మం
డితుఁడు ప్రజానురాగియగు । నే యని యించుక యంత సంశయిం
చితి; ననుకూల భావముఁ । జేకురు జీవులకెల్ల సౌఖ్యముల్
హితమతి నీవు రాజ్యమును । నేలఁగఁ జాలెదు సంతసించితిన్.

గీ. అనిన విని విభీషణు డిట్టు । లనియె నఘ
నీదు సంకల్ప మూహింప । నిరుపమాన
మనుకొనినయట్ల కార్యంబు । లగును గాక
నీదు కార్యం బమోఘమై । నెగడుఁ గాక.

ఉ. శ్రీదయితా యదార్థము వ । చించెద నీపదసేవకుండు లో
కాదర వర్తనంబుఁ గల । యట్టి ఘనుండగు నెల్లవేళలన్
నీదయ యున్నఁ జాలు రజ । నీచరులెల్లరు నాకు భృత్యులై
కాదనకుండఁ జేయుదురు । కార్యములన్ కనుఱెప్పపాటునన్.

గీ. అని విభీషణుఁ డెల్లర । నాదరించి
ఆసవ మొసంగి మధుర భ । క్ష్యములఁ బెట్టి
వివిధ ఫలముల నిచ్చి సం । ప్రీతితోడ
పుష్పకంబెక్కె యంబర । మునకు నెగసి.

గీ. "వివిధ వస్త్రాద్యలంకార । వితతిఁ గొనుఁడు
గైకొనుఁడు రత్నరాశులఁ । గాంతుఁడీతఁ"
అనుచు వర్షించి యెల్లరఁ । దనియఁ జేసెఁ;
జూచి హర్షించి రినకుల । శూరవరులు;

చం. సకలచరాచరంబులకు । శాశ్వత సౌఖ్యవిధాయకుండు ధా
త్రికుల విభూష ణుండు తన । తమ్మునితో జగదేకమాతతో
సకసకనవ్వ్యమున్ నిలిచె । వానరకోటి యొనర్చు నట్టి వే
షకలు వికారచేష్టలుఁ గ । నుంగనుఁ జూడ ముదావహంబుగాన్

సీ. జాంబవంతుండు వీక్షించి । సంతసించె
భానుపుత్త్రుండు పరికించి । ప్రస్తుతించె
అంగదుఁడు మేలు మేలని । యభినుతించె
హనుమ దీపించె నిశ్చల । ధ్యానమునను.

శా. ఆవేశన్ దనుజావతంసుఁడు విమా । నారూఢుఁడై రామ భ
క్త్యావేశంబున దేహమున్ మఱచి తై । నృత్యశ్రేణి హర్షించి సం
భావింపంగ నన్నగ్న రత్నకర కా । వ్రాతంబు మేఘాకృతిన్
వేష్టించె నమోఘవైఖరిని ప్ర । క్ష్వీభాగ మల్లాడఁగన్.

ఉ. మానవ లహర్నిశంబు నిగ । మంబులనెల్లఁ బఠించి యెవ్వనిన్
ధ్యానమొనర్తు రంబుజభ । వాద్యమరేశ్వర ముఖ్యులెవ్వనిన్
గానమొనర్తు రట్టి త్రిజ । గన్నుత సచ్చరితుండు రాముఁడ
వ్వానరకోటితోడనని । వార్యగతిన్ విహరించె నవ్వుచున్.

ఉ. నూతనవస్త్రసంతతి మ । నోహర వైఖరిఁ దాల్చి వర్ణనా
తీత సువర్ణరత్న విత । తిన్ దనివోవఁ బరిగ్రహించి సం
ప్రీతమనస్కులై కపులు । వేయి విధంబుల సన్నుతించి య
జ్ఞాత హితాన్వయాంబునిధి । చంద్రునిఁ గాంచి నమస్కరింపఁగన్

మ. రమణీయాంబర కాంచనాభరణముల్ । రాజిల్లఁగా మందహా
సముఖాంభోజములన్ బరిపూర్ణమగుచున్ । సంతోషముప్పొంగ శ్రీ
రమణీధాముఁడు రామచంద్రుఁడు కపి । వ్రాతంబు వీక్షించి లో
నమితానందముఁ బొంది మెచ్చుకొనె నై । త్యాధీశునిన్ దైత్యులన్.

గీ. హనుమ దంగద ప్రముఖ వీ । రాధివీరు
లమిత భక్తితో శ్రద్ధతో । నాలకింప;
నఖిల వానరవీరుల । నాదరించి
మృదుతరోక్తుల నిట్లనె । నినకులుండు.

గీ. అఖిల కష్టంబులకునోర్చి । యాహవమున
నను గృతార్థుని జేసిన । ఘనులుమీరు;
మీఋణముఁదీర్ప శక్యంబె । మిత్రులార
కరుణఁగైకొందు నానమ । స్కారములను.

చం. ఒకనికిఁ గీడుమూడినపు । డోపికతో నుపకారబుద్ధి నిం
కొకఁడు తొలంగఁజేయు టది । యుత్తమధర్మము; ధర్మబుద్ధితో
త్రికరణశుద్ధితో ననుఁ ద । రింపఁగఁజేసిన మీ పవిత్ర పా
ద కమలధూళి నొదలను । దాల్చి కృతజ్ఞత వెల్లడించెదన్.

గీ॥ నీరసములయ్యు గుణములన్ । విస్తరిల్లి
యన్యమానావనంబున । కఖిలకష్ట
ములకు నోర్చిన కార్పాస । ఫలములట్లు
లలరు నలఘుల ననిశంబు । నభినుతింతు.

గీ॥ మీరలు వనాటులయ్యు స । ప్రీతితోడ
నరుని నన్ను సంరక్షింప । నరుగుదెంచి
సంకటంబుల నైరించి । జయమొసంగి
ననిశమున్ మిమ్ము వినుతింతు । నాప్తులార.

ఉ. పెండ్లికి వచ్చినట్లు కపి । వీరులు వచ్చి పెనంగిరాజిలో;
బండ్లకొలంది దైత్యకుల । వర్యుఁడొసంగిన రత్నరాశులన్
పండ్ల మనోజ్ఞవస్త్రముల । భక్ష్యములన్ దనివోవఁ గైకొనుం
డొడ్లకుఁబోయి యింకసుఖ । యింపుడు హాయిగనెల్లకాలమున్.

ఉ. వానరులార; మీబలము । ప్రాపున సర్వ జగద్భయంకరున్
దానవవీర మల్లుని । దాకి వధించి జయంబుఁ గొంటి స
న్మానములన్ గ్రహించి పవ । మానజవంబున నింద్ర కేగుఁడీ
ఏను విమానయానమున । నేగవలెన్ నిజరాజధానికిన్.

ఉ. గాసిలి వేచివేచి చిర । కాలమునుండి తపించుచుండ్రి మీ
కోసము చూచుచుంద్రు రఁటి । గో యిదిగోయని బంధువర్గము
ల్లాసవికాసముల్ ముఖము । నన్ దళుకొత్తఁగ నేగి యోగ మ
భ్యాసము సేయుచున్ గృహము । లందుసుఖింపుఁడు నిశ్చలాత్ములై.

గీ. కలసిమెలసిమీ పరివార । కార్యముల వి
ధానఁ గొంత కాలముదాక; । తటి ఘటిల్లె
నిప్పుడు వియోగముం బొందఁ । దప్పదింక
మఱవకుఁడు నన్నుఁ గపులార । మాన్యులార.

గీ కలుసుకొంటిమి మనయొక్క । కార్యమునకు
కష్టముఫలించె దైవంబు । కరుణ కలన
నన్నుమఱవకుఁ డభివందన । నములఁ గొనుఁడు
సెలవొసంగుఁడు వెడలుఁడు । నెలవులకును.

గీ. అనిన విని యెల్లకపులు రా । మునకు మ్రొక్కి
బహువిధంబులఁ బ్రణుతించి । ప్రణతులగుచు
"పుష్పక విమానమునను నీ । పొలుపుఁ గాంచి
హర్షమిగులొత్త నరిగెద । మఘ విరామ."

గీ. అనిన నవ్వుచు నినకులుం । డినసుతాది
హనుమదంగద ప్రముఖులఁ । గనినయంత
"అనుమతింపుము మేము ని । న్ననుసరింతు"
మనిన వారల నెల్లర । నాదరించి.

చ. దనుజవిభున్ విభీషణునిఁ । దప్పక రావలె నంచుఁ బల్కి తా
జనకతనూజతోడ నను । జన్ముని తోడ విమాన మెక్కి నం
తనె హనుమంతుఁడున్ దనుజ । నాథుఁడు భానుసుతాదివీరులున్
మనములసంతసించుచు వి । మానము నెక్కిరి సక్రమంబుగన్.

ఉ. దివ్యవిమాన ముత్తరపు । దిక్కునకుంజని నిల్చినంత నే
నవ్యవిభూతి నెమ్మొగము । నన్ దళుకొత్తఁగఁ గ్రాలు రామునిన్
దివ్యముఁగన్న పేదల వి । ధంబునఁ గన్గొని యెల్లదేవతల్
శ్రావ్యముగా నుతించిరి ది । శావలయంబు ప్రతిధ్వనింపగన్.

ఉ. మించినవేడ్కతోడ విర । మింపక యత్తఱి వేల్పులెల్ల మ్రో
గించిరి దేవదుందుభులఁ । గేల్గవమోడిచి యాడి పాడి వ
ర్షించిరి పుష్పవర్షము శ । చీ పతి ముఖ్యదిగీశులెల్ల హ
ర్షించిరి సర్వలోకముల । జీవులకున్ ప్రమదంబు నిండఁగన్.

శా. సీతా లక్ష్మణవాయునందనులు సం । సేవింప సుగ్రీవుఁడున్
చేతో మోదముతో విభీషణుఁడు భా । షింపంగ లోకైక వి
ఖ్యాతిన్ శోభిలు రాముఁబుష్పక విమా । నారూఢు వీక్షించి సం
ప్రీతిన్ మొక్కిరి భూతలస్థ కపు లు । ద్వేల ప్రమోదంబునన్

వానరకృత శ్రీరామస్తవము.

శ్రీమద్భక్తవశీకర రామ
బ్రహ్మజ్ఞాన విరాజిత రామ
భర్గబ్రహ్మ భ్యర్చిత రామ
దుర్గాపూజిత దుర్జయ రామ
బుద్ధిజ్ఞాన ప్రబోధిత రామ
సనక సనందన సన్నుత రామ

సర్వజగన్నుత సద్గుణ రామ
బృంధామానస విహారణ రామ
బృందారక కుల విభుహితరామ
దశరథ వంశోద్ధారక రామ
జననీ జన నుత శైశవ రామ
మార్తాండాన్వయ మండన రామ
మాయామోహిత మానవ రామ
విశ్వామిత్రా విస్మృత రామ
మునిలబ్ధాస్త్ర ప్రమోదిత రామ
ఆసుగ సంక్షిప్తాసురరామ
తాటకమర్దన దశరథరామ
మునిసతి శాపవిమోచనరామ
పాణిపద వరపదనఖరామ
గౌతమ మునిసుఖ కారణరామ
మునిసుత పాదాంభోరుహరామ
గాఢీశ ధనుష్ఖండనరామ
దూరీకృత నృపదోర్బలరామ
జనకమనోరథ సార్థకరామ
క్షోణీతనయా శోభితరామ
వాణీశాముగ వందితరామ
భార్గవ దోర్బల భంజనరామ
ప్రణతాశ్రిత జనరంజనరామ
పరిపాలిత పితృ వరయుగరామ
పరివర్జిత నృప వైభవరామ
కానన విహరణ కౌతుకరామ
భార్యాసోదర పరిచరరామ
బుధనుతగుహ సంపూజితరామ
ప్రక్షాళిత పదపంకజరామ

తాపస వేషోద్భాసితరామ
భరత ప్రార్థిత పాదుకరామ
మునినుత రవికుల భూషణరామ
దారుణదైత్య విదారణ రామ
సంరక్షిత మునిసంచయ రామ
పంచవటీ తట భాసురరామ
సుమశర సన్నుత సుందరరామ
శూర్పణఖాముఖ శోణితరామ
ఖరదూషణ బలఘస్మరరామ
కాంచన హరిణాకర్షితరామ
మారీచాంతక మానవరామ
సుదతీదూషిత సోదరరామ
పరహృత మాయా వనిసుతరామ
రమణీవంచిత రావణరామ
లలనాన్వేషణ లాలసరామ
ప్రకటిత విధురా భావనరామ
కుహనానాటక కోవిదరామ
సందర్శిత ఖగ సత్తమరామ
శబరీ ఫలరస సహృదయరామ
మారుతసుత సంభావిత రామ
భాస్కరనందన పరిచయరామ
శరనిహత వనేచరవర రామ
అభిషిక్తాజిహి తాత్మజరామ
వానరసేనా వందితరామ
ప్రేషిత హనుమద్విక్రమ రామ
భస్మీకృత రిపుపట్టణరామ
పతిచూడామణి ప్రముదితరామ
వారిధివేలా వాసకరామ

శరణాగతరిపు సహృదయరామ
శయనీకృత కుశ సంచయరామ
జలధిస్మయ హృచ్ఛరధరరామ
శివ్రికేశవ సమశేముషిరామ
హృష్టసైకత లింగేశ్వర రామ
శరనిధిబంధన సాహసరామ
ప్రచలిత లంకాపట్టణరామ
శాసర దానవ భండనరామ
ఖండిత దుర్భట కర్బురరామ
దండితదుర్జయ దానవరామ
దానవమర్దన తాండవరామ
అభ్రంకష రక్తార్ణవ రామ
ఘటకర్ణాసుర గజహరిరామ
సంచలితాసుర సత్త్రమరామ
దానవమాయా ధర్షితరామ
ఇంద్రజి శర బద్ధేంద్రియ రామ
సురరాడ్జిత్ సంక్షోభితరామ
అనుజవినిర్జిత హరిజిత్ రామ
అసురేశ్వర పుత్త్రాంతక రామ
నిస్సాణ రవోన్నదిత రామ
రౌద్రోత్తేజిత రావణరామ
రావణకంఠీరవ రణరామ
దశకంధర శరతాడితరామ
శరఖండిత రిపుసాధనరామ
ఊహాతీత బలోన్నతరామ
అతిమహిమాన్విత యతివరరామ
పిలయోగాగ్రిగ్రహ విగ్రహరామ

భీకరదశగళ విదళనరామ
బ్రహ్మాస్త్రహత రావణరామ
సంతృప్త విభీషణ నుతరామ
నవదానవ ధవ నందితరామ
సంతర్పిత కపిసంచయరామ
పరిపోషిత వరవానరరామ
మహిమాన్వితవై మానికరామ
పరిపాలిత నరవానరరామ
నరసింహస్తుత నామారామ
శ్రీమదయోధ్యా సీతారామ
అఖిల జగజ్జీవాత్మారామ
భక్తజనావన పావనరామ
పాపవిమోచన భాస్కరరామ
వైరాగ్యప్రద వర్తనరామ
అతుల స్వార్థత్యాగీరామ
సుజ్ఞానప్రద సుచరితరామ
యోగీశ్వరనుత యోగీరామ
మాయామానుష మాధవరామ
నిగమాంత చరన్నిర్గుణరామ
త్రిభువన సన్నుత నృపవరరామ
గౌరీశివనుత గౌరవరామ
ఆమయ హారనామామృత రామ
సద్భక్తాశ్రిత చందనరామ
బ్రహ్మార్పిత శతవందనరామ
జయజయ జననుత జగదభిరామ
జయజయ జలద శ్యామారామ
జయజయ లక్ష్మీస్థావర రామ

జయజయ మునినుత పావిత్రకరామ
శుద్ధజ్ఞాన సుశోభితరామ
భర్గబ్రహ్మాదిభక్తార్చిత రామ
రామారామ నిరంజనరామ
రామారామ పరాత్పరరామ

కం. రామారామా జగదభి
రామారామా శ్రితజన । రంజనరామా
రామారామా సీతా
రామా విడనాడఁదగునె । రాఘవరామా.

గీ. అఖిల గుణధామ శ్రీరామ । రఘువిరామ
ఆశ్రితావనకామ ప । ట్టాభిరామ
రుద్రనుతనామ పుణ్యచా । రూఢరామ
వందనము నీకు శతకోటి । వందనములు.

గీ. రామభక్తికి సాటిసా । మ్రాజ్యమెద్ది
రామనామంబుఁబోలుమం । త్రంబులెవ్వి
మంగళము కోమలశ్యామ । లాంగమునకు
వందనము రామపాదార । విందములకు

గీ. అనుచువానరులతిభక్తి । నాడిపాడి
రాసవము గ్రోలినట్టుల । నాదమలరిచి
రామపాదార విందమ । రందపాన
మత్తచిత్తులకేటికి । మద్యరసము.

గీ. బాణవేగంబుఁ దృటిలోనఁ । బరిహసించి
వాయువేగంబు నాముందు । వ్యర్థమనుచు

వడి మనోవేగము జయింప । బయలువెడలె
పుష్పకవిమాన రాజము । భోజనయన.

గీ. పుష్పకము తొల్త మెల్లగఁ బోవుతఱిని
అవనిజంబులు నడచిన । యట్టులుండె;
తమకుఁ దోఁబుట్టు వవనిజ । తరలెననుచు
ననుసరించిన వేమొ య । సార్యతనయ.

గీ. పుష్పకవిమాన మధ్యస్థ । భూరిరత్న
సింహపీఠికాసీనుఁడై । చెలువుమీఱు
రాఘవునితోడ జానకి । రాణమీఱె
స్వర్ణగిరి శృంగజలధర । చపలఁబోలి.

ఉ. శీతలవాతపోత మతి । శీఘ్రగతిన్ చనుదెంచి పుష్పసం
ఘాతమనోజ్ఞ వాసనలఁ । గైకొని యెల్లెడఁ జల్లనెల్లరున్
చేతములన్ సుఖింప రఘు । శేఖరుఁడంతట నుల్లసిల్లుచున్
సీతకుఁ జూపె నుగ్రరణ । సీమ విమానము వోవుచుండఁగన్.

సీ, జానకీచూచితే । సంగ్రామరంగంబు
నతిభయంకరశోణి । తార్ణవంబు
హనుమదంగదవీరు । లసురుల నెదిరించి
సంహరించినయట్టి । స్థానమిద్ది
కుంభకర్ణు నెదిర్చి । కూల్చినస్థలమిద్ది
రావణి కుంభిలా । రణ్యమిద్ది
పతిఁ గూడ నతిచితిన్ । బడినట్టి తావిద్ది
రావణుఁ బోరిగొన్న । రంగమిద్ది.

గీ. అది విభీషణుఁ గలసిన । యట్టిసలము
ఇదిగో సేతువు వీక్షింపు । మిందువదన

ఇదిగో నేఁ బ్రతిష్ఠించితి । నెల్లమునుల
యనుమతిన్ రామలింగేశు । వరయుమబల.

గీ. ఇట్లు క్రమముగఁ జూపించి । యినకులుండు
అవనిపుత్రిక నలరించి । యలరుచుండ
గగనమునఁ బుష్పక విమాన । గమనవేగ
మంతకంతకు హెచ్చె న । త్యద్భుతముగ.

సీ. సౌందర్యవతులనీమధ్య । శబరాలయ శ్రేణు
లిచటనచ్చట బొమ్మ । రిండ్లఁ బోల
బహుళీక రాజాను । బాహువనాటులు
సంచరచ్ఛిశువుల । సరణిఁ దోప
అత్యున్నతములైన । యవనీధరంబులు
బొంగరంబు లవంగఁ । బొలుపునింప
పర్వతంబులనుండి । ప్రవహించునదులెల్ల
పరుగిడుపాముల । పగిదినొప్ప.

గీ, ఎంతయున్ వింతగాఁ జూచి । స్వాంతమలర
నంబుజాక్షునకుంజూపె । నవనిపుత్రి
పవనవేగోపమాన పు । ష్పక విమాన
మతులగతి నాకసంబున । నరుగువేళ.

గీ. దిశల దీపించు నద్భుత । దృశ్యములను
జానకీరామభద్రులు । సంభ్రమమున
వరుసఁ బరికించుచుండఁగఁ బు । ష్పకవిమాన
రాజ మేతెంచె దండకా । రణ్యమునకు.

గీ. ఎప్పుడు విమాన మెక్కితి । మెట్టులబ్బె
దండకారణ్య భాగ్యము । దర్శనంబు

ఒక్కత్రుటిలోన ననుచు న । య్యుర్విపుత్రి
స్వప్నము విధానఁదలఁచెనా । శ్చర్యమునను.

ఉ. పుణ్యుఁడురాఘవుండు మాత । పుణ్యజనుండు వనాగ్రిగణ్యతా
రుణ్యము సత్త్రపోజిత వి । రోధ మృగాన్విత సాంద్రదండకా
రణ్యము సన్మునీశ్వర శ । రణ్యము సత్ఫల పుష్పవృక్షలా
వణ్యముఁ గాంచిడిగ్గెఁ బరి । వారముతోడ విమానరాజమున్

ఉ. సత్యపరాక్రముండసుర । సంఘముఁగూల్చిన నాటినుండి దా
గ్గత్యముఁబాసి భాసిలె న । రణ్యమనేక మునీంద్రబృంద సాం
గత్యమునన్ సతంబుఁగ్రతు । కర్మపరాయణులైన మౌను లా
దిత్యులఁదన్పి నిర్భయగ । తిన్ విహరించుచునుండిరచ్చటన్.

గీ. పుష్పకము పొంతకు నగస్త్య । మునివరుండు
చని రఘూద్వహులంజూచి । సంతసించి
ఎలమిఁబరివార వర్గంబుఁ । బలుకరించి
ఆశ్రమమునకుఁ దోడ్కొని । యరుగుదెంచె.

ఉ రావణకుంభకర్ణముఖ । రాక్షసకోటిని సంహరించి ధ
ర్మావన జీవనుండినకు । లాధ్యుఁడు రాముఁడు వచ్చె నాజగ
త్పావనమూర్తి దర్శనము । పాపవినాశనమంచు శ్రద్ధతో
నావనసీమనున్న మును । లందఱువచ్చిరి సత్వరంబుగన్.

ఉ. ఇందిరకున్ద్విషైన వన । జేక్షణకున్ విభుఁడైన యా జగ
త్సుందరు రామచంద్రుముని । సోములుచూచిప్రమోదితాత్ములై
అందఱు నొక్కసారి విన । యానతులై వినుతించి యాదశ
స్యందన నందనాయని సు । మాక్షతలన్ వెదజల్లి రాదలన్.

గీ. అంత శ్రీరాముఁడెల్లర । నాదరించి
చేతులనుమోడ్చి వినుతించి । క్షేమమడిగి

మీ కరుణ కేనుపాత్రుండ । నైదకుఁడను
ఎలమి నన్నేలుకొనుఁడు ము । నీంద్రులార.

గీ. తనను సహధర్మచారిణిం । గొనిన పరుని
సంహరించుట మనుజ నై । జంబకాదె
ఇందు లోకుల కుపకార । మేమికలదు
ప్రోలికుపకారమా యాలి । నేలికొనుట.

గీ. సన్మునుల తపోబలమును । చాపమూని
వారిశాపములనెడి రో । పములఁదొడిగి
అసురసంఘంబుఁ గూల్చితి । ననఘులార
కరుణఁజైకొందు నా నమ । స్కారములను.

గీ. ఘనులు లోకసన్నుత పుణ్య । ధనులుమునులు
వారలొసఁగిన యట్టి దీ । వనలవలన
విజయలక్ష్మిని గృహలక్ష్మి । వే గ్రహించి
విపులసామ్రాజ్య లక్ష్మికై । వెడలుచుంటి.

గీ. ఆర్యవరులార! మీయాజ్ఞ । నవధరించి
చేయవలసినకార్యముల్ । చేసినాడ
సేవకుఁడనేను నన్నునా । శీర్వదింప
శీఘ్రముగరండు పట్టాభి । షేకమునకు.

చ. ఘనులు పవిత్రచిత్తులు జ । గన్నుతదివ్య తపోబలాఢ్యు ల
వ్వనజ భవాదిదేవతల । ప్రస్తుతికెక్కిన సాధువర్తనుల్
మునులు మహానుభావులతి । పూజ్యులు వారలొసంగునట్టి దీ
వనలకు నాదుజీవనము । పావనమౌఁగద యెల్లభంగులన్.

గీ. అనుమతి నొసంగి ననుఁబంపుఁ । డనఘులార
సూనృతవ్రతుభరతునిఁ । జూడవలయు

ఏను తపసితి నేనిస । హింపఁడతఁడు
చాల కఠినుఁడు వ్రతపరి । పాలనమున.

గీ. అనినవిని బాగుబాగని । యభినుతించి
సామగానంబొనర్చి పు । ష్పములతోడ
నక్షతలఁజల్లి యాశీస్సు । లందఁజేసి
భక్తినైవార మునులెల్లఁ । బలికిరిట్లు.

గీ. "శ్లోకములనంచినట్టిసు । శ్లోకచరిత
సింహపీఠిక నిన్నువీ । క్షింపవలయు
లోకసన్నుత పట్టాభి । షేకమునకు
రాకయుండుమె రణరుద్ర । రామభద్ర."

మ. వధియించెన్ విధివంశ సంభవుని భూ । భారంబువారించె మా
న్యథలంబాపిన యాదివిష్ణువని సం । భావించి మౌనీంద్రుల
త్యధికామోదమునన్ నుతింప వినతుం । డై మొక్కి సీతాధవుం
డధిరోహించె విమానరాజము నయో । ధ్యాదర్శనోత్సాహియై.

చ. ఖగసముదాయమందొక ఖ । గంబువిధాన విమానమొప్ప శౌ
రిగరుడవాహనుండయి చ । రించినయట్లు రఘూద్వహుండు వే
నగములదాటి ఘోరవిపి । నంబులనెల్ల నతిక్రమించుచున్
గగనతలంబునన్ జనియెఁ । గన్నులకున్ మిఱుమిట్లు గొల్పుచున్.

సీ. నీలమేఘమ్ముడాలు । నిరసించి ప్రవహించు
యమునానదింజూడు । మంబుజాక్షి
వజ్రంపుఁదళుకులఁ । బ్రభవింపఁగాఁజేయు
గంగానదింజూడు । కమలపాణి
సకలపాపంబుల । సంహరించెడి త్రివే
ణీసంగమముఁ జూడు । నీలవేణి

అత్యంతపావన । మైన ప్రయాగంబు
క్షేత్రరాజముఁజూడు । కీరవాణి.

గీ. కేతనాస్వతోత్తుంగని । కేతనాది
సార్వత్ర సముదాయసముపేత । మదె యయోధ్య;
జన్మభూమినిఁ జూచితి । జననిఁజూడఁ
జిత్త ముప్పొంగు చున్నది । చిగురుబోణి.

ఆ. వె. భోగలాలసుండు । పురుషాధముఁ డెవండు
జన్మభూమియందు । జననియందు
శ్రద్ధ భక్తి లేక । సంచరించుకొవాఁడు
కుస్సిత్స గాది నరక । కూపమునను,"

గీ. అనుచు రాముండు పలుకుచు । న్నంతలోన
అవ్విమానంబు పురి దరికరుగదెంచె
అమర నదిదాటినంతనె । యవనిజఁగని
ఇట్టులనియెను నవ్వుచు । నినకులుండు.

గీ. "రాఘవులతోడ నేను సు । రక్షితముగ
మగిడివచ్చిన యప్పుడునిన్ । మఱవకుండ
మ్రొక్కులర్పింతు నని నాడు । మ్రొక్కుకొంటి
నమర నదిఁగాంచి; మఱచితే । యవనిపుత్రి."

గీ. అనినవిని జానకీదేవి । దనుజవిభునిఁ
గనినయంతనె యాతఁడు । జనకపుత్రి
ఇంగితమెఱింగి మెల్లగ । గంగదరిని
భువికి నవతరింపఁగఁజేసెఁ । బుష్పకమును.

గీ. భర్త వచియించినట్లు స । ద్భక్తితోడ
ఉత్తమతరంగ కలితభ । ర్గొతమాంగ

గంగఁదిలకించి విమలాంత । రంగమునను
మ్రొక్కులర్పించి చూపెంగె । భూతనూజ.

ఉ. తోయముఁజూచినన్ సకల । దోషములన్ హరియింపఁజేయుగం
గాయమునాసరస్వతులఁ । గాంచినమస్కృతులిచ్చిరాముఁడా
ప్యాయము నెక్కొనంగఁబరి । వారసమేతముగా మునింగి వా
లాయముగానొసంగెవిప్రు । లంబుగ విప్రులకెల్లదానముల్.

ఉ. పిదపరాముండు నిట్టూర్పు । విడిచియెలమి
బురవరముఁజూచి దేహంబు । పులకరింప
కనులఁగన్నీరుమున్నీరు । గాఁద్యజించి
ఎల్లరంజూచిసతిఁజూచి । యిట్టులనియె.

ఉ దుర్గపరీతముగ్రితర । దోర్బలనిర్జితసర్వశత్రురా
డ్వర్గము సస్యనింద్రిబుధ । వర్గధరామరబృందభూతల
స్వర్గముజన్మభూమిఁగని । జన్మముసార్థకమయ్యెనంచునై
సర్గికతోషమున్ బడయఁ । జాలితిజానకియిన్నినాళ్ళకున్.

గీ. అనిహనుమఁగనిరమ్మని । యభినయించి
పురవరంబునకుంజని । భరతుఁజూచి
ఆగమనవార్త యెఱిఁగింపు । మనిననతఁడు
బ్రహ్మవర్చస్సుదీపింప । బయలువెడలె.

శా. కారుణ్యాంబుధి యేగుదెంచెననుచున్ । తన్మాదేవులగ్గింపఁగా
శ్రీరాముండుప్రమోదితాత్ముఁడయిదా । తీపుత్రితోడన్ నిరా
కారుండచ్యుతుఁడాశ్రయించినప్రియా । గక్షేత్రిరాజంబునన్
షోరామిన్ దొలఁగించు పావనపదాం । భోజున్ భరద్వాజునిన్.

ఉ. కాంచినుతించిదీవనలఁ । గైకొనియిట్లనె దైత్యకోటిసా
ధించితిలోకకంటకువ । ధించితిమానులచింతఁదీర్చితి యే

తెంచితి రాజ్యభారముధృతిన్ గ్రహియింపఁగ నిశ్చయించితిన్
మంచిముహూర్తమేర్పఱచి మున్ననలన్ గయికొందు మొక్కెదన్.

గీ. అడవులఁ జరించి క్లేశంబు । లనుభవించి
కపులతోఁ గూడి నా భార్య " నపహరించె
నను నెపంబునఁ గూల్చితి । నసురవిభుని
స్వార్థమునకో లోకోపకా । రార్థమునకొ.

గీ. మానినయవశిష్టుముహూర్త । మహిమవలన
సద్వ్రతముఁ గొంటి భూమ్యన । స్నిస్త్రియమున
మీముహూర్తంబు కంటెఁ దే । మేలుగలదొ
అనుచు నాశించి వచ్చితి నార్యవర్య.

చ. భరతుఁడు నాకు నేనొసఁగు । పాదుకలం గొని యేగుదెంచి భూ
భరము భరించి రాజ్యపరి । పాలన మొప్పొయొనర్చె నాతఁడీ
ధరణిఁ గ్రహింపనొల్లఁడని । తథ్యము నేను పరిగ్రహింపఁగన్
దరుణము పాపరించె నని । నన్ వినిసన్మునివర్యుఁ డిట్లనున్.

గీ. సూతనుఁడవయ్యు నీవు స । నాతనుఁడవు
నీకుఁ గావలె నె ముహూర్త । నిర్ణయంబు?
నిరుపమానంబు నీమనో । నిర్ణయంబు
హృదిఁ దలంచినయట్టు వ । ర్తింతు నీవు.

గీ. ఆత్మ నను కొన్నయట్లు కా । ర్యముల నొనర్చు
ప్రభువరుండవు నీవు; స । ర్వజ్ఞమూర్తి
నీదు సంకల్పమునకు నీ । నియమమునకు
సమయమిదియంచు వచియింప । శక్యమగునె.

గీ. అఖిల లోకేశ్వరుండు ధ । ర్మాసనమున
నిత్యము మెలంగు శాశ్వత । సత్యమూర్తి

రత్నసింహాసనంబునఁ । గ్రాలు మాడఁ
గాంచెదఁగాక కన్నుల । కఱవుదీఱ."

చ. అనవుడు రామభద్రుఁడన । ఘనమునినాయక మత్పురంబు పా
వనముగఁగాక నీ పద । పద్మరజంబున నాలసింపఁగాఁ
జననవియోగదుఃఖమునఁ । జాలకృశించి తపించుచుండ్రి మా
యనుజులుఁ దల్లులున్ మఱియు । నందఱుఁ బోవలె సత్వరంబుగన్.

గీ. అనవిని రాముని గని । మునివరుండు
రామునిం గన్న సంద్రంబు । సరణి నలరి
ఇపుడయే తెంతు నీతోడ । నినను లేఁదరి
అనిబయలుదేరె; శ్రీరాముఁ । డాత్మనలరె.

గీ. అసురులవధించి శ్రీరాముఁ । డరుగుదెంచె
ననెడు శుభవార్త యెల్లెడ । నాక్రమించె;
పడవతోడ మహోత్సాహ భరితుఁడగుచు
వినయమిగురొత్తఁగ, గుహుండు । వేచియుండె.

కం. పరివారసమేతుండయి
పరికీర్తితవర్తనుండు । పంకజనేత్రుం
డరుదెంచుచుండఁ గనుఁగొని
చరణంబుల వ్రాలి గుహుఁడు । సంరంభమునన్.

"శా. ఓలక్ష్మీశ్వర, యోకృపాజలనిధీ, । యోభక్తమందార యో
ఫాలాక్షస్తుత! బ్రహ్మపూజితపదా । బ్జద్వంద్వ! యద్వంద్వ! యో
లీలామానుషవిగ్రహా, జనమనః । క్లేశంబు వారించు భూ
పాలాగ్రేసర మోక్షదాయక ననున్ । పాలింపు భద్రాత్మకా."

కం. అనిభక్త్యావేశమునన్
కనుఁగవ నానందబాష్ప । కణములు దొఱలన్

వినుతింప భక్తవరునిన్
గని నవ్వి రఘూద్వహుండు । కౌఁగిటఁజేర్చెన్.

గీ. గుహుఁడు ధనికుండా? యతినీచ । కులభవుండు
సోదరునిమాఱ్కి శ్రీరాముఁ । డాదరించె
న్యాయ్యమార్గైకచరులు, మ । హాత్ములెపుడుఁ
దలఁపరన్యంబు సత్ప్రవ । ర్తనముఁదక్క.

గీ. ఎంతధనమున్నవాల్లభ్య । మెంతయున్న
నెంతచదువున్నవిజ్ఞాన । మెంతయున్న
జనమువినుతించుసత్ప్రవ । ర్తనములేని
వానిజన్మంబువ్యర్థంబు । వసుధయందు

గీ. సంతతముభక్తియుండునా । సక్తితక్క
గుహునకుఁదలంపనింకొక్క । గుణములేదు
ఒక్కసుగుణంబుమాత్రేవ । నొక్కొకండు
గౌరవముఁబొందనోపును । ఘనులవలన.

గీ. చంద్రుఁడుకళంకితుఁడునిశా । చరుడునయ్యె
నమృతకరుఁడంచుసర్వజ్ఞుఁ । డాదరించె
ఒక్కసుగుణంబు లోపంబు । లున్ననణఁచి
ఒక్కొకనికున్నతస్థాన । మొసగుచుండు.

చ. అలఘుగుణప్రసక్తి నొకఁ । డార్యవరుండగుమల్లెపూవుచే
జలముసువాసితంబయిన । చందమునన్ గుహుఁడొక్కభక్తి చే
విలసుమహానుభావులకు । నేని లభింపఁగరాని గౌరవా
తులితవికాసముంబడసె । దుర్భరదుర్భవతాపమారఁగన్.

గీ. భక్తిభావంబున జనించు । పాపభయము
పాపభయమున జ్ఞానంబుఁ । బడయనోపు

జ్ఞానమునను వైరాగ్యంబు । సంభవించు
నజ్ఞుఁడున్ మోక్షముంబొంద । నర్హుఁడగును.

ఉ. నాగరికప్రపంచమున । నవ్యవిలాసములన్ మరంగి సం
భోగసుఖాభిలాషులయి । బుద్ధిగ్రహింపరు భక్తి మార్గమున్;
జాగొనరింపకుండ నని । శంబును రాము జగద్గురున్ కృపా
సాగరు సంస్మరించి, భవ । సాగరమున్ తరియింపరాదొకో.

ఉ కాలముసర్వజీవులకుఁ । గన్నముఁగల్గిన కుండలోని నీ
రాలనపాలనం బెరిగి । నట్టి శరీరము బుద్బుదంబు; యే
వేళకొయంతరించునపి । వేకమునన్ గనుగానరక్కటా
కాలునివ్రేటులన్ బడక । కాచుకొనందగు రామభక్తిచే.

శా. ఓరీమందమతీ యెఱుంగవపురా । యున్మాదివో ఘోరసం
సారాంభోనిధిలో మునింగితివొయ । జ్ఞానాంధకారంబునన్
శ్రీరామున్ త్రిగుణాభిరాము మదిసం । సేవింపభావింపవో?
ఈరీతిన్ భవమోహపంకమున నీ । వెన్నాళ్లుజీవింతువో?

గీ. ప్రభువరు పవిత్ర సుచరిత్ర । పఠనమునను
ఆత్మనెన లేసి యనురాగ । మంకురించు;
జ్ఞానముదయించు; జ్ఞానతే । జంబుకలన
కామమోహాది గాఢాంధ । కారమణఁగు.

మ. కులగోత్రంబుల హెచ్చుజూడఁడుమహా । క్షోణీశులున్ స్వల్పజీ
వులకున్ తుల్యులఁజేయుధర్మపరులన్ । బోషించుదుర్మార్గులన్
బలులన్ బట్టి వధించుచుండును పర । బ్రహ్మంబురాముండు భ
క్తులఁజూచున్ కరుణాకటాక్షమున వా । క్కుల్ పెక్కులింకేటికిన్

గీ. బ్రహ్మవంశోద్భవున్ దైత్య । పతినిగూల్చె
వినయ మిగురొత్త మునులకు । వినతుఁడయ్యె

అధమకులుఁడయ్యును నిషాదు । నాదరించె
సర్వసమవర్తి లోకైక । చక్రవర్తి.

గీ. అట్టులాలింగనంబున । నలరఁజేసి
గుహునినను రాగమునఁ జూచి । కుశలమడిగి
రాజధానికి రమ్మని । రాఘవుండు
నిజపురాభిముఖుండయి । నిర్గమించె.

గీ. పుష్పకవిమానమున రామ । భూమిభుండు
వచ్చుచున్నవాఁడను వార్త । వాయుసుతుఁడు
పురవరంబునఁ బ్రకటించి । త్వరితగతిని
భరతునకుఁ దెల్పవలెనంచుఁ । బరువువాఱె.

గీ. కుసుమవాసన లెల్లెడ । గుబులుకొనిన
కైవడి విమానగమను నా । గమనవార్త
ఒక్కత్రుటిలోన పురమునఁ । బిక్కటిల్లెఁ
బుష్పము విధానవికసించెఁ । బురవరంబు.

సీ. మనసారఁ గావలె । ననికోరుచుండిన
పెన్నిధానముఁ గన్న । పేదలట్లు
బహులంఘనములకు । జ్వరబాధ తొలఁగఁగ
పథ్యంబుఁ బడసిన । జ్వరితులట్లు
గోలుపోయినదృష్టి । నేలీలనో పొంది
బంధువర్గముఁ గన్న । యంధులట్లు
పోయిన ప్రాణంబు । నేయుపాయముననో
బడసి జీవించిన । ప్రాణులట్లు.

గీ. అంతకంతకుఁ బరితాప । మధికమైన
తఱిని మేఘంబుఁ గన్న చా । తకములట్లు

ఇనకులుఁడు వచ్చుచున్నవాఁ । డనినయంత
పౌరులెల్లరు నానంద । భరితులైరి

గీ. పురవరంబెల్ల పురపురఁ । బొక్కి వెక్కి
రామునివియోగమను సాగ । రమునమునిఁగి
చావ సిద్ధంబుగానున్న । సమయమునకు
పడవ కైవడి రక్షింప । వచ్చెవార్త.

చం. కలకలలాడె నంతిపురి । కాంతలనెమ్మొగముల్ విహాత్న సం
చలనముఁ బొందెఁ బత్తనము । సౌధములన్ భవనంబులన్ గృహం
బుల శుభసూచకంబుగఁ బ్ర । మోదముతాండవమాడుచుండ స
ల్లలితపతాక దివ్యకళ । లన్ బురలక్ష్మి రహించె నత్తరిన్.

చ. బహుళవియోగదుఃఖముల । భావములన్ తొలఁగించుచున్ రఘూ
ద్వహుఁడరుదెంచు నన్న శుభ । వార్తకు నెల్లరు నుల్లసిల్లుచున్
మహాము శుభంబుదీఁటుకొన । మానసముల్ వికసింపనెల్లెడన్
గృహము లలంకరించిరి పు । రేందిరశోభ వచింప శక్యమే.

గీ. వరుఁడు సముహూర్తమునకు రాన్ । బయలుదేరె
నెప్పుడేతెంచునోయని । యెదురుచూచు
శోభనపుఁ బెండ్లికూతురు । శోభతోడ
పురవరేందిరాదేవి యా । తురతఁజూపె.

"కం. సకరుణఁ బాదుక లిచ్చుచు
సకళంకుఁడు రామభద్రుఁ । డరుదెంతున నన్
ఒకదినమువ శేషంబుగఁ;
బ్రకటించితి నట్లు పుర వ । రంబున నకటా!
గీ. రేపటికిఁ బూర్తియగును ని । ర్ణీతసమయ
మిప్పటికి నాగమనవార్త । నెఱుఁగనైతి

మాటఁదప్పఁడె యినకుల । మండనుండు ?
అధికమగుచుండెఁ బరితాప । మరయుకొలఁది.

ఉ. "ఈమతరాజ్యభారము ప । భాస్పదమే బహుపాపహేతువౌ
శ్రీయును రాజ్యమేటికి? వి । శృంఖలవృత్తి వనాంతరంబులన్
హాయిగసంచరించి సుఖ । మందక సంసరణానుబంధమున్
కాయక" యంచు సర్వముని । వంద్యుఁడురాముఁడులోఁదలంచెనో

గీ. ఈ ప్రజాదాస్యవృత్తి నా । కేటికనుచు
చిత్తమున నెంచి నన్ను పే । క్షించెనొక్కొ
తరుణమిడియంచు దాస్యంబుఁ । దప్పుకొనెనొ
ఏమిసేయుదు సంశయం । బెట్టిదియు ?

చం. ఇనకులసంభవుండు వచి । యించిన వాక్యము దప్పునొక్కొ? నా
మనము చలించెఁగాక యను । మానవశంబున రామభద్రుఁడే
వనచరునైనఁ బంపి తన । వార్త యొకింత యెఱుంగఁజేయఁడే?
అనుజుని నగ్నిహోత్రమున । నాహుతిఁ జేయునె నన్నెఱుంగఁడే

కం. అనియిట్లు నెమ్మనంబున
ననుమానముఁ బొంది భరతుఁ । డనుకొనుచుండన్
చనుదెంచె వాయుపుత్త్రుఁడు
కనుఁగవ నానందబాష్ప । కణములు జాఱన్.

సీ. కనుఁగవ ముకుళించి । యనుజవర్యుఁ దలంచి
వేడి నిట్టూర్పుల । విడుచువాని
ఈ వియోగంబిట్టు । లెంతకాలంబుండు
నోయంచుఁ జింతించు । చున్నవాని
అనుకొన్న వేళకు । నన్న రాకుండిన
నస్తమింపఁడు సూర్యుఁ । డనెడువాని

తల్లిమొంతమొనర్చి । దరుణుల నమ్మరా
దంచు బాష్పములఁ ద్య । జించువాని

గీ. జ్ఞానవైరాగ్య సద్భక్తి । సద్గుణంబు
లిచట నెలకొన్న విన్నట్టు । లెసఁగువాని
సంతతము రామనామ స । స్మరణ నిరతు
భరతునింజూచి హర్షించెఁ । బవనసుతుఁడు.

సీ. భోగానుభవకాంక్ష । బుద్ధిఁజొప్పడుగాక
యనుభవించుటకు భో । గ్యములు లేవె
నిష్కామయోగినై । నెగడనెంచెనుగాక
యనురక్తిఁ బొంద కా । మ్యములు లేవె
యతిబోలి యతిదృఢ । వ్రతముఁ బూనెనుగాక
యధికారముంజూప । వ్యవధి లేదె
వైరాగ్యమున నార । బట్టఁ గట్టెనుగాక
వలిపెంపు జలతారు । వలువ లేదె ?

గీ. అనుచు భరతునిఁ బరికించి । యభినుతించి
సంతతము రామనామ సం । స్మరణమందు
హృదయమానంద మొందినఁ । దృణసమంబు
లైహికములంచు నూహించె । ననిలసుతుఁడు.

గీ. అతివిచారంబుతోడ ద । ర్భాసనమునఁ
గన్నులన్ మోడ్చి చింతించు । చున్నవాని
ఉగ్ర పరితాప వహ్నిలో । నున్నవాని
భరతునింజూచి హర్షించి । పవనసుతుఁడు.

“గీ. జయము శ్రీరామభద్రుని । కా జయంబు
వచ్చుచున్నాఁడు శ్రీరామ । భద్రుఁడిపుడు

అనుపమాన విమాన మ । య్యంబరమున
పవనగతికి సమానమై । బయలు వెడలు."

గీ. అనిన విని త్రుళ్ళిపడి లేచి । హనుమజూచి
తొన్నెసురుడుంచు నెంచి న । మస్కరించి
స్వప్న మంచెంచి కాదంచు । సంభ్రమించి
ఎవ్వఁడైయుండు ననియెంచి । యిట్టులనియె.

గీ. జలధిలోఁబడి చానున్న । సమయమునను
పడవవలెనన్ను రక్షింప । వచ్చినట్టి
శివుఁడవో చెప్పుమా యెవం । డవుమహాత్మ
వచ్చుచున్నాఁడె శ్రీరామ । భద్రుఁడిపుడు.

గీ. అనిన రామానుజుని సంశ । యంబుదీర్ప
ననిలపుత్రుండు వినయాన । తాంగుఁడగుచు
ముఖము సుందర దరహాస । మునరహింప
నెలమిఁగరయుగంబును మోడ్చి । యిట్టులనియె

సీ. ఎవ్వాని నామంబు । హృదయంబున శివుండు
సంస్మరించుచు నుండు । సంతతంబు
ఎవ్వాని సేవింతు । రింద్రాది దిక్పాలు
రతిభక్తి తోడ న । హర్నిశంబు
ఎవ్వాని చరితంబు । నెల్లమునీశ్వరుల్
వినుతించి విరచింతు । రనుదినంబు
ఎవ్వాని సద్యశం । బీరేడు జగముల
కమృతాంశు మండలం । బనవరతము

గీ. ఎవని పాదాంబుజధ్యాన । మెల్లవేళ
నఖిల సంకటములకు ది । వ్యౌషధంబు

అట్టి శ్రీరాముఁడనఘ నీ । యగ్రజుండు
ఉన్నత విమానమున వచ్చు । చున్నవాఁడు.

గీ. ఒక్క సతి యొక్క భాషణ । మొక్క బాణ
మనని నెవనికి నద్వితీ । యగతిఁ జెల్లు
అట్టి శ్రీరాము నిశ్శ్వాస । యముగ నీవు
సూర్యుఁ డస్తమింపకమున్నె । చూడఁగలవు

గీ. వరదుఁడు రహస్యముగ నన్నుఁ । బంపునప్పు
డానతిచ్చినవాక్యంబు । నవధరింపు
“భరతుఁడతి సమర్థుఁడు ప్రజా । పాలనంబు
నిచ్చగించినఁ బాలింప । వచ్చునని మే

గీ. శ్రీరఘూద్వహు పాదాబ్జ । సేవకుండ
పవనసుతుఁడ దానవవన । పావకుండ
భక్తకోటికి ననుకూల । బాంధవుండ
నార్యవర్యులు హనుమంతుఁ । డండ్రు నన్ను”

గీ. అనినఁ దలయూచి భరతుండు । హనుమఁ జూచి
నయవినయభార ముకుళిత । నయనుఁడగుచుఁ
గరయుగము మోడ్చి ఫాలభా । గంబుఁ జేర్చి
భావగతి రామునిం జూచి । పలికె నిట్లు.

“శా. వ్యామోహంబున భోగభాగ్యముల నే । నాసించి యంధుండనై
సామాన్యక్షితినాథు లట్టుల దురా । శాపాశ బద్ధుండనై
ఏమాత్రంబు భరింపఁజాలనుజుమీ । యీరాజ్యభారంబు; శ్రీ
రామా, నీచరణారవిందముల న । శ్రాంతంబు ధ్యానించెదన్”

గీ. అని వచించిన భరతుని । యాత్మశుద్ధి
కతుల వైరాగ్యమునకు న । య్యనిలపుత్త్రుఁ

డక్కఁజముఁబొంది పినతండ్రై । మ్రొక్కినంత
నతనిఁ గౌఁగిటఁజేర్చి రా । మానుజుండు.

ఉ. నీశుభవర్తమానమున । నిల్చితిఁగాక, విరక్తితోడఁ బ్రా
ణాశఁ బరిత్యజించు సమ । యంబున కేగతివచ్చినాడవో
కీశవరేణ్యా! నిన్నుఁదిల । కించితి, భాస్కరవంశ రాజ్యల
క్ష్మీశుఁడు వచ్చునంచు వచి । యించితివెంతయుసంతసించితిన్,

గీ. భువనపావనుఁడౌ నొప్పు । పవనదేవు
పుత్త్రుఁడవు మిత్త్రుఁడవుమాకు । పుణ్యమూర్తి
జ్ఞాన తేజో నిధాన స । న్మానవులకు
మాన నీయుండ వీవొక । వానరుఁడవె?

శా. నందిగ్రామ మహోత్సవంబునకు స । న్నాహంబుగావించి యా
నందాంభోనిధిలోన శేషశయనున్ । నారాయణున్ శౌరి గో
విందున్ దివ్యపదారవిందునభవున్ । విష్ణున్ ముకుందున్ హరిన్
కందున్ రాముగుణాభిరాముఁ ద్రిజగ । త్కల్యాణసంధాయకున్.

గీ. ఉభయులము సత్వరంబ యా । యోధ్యకేగి
ఈ శుభోదంత మెల్లర । కెఱుకపఱచి
సంబరముతోడ గోధూళి । సమయమువను
ప్రభువరేణ్యుని వీక్షింప । వలయుమనము.

గీ. అనితొలుత నందిలోఁగల । యఖిలజనుల
కద్భుతమహోత్సవ మొనర్ప । నానతిచ్చి
అనిలపుత్త్రునితోడ రా । మానుజుండ
యోధ్యకేతెంచి సంధించె । నుత్సవంబు.

గీ. ఆదివిష్ణుని వాహన । మనితలంచి
జనమువినుతింప పవమాన । జవముతోడఁ

పుష్పకవిమానమే తెంచెఁ । బురసమీప
మునకు; పురిఁ జూచియుప్పొంగె । జనకపుత్రి.

"మ. చలదుత్తుంగ తరంగ సంఘములనన్ । సౌధంబు లభ్రంకషం
బులుఁ శోభిల్ల, ననంతభోగయుతమై । పొల్పొందె యెవ్వేళ శ్రీ
నిలయంబై విలసిల్లి నిత్యముద్విజా । నీకంబుఁ బోషించుచున్
అలరెన్ క్షీరపయోధికై వడి నయో । ధ్యన్ జూచితే జానకీ"

గీ. అనుచు శ్రీరాముఁ డుత్సాహ । మావహిల్ల
జనకసుతకును పరివార । మునకు నెలమి
పురవరంబునుఁ జూపించి । భువికి డిగ్గ
గరుడగమనుని ఠీవిని । గిరితనూజ.

గీ. విశ్వపాలకుఁ డైన ల । క్ష్మీశ్వరుండు
గరుడిపై వచ్చె నని యెంచి । పురవరంబు
కదలి యేతెంచె నేమొ స్వా । గతమొసంగ
నుత్సహించుచు వచ్చె మ । హోత్సవంబు.

సీ. జగదేక రణశూరు । నిగమాంత సంచారుఁ
గృతయుగా లంకారు । హితవిచారు
అఖిల లోకాధారు । నాశ్రిత మందారు
నీలాంబుదాకారు । నిర్వికారు
వారాశి గంభీరు । వరజటాజినధారు
నర్కవంశోద్ధారు । నరి విదారు
ధారుణీధరధీరు । ధర్మావనోదారు
భక్తచిత్త విహారు । బాపదూరుఁ

గీ. జూచి హర్షించె వర్షించె । సుమచయంబు
సరస సంగీత ముఖరితో । త్సవ మొనర్చె;

గతము మఱపించు గతిని స్వా । గతమొసంగె
అఖిల రిపుకోటికి నసాధ్య । యగు నయోధ్య.

సీ. భరత శత్రుఘ్నులు । పాదంబులకు మ్రొక్కి
యుభయ పార్శ్వంబుల । నొదిగినిలువ
సచివులు మంత్రులు । చరణద్వయి స్పృశించి
యాజ్ఞకై వేచియు । న్నట్లునిలువ
ఆప్తులు నాత్మీయు । లనురాగముం జూపి
దరహాసవదనులై । సరసనిలువ
హితులుం బురోహితుల్ । హితకీర్తి వర్తించి
ప్రమదంబునను సమీ । పముననిలువ

గీ. వేద ముఖరిత వదనులై । విప్రవరులు
అక్షతలఁజల్లి యాశీస్సు । లందఁజేయ
జానకీ రామభద్రులు । సంతసించి
పలుకరించిరి దేహముల్ । పులకరింప.

గీ. దాశరథి సతితోడ సో । దరుల తోడ
గురువునకు మ్రొక్కి తల్లుల । చరణములకుఁ
బ్రణతు లర్పించి చతురంగ । బలసమేత
పుర జన మహోత్సవముఁజూచె । గిరితనూజ.

గీ. ఉత్సవముఁజూచి శ్రీరాముఁ । డుల్లసిల్ల
ప్రజ మహోత్సాహముంబొంది । రాముఁజూచి
జయజయారావములఁజేసి । సన్నుతించి
భరతునానతిఁబురిలోని । కరుగఁజొచ్చె.

సీ. సరయూ నదీతీర । పురవరంబు నయోధ్య
భూలోక వైకుంఠ । ముగఁదలంతు

ఇచ్చోట నేఁబుట్టి । యిచ్చోటఁ బెరిగితిఁ
గలనైన నెట్టి దుః । ఖములనెఱుఁగ
స్వర్గంబునన్ లేని । సంతసం బొదవించు
జననితో సమముగ । జన్మభూమి
జననిని మనసార । జన్మభూమి నెవండు
ప్రేమించి సతము సే । వింపకుండు

గీ. వాని జన్మంబు వ్యర్థంబు । వసుధయందుఁ;
ఇన్నదిన్ స్నానముం జేసి । యిప్పురంబుఁ
గాంచి భక్తితో సన్నమస్క । రించునట్టి
యలఘుచరితుండు నాలోన । నైక్యమొందు.

గీ. అనుచు రామభద్రుండయో । ధ్యాపురంబు
నాప్తులకుఁ జూపి యలరించి । యలరుచుండ
అద్భుత వినోదములతోడ । నతిశయించి
ఉదధి చందాన నుప్పొంగె । నుత్సవంబు.

రగడ:— ప్రేలెన్ మింటన్ వేయి ఫిరంగులు
శోభిలె "తారాజువ్వల" రంగులు
వినబడె వీధుల వివిధభవనముల
మన మలరించెడి మధురస్వనములు
భూరి రవంబులు మ్రోగెన్ నింగిన్
జన ముప్పొంగెను సంద్రము భంగిన్
ధ్వజములతో సౌధంబులు గ్రాలెను
భుజగేంద్రుఁడు విని పొగడం జాలెను.
నవ రత్నాన్విత నవ తోరణములు
శోభిలె గృహముల శుభకారణములు
ప్రకటించెను సురపాలుఁడు హర్షము

గురిపించిరి నాకులు సుమవర్షము
ఆకర్షింపఁగ నందనము చందము
పౌరులు పొందిరి బ్రహ్మానందము
సరస కవీంద్రులు చదివిరి శ్లోకము
ఓహో యని జను లుడిగిరి శోకము;
అంతట నెలకొనె నధికామోదము
వేల్పులుఁ బౌరులు విడిచిరి ఖేదము
వీరుల రణ జయ వృత్తాంతంబుల
గోడల వ్రాసిరి కోటి విధంబుల;
వానర వీరుల వైఖరిఁ గాంచిరి
పౌరులు సీతావరు వినుతించిరి
వెలిగెన్ విధుసమ విద్యుద్దీపము
లణఁగెన్ బౌరుల కంతస్తాపము;
ఆట వెలందుక లాటల నాడిరి
పాటల గంధులు పాటలఁ బాడిరి
నరభాగ్యోధి యను నాటక మాడిరి
కని విని యెల్లరుఁ గడుఁగొనియాడిరి
ప్రజ హృదయంబునఁ బాసెను దైన్యము
నయనోత్సవముగ నడచెను సైన్యము
జెండాలంగల శుండాలంబులు
అత్యున్నత సిత హయ రాజంబులు
వెడలెను నానా విధముల రథములు
చెలువార ఫలించె మనోరథములు;
మునులు మహర్షులు భూసురచంద్రులు
హితులుఁ బురోహితు లతి ధీ సాంద్రులు
సచివులు మంత్రులు జ్ఞాన సముద్రులు
సద్భట ముఖ్యులు సంగర రుద్రులు
స్త్రీలుం బురుషులు వృద్ధులు బాలుర

జననుతిఁ బడసిన సద్గుణ శీలురు
సవ సద్జ్ఞానులు సజ్జన లోలురు
భయ వినయానత పర భూపాలురు
పరి వేష్టింపఁగ భరతుని తోడన్
అలరె మహోత్సవ మందఱుఁ జూడన్.

గీ. ఇట్లు లుత్సవ ముత్సాహ । మినుమడింప
నడచు చుండంగ నద్భుతా । నందముగను
రామభద్రుండు నందియన్ । గ్రామమునకు
వచ్చినంతనె భరతుండు । పలికె నిట్లు.

గీ. నందియన్ గ్రామ మియ్యది । నళిననేత్ర
ఆశ్రమంబున నిఁచుక । విశ్రమించి
గైకొనందగు రాజ్యాధి । కారముద్రి
స్వర్ణ సింహాస నాసీన । పాదుకలను.

గీ. అనిన విని తల్లు లెల్లరు । ననుమతింప
ఎల్ల మానులు నాప్తులు । హెచ్చరింప
భరతుఁ గౌఁగిటఁ జేరిచి । పాదుకలను
ముద్రియుంగొనె నినకుల । పుంగవుండు.

చం. భరతుని యాశ్రమంబుఁగని । పావనవర్తను ధర్మ జీవనున్
భరతునిఁ గౌఁగిటంబొదివి । బాష్ప పయోనిధి లోనఁదోగి సుం
దరదరహాసకాంతి వద । నంబునఁ గౌముది సొంపునింప శ్రీ
వరుఁడు వచించె నిట్లు ముని । వర్యులుఁబౌరులు నుల్లసిల్లఁగన్

చం. పుర మభివృద్ధిఁబొందెఁగదుఁ । బూర్వముకంటె ననేకభంగులన్
సిరులకుఁగాణయాచి యనఁ । జెల్లు భవత్పరిపాలనంబు; రా

జ్వరము విచారమున్ విడిచి । సౌఖ్యములన్ బడసెన్ భవద్భుజాం
తరమునఁదమ్ముఁడా ప్రజకు । దైవమ వైతి యథార్థమారయన్

ఉ. నీ పరిపాలనంబు నృప । నీతికి లక్ష్యము గాగ శాత్రవ
క్ష్మాపతి కోటికిన్ హృదయ । శల్యముగాగ ప్రజానికాయ సం
తాపమణంచి ధీచతుర । తా గరిమంబున ఖ్యాతికెక్కె, నే
లోపము లేని సర్వగుణ । లోలుఁడ వీవు నృపాలకోటిలో.

ఉ ఈవొక సోదరుండవని । యెంచి నుతించుటగాదు తమ్ముఁడా
భూవరు లెల్ల నీకు సరి । పోలరు వైరి నిరూఢిని వని
పావకుఁడై చెలంగు పరి । పాలను డెల్లవిధంబులన్ ప్రజా
సేవకుఁ డన్నధర్మమును । జెప్పితి వుత్తమ మార్గదర్శివై."

గీ. అని రఘూద్వహుండు మునీంద్రు । లనుమతింప
నడి జటాజిన భారంబు । విడిచి వనిత
జనని సుతయును సోదరు । లట్లొనర్చ
స్నానములఁ జేసి రా రాము । చంద్రుతోడ.

ఉ. అంబరవీధి నిర్మలిన । మై ముకురంబువిధాన నొప్పె, స
రంబులు నిశ్చలస్థితిఁద । నర్చె సరిత్తులు నిర్మలాంబు పూ
రంబులతో రహించె రఘు । రాముఁడు తమ్ములతోడఁ గూడి స్నా
నంబొనరించి నూత్నవస । నంబులఁదాల్చిన వేళఁ బార్వతీ

చం. అనిలతనూజుఁ డర్కసుతుఁ । డంగదుఁడున్ దనుజేశ్వరుండు స
న్మునులు హితుల్ పురోహితులు । భూసురముఖ్యులు వెంబడింపన
య్యినకులభూషణుండుచనె । నెంతయు వేడుకతో నయోధ్యకున్
జనకుని మందిరంబునకు । జానకితో ననుజత్రయంబుతో

గీ. మునుల యానతిఁ గైకొని । హనుమదాది
వీర వానరపుంగవుల్ । వెడలి రవుడు

వార్ధులకు క్షేత్రములకు సరి । వంతులకును
స్వర్ణకలశంబుల జలంబు । సంగ్రహింప.

చం. పరివిమలచిత్తులైన ముని । వర్యులుఁ బౌరవరుల్ ధరామర
ప్రవరులు బంధుమిత్రపరి । వారము మంత్రులు గొల్చియుండఁగా
భవనమునన్ రఘూద్వహుఁడు । భాసిలె; రాత్రిమహోత్సవంబునన్
వివిధవినోదముల్ చెలఁగె । వేకువదాక ననేకభంగులన్.

మ. అదె దోషాచరుఁ డస్తమించె నదె సం । ధ్యాశోభ దీపించె న
ల్లదిగో వేగురుఁజుక్క దోఁచె నదిగో । యత్యంతశీఘ్రంబుగా
నుదయించెన్ రవి యుత్సవంబుగ నగా । నుత్సాహులై యుండుఁడూ
ర్ధ్వ దెసన్ జూచి నిశాంతవేళఁ బ్రజ యా । మోదించె నొక్కుమ్మడిన్

మ. తన తేజంబును గాంచి తమ్ములు ప్రమో । దంబొంద, సత్సంతతిన్
తనతో నైక్యముఁ బొందఁ జేసికొని స । న్మార్గంబునం గ్రాలి పా
వనుఁడున్ మిత్రుఁడు లోకబాంధవుఁడునై । ప్రాక్శైలసింహాసనం
బున దీపించె నినుండు సన్మునివరుల్ । భూమీసురుల్ మ్రొక్కఁగన్.

ఉ, భానుఁడు వంశకర్త యని । భానునిఁ గాంచి నమస్కరించి, న
వ్యాననసీమఁ దోప నఖి । లాశ్రితవర్గము సన్నుతింప స
న్మానులతోడ భూసురులు । మంత్రములన్ పఠియింప మంగళ
స్నాన మొనర్చె రాఘవుఁడు । జానకితో ననుజత్రయంబుతో

గీ. నలిననేత్రుని మంగళ । స్నానవేళ
స్నానములఁ జేసి యెల్లరు । సంభ్రమమున
వివిధ వస్త్రాద్యలంకార । వేషములను
గైకొనిరి రామపట్టాభి । షేకమునకు.

గీ మౌనివర్యుల యానతిన్ । మంత్రివరులు
పంకజదళాక్షుని లలాట । ఫలకమునను

పట్టముంగట్టి దశరథు । భవనమునను
అమరఁ జేసిరి రత్నసిం । హాసనంబు.

కం. సభలో సింహాసనమున
పృథివివర్యుఁడు భార్యతోడ । భాసిలినంతన్
శుభమస్తని మునివల్లభు
లభిషేకంబాచరింప । నగిరి వేడ్కన్.

సీ. విప్రవర్యులతోడ । విజయు భారద్వాజ
కాత్యాయన వసిష్ఠ । గౌతమాది
మునివల్లభులు వేద । ముఖరితవదనులై
పుష్పాక్షతలఁజల్లి । భూతలస్థ
నదనదీజలధుల । యుదకంబులు గలట్టి
స్వర్ణపాత్రలఁబూని । సంభ్రమమున
నభిషేక మొనరించి । యాశీర్వదింపంగ
మంగళారవములు । మహితగతిని,

గీ. భూనభోంతరాళంబుల । బోరుమనఁగ
అంబరమునుండి పుష్పవ । ర్షంబుగురిసె;
నభము ఘూర్ణిల్ల దేవదుం । దుభులుమ్రోగె
అఖిలజీవుల కామోద । మావహిల్లె.

సీ. సూర్యాన్వయ నృపాల । మర్యాద దీపింప
మణివిరాజిత రాజ । మందిరమున
జనులెల్లరు నుతింప । సన్మునుల్ దీవింప
సామంత భూపులు । సంతసింప
విప్రవరేణ్యులు । వేదంబులు పఠింప
జనములు ముప్పూరు ।ననుమతింప

హనుమ యామోదింప । ననుజులు సేవింప
జనకభూవరు పుత్త్రి । యనుసరింప

గీ. రత్నసింహాసనంబున । రాణమీఱి
సకలజనసమ్మతముగ వై । శాఖబహుళ
సప్తమిని రామభద్రుండు । సర్వలోక
భక్తు లలరంగఁబట్టాభి । షిక్తుఁడయ్యె.

సీ. చాంచల్య ముడిగిన । శంపాలతంబోలి
జనకజ వామాంక । మున రహింప
సింహాసనము చెంత । శ్వేతాతపత్త్రంబుఁ
జేఁబూని భరతుండు । చెలువుమీఱ
ధనువూని చామరం । బునుబూని లక్ష్మణ
శత్రుఘ్ను లుభయపా । ర్శ్వముల నిలువ
పాదుకల స్పృశించి । పవమానపుత్త్రుండు
పాదాంబురుహ సమీ । పమునఁగొలువ

గీ కాంచనానర్ఘ నవరత్న । కాంతికలన
డంబుమీఱిన ఘన కిరీ । టంబుతోడ
రామభద్రుండు త్రిభువన । రక్షకుండు
భక్తు లలరంగఁబట్టాభి । షిక్తుఁడయ్యె.

సీ. భంగముల్ గలయింటఁ । బ్రభవింపఁదగదంచు
భంగముల్ లేని యి । వ్వసుధఁబొడమె
పంకజాతంబున । వసియింప రాదంచు
రాజర్షి గృహమున । రాణమీఱె
పతి యురంబెక్కిన । పాపంబుఁదొలఁగింపఁ
జతిని చిత్తమున సం । తతము నిలిపె

చాంచల్యము త్యజించి । స్థైర్యమ్మున రహింప
భక్తుల చిత్తమే । ర్పులచుకొనియె

గీ. అనుజుడు నిశాచరుండని । యాగ్రహించి
కొడుకు శివవైరి యని యెంచి । కోపగించి
ఆదిలక్ష్మి భూపుత్రియై । యవతరించి
అతుల గతిఁ గాలె రత్నసిం । హాసనమున.

గీ. బ్రాహ్మణులకును కవులకు । పండితులకు
యాచకులకు సేవకులకు । నాశ్రితులకు
ధన కనక వస్త్రవాహన । దానములను
శ్రీరఘూద్వహుఁ డొసఁగి సం । తృప్తిఁ బఱచె.

గీ. శ్రీరఘూద్వహు పట్టాభి । షేక వేళఁ
గన్నవారును భక్తితో । విన్నవారు
అవని యిపుడు "రాజన్వతి" । యయ్యెనను ము
దలల నంచి మ్రొక్కెద । ర్యావసరమున.

ల. గ్రా. మ్రొక్కె సురనాయకుఁడు । మ్రొక్కె నరవాహనుఁడు
మ్రొక్కెఁ గమలాసనుఁడు । మ్రొక్కె శమనుండున్
మ్రొక్కె గణనాయకుఁడు । మ్రొక్కె ఫణినాయకుఁడు
మ్రొక్కె గరుడాధిపుఁడు । మ్రొక్కె వరుణుండున్
మ్రొక్కె నహిభూషణుఁడు । మ్రొక్కెను విభీషణుఁడు
మ్రొక్కెఁ బవనాత్మజుఁడు । మ్రొక్కెఁ బవనుండున్
మ్రొక్కెఁ గపినాయకుఁడు । మ్రొక్కె నృపమండలము
మ్రొక్కె మునిమండలము । మ్రొక్కె నఖిలంబున్.

గీ. అవని భారంబు వారింప । నవతరించి
నఖిల కష్టంబుల సహించి । యబ్ధిదాటి

అసురవర్యుని వధియించి । యవనినేలు
ధర్మపరునకు మ్రొక్కని । ధన్యుఁడెవఁడు.

గీ. ధర్మదేవతఁగాపాడ । ధరణియందు
నవతరించిన శ్రీరాము । నఘ విరాము
సర్వ సమభావ సామ్రాజ్య । సార్వభౌము
వేదములు నాల్గు వినుతించె । వివిధగతుల.

ఉ. ఖేదము మాంచి లోకపతి । కీర్తిత ధర్మము భానుకొల్పి మ
ర్యాద నతిక్రమించుఖలు । పాత్ముల నెల్లడ సంహరించి, యా
హ్లాదము సంఘటించు ఘను । లన్ వినుతింపవలెయుందనురే చతు
ర్వేదములున్ నుతించె నర । విందదళాక్షుని రామభద్రునిన్.

సీ. నవరత్న సింహాస । నంబున శోభిల్లు
జానకీ రాముల । సన్నుతించి
రావణు మణి హార । రాజంబుఁగానుకఁగ
పృథ్వీజ కొసఁగె వి । భీషణుండు
ఆరత్నహారమున్ । హనుమంతున కొసంగి,
యుర్వీతనూజ బ । హూకరించె
తద్రత్న సముదాయ । తరళ దీప్తిఁగాంచి
పక పక నవ్వెచుఁ । బవనసుతుఁడు

గీ. రమ్యతర రామనామాంక । రములు లేని
వ్యర్థ మణిమాల నాకేల । యనుచుఁ జిదిమి
మణుల ఖండించి పరికించి, । మానసమున
జానకీరాములం జూపె । సరభసమున.

చం. తనహృదయాబ్జ మధ్యమున । దారకనాముని రామభద్రునిన్
జనకజఁ జూపి, భక్తి మెయి । సన్మనులున్ గలసభ్యు లెల్లరున్

గనుఁగొని సచ్చిదింపఁ బుల । కల్జనియింపఁ బ్రమోదితాత్ముఁడై
అనుపమ భక్తిభావమున । నయ్యనిలాత్మజుఁ డప్పు డట్లనున్.

గీ. భక్తహృదయాబ్జ కర్ణికా । భాగమునను
భాసిలి యహర్నిశంబు నా । పదలఁ బాపు
జానకీ రామభద్రుల । సంస్మరించి
పలుకు చున్నాఁడ వినుఁడు నా । వాక్యములను.

సీ. శ్రీయుతాఖిల జగ । త్సింహాసనాసీనుఁ
డొకయూరఁ బీఠిక । నుండెనేఁడు
గగనాంత సత్త్రంబుఁ । గలిగి శోభిలు వాఁడు
స్వల్పాతపత్త్రంబుఁ । బడసెనేఁడు
అఖిల జీవములందు । నలరుచుండెడు వాఁడు
తానొక జీవియై । తనరెనేఁడు
నిగమంబులఁ జరించు । నిర్గుణంబుల వాఁడు
మనుజాకృతిం దాల్చి । మలసెనేఁడు

గీ. అజ మహాదేవ సేవల । కలరువాఁడు
మనుజులకు సేవసేయఁగ । మరఁగెనేఁడు
ధర్మసంస్థాప నోత్కృష్ట । కర్మములకు
రాముఁడా దర్శపురుషుఁడై । గ్రాలెనేఁడు.

సీ, మనుజ మాత్రుండయ్యు । వనజోద్భవుఁడు మెచ్చ
నవనిపై వేద మ । ర్యాదనిలిపె
సామాన్యమర్త్యుండ । సామాన్య సద్గుణిని
సకల రాజన్యసం । చయము గెలిచె
ధరణీశుఁడై పుట్టి । ధర్మరక్షణమున
ధారుణీదేవికా । ధారమయ్యె.

జగమున నోకఁడయ్యె । సద్యస్స్ఫూర్తిచే
నఖిల లోకంబుల । నాక్రమించె

గీ. మానవాధీశమాతృ(పం)డె । మాధవుండు
మాధవుండు సంపూజితో । మాధవుండు;
ఎఱుఁగఁజాలిన ధీమంతు । లెఱుఁగఁగలరు
అనుచు శ్రీరాము వినుతింతు । రార్యవరులు.

సీ. శ్రీరామ సుచరిత్రి । చింతనంబునఁగాని
సౌఖ్యంబు లేదు సం । సారమునను
పంచాక్షరీ మంత్రి । పఠనంబు నంగాని
పాపాగ్నులణఁగవీ । భవము నందు
రామనామాక్షర । ప్రార్థనంబునఁ గాని
జ్ఞానంబు గలుగదీ । జన్మమునను
పంచాక్షరీ మంత్రి । భావనంబునఁ గాని
బాధలు తొలఁగ వీ । వసుధయందు

గీ. రమ్యతర రామ నామ మం । త్రంబువలన
మహిత పంచాక్షరీ దివ్య । మంత్రమునను,
అవని సాధింపఁబడని కా । ర్యములుఁగలవె;
అనుచు భావింపు(డ)నిశంబు । నార్యవరులు.

చం. అలఘుమునీంద్రులార మను । జాకృతిఁ గైకొని నట్టిరామునిన్
దలఁపుడు, రామనామమును । తారక మంత్రముగానుతింపుఁడీ
తొలుత నమశ్శివాయ యని । తోడనె రాముని సంస్మరింపఁగా
వలయు ననేక జన్మకృత । పాపములన్ వినశింపఁజేయఁగన్.

సీ. భూభారమున్ బాప । భూరిబాణాగ్నిచే
దనుజ మృగంబుల । దర్పమణఁచె

క్ష్మాపాలతిలకుఁడై । క్ష్మామండ లాఖండ
లఖ్యాతి భూమి న । లంకరించె
ధర్మంబుఁగాపాడ । ధర్మవు ఁబూని లో
కైక ధనుర్ధర । ఖ్యాతిఁబడసె
అనుపమ సుప్రతా । పార్క తేజంబున
ఖలుల దోర్గర్వాంధ । కారమణఁచె

గీ. విషమ శరములఁ బూని దు । ర్విషయలోల
మనుజమృగముల వేటాడు । మరుని గెలిచె
ప్రతనిరూఢిని; జానకీ । ప్రాణవిభుఁడు
రాజమాత్రుండె త్రిభువన । రక్షకుండు.

సీ. విషయాటవీ మధ్య । వీధిఁజిక్కి తపించు
తఱిఁ బ్రోచు సన్మార్గ । దర్శకుండు
రోగ భోగ వియోగ । రా గాదిబాధలఁ
బాపి సంరక్షించు । వైద్యవరుఁడు
మోహాంబునిధిలోన । మునిఁగి తేలుచు నున్న
జీవులఁగాపాడు । నావికుండు
ద్వంద్వబాధలఁ జిక్కి । దారిఁగానని దుఃఖ
భాగుల నోదార్చు । ప్రాణసఖుఁడు

గీ. సాధుసాంగత్య నిరతులై । సంత తంబు
తనదు పాదాంబు జధ్యాన । మున రహించు
భక్త వర్యులఁబోషించు । ప్రభువరుండు
రాజమాత్రుండె జానకీ । ప్రాణవిభుఁడు.

ఉ. నిర్మలినాంత రంగమున । నిత్యము రాముని సన్మరించి దు
ష్కర్మములన్ త్యజించి నిర । తంబు పరోపకృతిన్ రహించి స

ధర్మ పథప్రవర్తనముఁ । దప్పనివారికి మోక్షమబ్బ నీ
మర్మమెఱుంగు ధీవరులు । మాన్యులు,ధన్యులు గాక,యన్యులే?

సీ. అరిషట్కము జయింప । నానందమున్ బొంద
ద్వంద్వ బాధలనెల్ల । దప్పఁ గొనఁగ
నీదుభక్తులు యోగ । నియమంబులఁద్యజించి
నిర్మల బుద్ధితో । నిను స్మరించి
నిర్లిప్త చిత్తులై । నీ పాదములఁ గొల్చి
సంసార నామక । జలధి దాటి
తనువుఁడగనె మోక్ష । మును బొంద సర్వులై
ప్రజ్ఞా ధురీణులై । వఱలు చుంద్రు;

గీ. మానసమున నీపాదప । ద్మద్వయంబు
నిలిపి,నీ నామముఁ దలంచి । నిను భజింతు
నన్ను దయఁజూడు మా పరం । ధామరామ
ఆశ్రితావనకామ ప । ట్టాభిరామ.

మ. సరయూ ద్వీపవతీ పవిత్రసలిల । స్నానంబుఁ గావించి సుం
దరు భూపాల పురందరున్ రఘువరున్ । దర్శించి ధ్యానించి శ్రీ
హరి వైకుంఠముఁ బోలిభాసిలు నయో । ధ్యంజూచినంజాలు దు
స్తర సంసార సముద్రసంభవమన । స్తాపాగ్ని చల్లారదే ?

సీ. అనిశంబు నాక్షేమ । మరయుమా యంభోజ
నయన క్షీరాంభోధి । శయన యనుచు
ఆశ్రితుండను నన్ను । నాదరింపుమ మంగ
ళాంగ భక్త హృదబ్జ । భృంగయనుచు,
నిను నమ్మికొని యుంటి । నెనరుంచుమా రిపు
జైత్ర పాపలతాల । విత్రయనుచు

దాసుండ నంటి,నన్ । దయఁజూడుమా దయా
హృదయ శ్రీరఘు కులా। భ్యుదయ యనుచు

గీ. ఎవఁడు నీనామ రూపంబు । లెదఁ దలంచి
నిన్ను ధ్యానించునో వాఁడు । నిరుప మాన
మోక్ష సామ్రాజ్య లక్ష్మితోఁ । బొదలుఁ గాక
ఆశ్రితావన కామ, ప । ట్టాభిరామ.

కం. శ్రీరామ ! రామయనుచును
నీరూపము లోఁ దలంచి । నిను వినుతింపన్
ఘోరాతి ఘోరతరమగు
పోరామి తొలంగునట్టి । మూర్ఖులకైనన్.

కం. హీనాతి హీనుఁడైనను
శ్రీనాథా ! మాని వినుత । సీతానాథా!
నీ నామ ముచ్చరించిన
జ్ఞానాధికుఁ డగును వాఁడు । సజ్జనకోటిన్.

కం. రామాయణ మామ్నాయము
నే మా నవుఁడైననేమి । యెలమిన్ వినినన్
తా మానసమునఁ దలఁచినఁ
గామాదుల సంహరింపఁ । గలుగున్ తృటిలో.

సీ. సంసారసంభూత । సంకటంబు లణంగ
కష్టనష్టముల దుః । ఖము:తొలంగ
జన్మసంచితపాప । సంచయంబు దహింప
నాయు రారోగ్యంబు । లనుభవింప
అజ్ఞాన తిమిరంబు । నాత్మలోఁదొలఁగింప
నాధియు వ్యాధియు । నంతరింప

సదసద్విచక్షణ । జ్ఞానంబు లభియింప
తాపత్రయాగ్ని బా । ధలు నశింప

గీ. వినుఁడు రామాయణామ్నాయ । మును సతంబు
చదువుఁడీ రామ చరితంబు । సంతతంబు
వ్రాయుఁడీ రామనామంబు । పామరులకుఁ
జెప్పుఁడీ రామపట్టాభి । షేక మహిమ.

గీ. విషయ సంతుష్టిఁబడయుఁబో । విషయభోగి
అధిక వైరాగ్యమున జ్ఞాని । యగు విరాగి
మోక్షమార్గంబునఁజరింపఁ । బోవుయోగి
శాశ్వతారోగ్యమును బొందఁ । జాలు రోగి.

సీ. కామ్యార్థమైన ని । ష్కామ్యంబుగా నైన
శ్రద్ధతో భక్తితోఁ । జదివి రేని
కాలంబు గడుపగ । గానముం జేసిన
నుబుసుపోకకు వ్రాయ । నోపి రేని
ఆపదల్ తొలఁగింప । నాలకించిర యేని
సంపదల్ సౌఖ్యముల్ । సంఘటిల్లు;

గీ. అఖిలభోగంబు లమరు ల । ట్లనుభవించి
అంతమున రామ సాయుజ్య । మంద గలరు;
ఆత్మ సంకల్ప సిద్ధికి । నాలవాల
మతుల రామాయణంబు ని । రామయంబు.

గీ. అధిక విషయ భోగాసక్తి । యంతరింప
భక్తి యుదయింప జ్ఞానియై । ముక్తిఁబడయ
బుద్ధి వికసింప సంకల్ప । సిద్ధిఁబడయ
రామ చరితంబు మించు మం । త్రంబు లేదు.

చం. అనుపమ ధర్మకర్మ మహి । మాన్వితరాముని సచ్చరిత్రమున్
వినినఁ బఠింప నేర్చినఁ బ । వితగతిన్ విరచింపఁజాలినన్
జనులు ధృతిన్ పరాపహృత । సంపదఁ గైకొన నోపి కార్యసా
ధనమున బుద్ధిమంతులయి । దాస్యముఁ దక్కి సుఖింతు రిభ్భువిన్

చం. పురుషవరుండు రాఘవుఁడు । మూలవిరాట్టు నృపాలకోటికిన్
ధరణితనూజ సర్వవని । తామణి కోటికి నాదిశక్తి; యీ
చరితము భక్తితో వినిన । సజ్జనకోటి పదాబ్జ ధూళి నా
శిరమునఁ దాల్చి భక్తి మెయి । ఁజేతులమోడ్చినుతింతునిచ్చలున్

ఉ. శ్రీహరి రాముఁడై యవత । రించి మునీంద్రులఁ బ్రోచి దైత్య సం
దోహము సంహరించె సుజ । నుల్ వినుతింపఁగ నంచు మొక్కి వ్యా
మోహము నుజ్జగించిన ప్ర । బుద్ధుల పాదసరోజ ధూళి సం
దేహముఁ దక్క శీర్షమున । నిత్యముఁ దాల్తు జగద్ధితార్థినై.

చం. అనియనిలాత్మజుఁడు విన । యంబునఁ బల్కినయట్టివాక్యముల్
వినిన హితుల్ పురోహితులు । విప్రులు భూపులు మంత్రిశేఖరుల్
మునితిలకుల్ మహర్షులు చ । మూపతులాప్తులు పౌరులెల్లరున్
అనుపమ భక్తితోడఁగొని । యాడిరి రాముని దివ్యరామునిన్.

గీ. యటుల విభునకుఁ బుష్పకం । బందఁ జేసి
దనుజ పతికెల్ల వానర । తల్లజులకు
విలువఁగల కానుకల నిచ్చి । వీడుకొలిపె;
నర్కకుల వర్యుఁడెల్లరు । నభినుతింప.

గీ. వాయుపుత్రుండు రాముని । బాయకుండ
కంటికిన్ రెప్ప కైవడిఁ । కమల నయన;
రామ పాదార వింద మ । రందపాన
మునను దీపించు ననిశంబు । ననిలసుతుఁడు.

కం. మనుజులు తనతోఁ బుట్టిన
యనుజుల యనియెంచి మాన । వాశనులగు న
ద్దనుజులఁ గూలిచి ప్రజ తన
తనుజుల యని రాఘవుండు । ధరఁ బాలించెన్.

ఉ. ప్రాణసమానుఁ డై ప్రజకు । భానుకులేంద్రుఁడు రాజ్యచక్రమున్
పాణితలంబు సంగొని కృ । పామతిఁ బౌరులఁ బ్రోచి, ధర్మసం
త్రాణధురీణుఁ డై వెలసె; । రాముని పాలనమందు నిత్య క
ళ్యాణముఁ బచ్చతోరణము । నై విలసిల్లె నయోధ్య యిభ్భువిన్

మ. స్థిరమార్గంబున ధర్మపద్ధతిఁ బ్రజన్ । శిక్షించి రక్షించుచున్
కరుణాంభోనిధి రామచంద్రుఁడు త్రిలో । కఖ్యాతి శోభిల్లగన్
ధరణీపాలన మాచరించెఁ ద్రిజగ । ద్ధర్మాసనాసీనుఁ డై
పరభూపాలశిరఃకిరీట మణులన్ । పాదాబ్జముల్ భాసిలన్.

గీ. రామరాజ్యంబు ప్రఖ్యాతిఁ । బ్రస్తుతింప
శక్యమా బ్రహ్మకైనఁ బ్ర । జానికాయ
మైకమత్యంబు న సుఖించె । నేకరీతి;
ఉచిత ధర్మప్రదాత య । య్యుర్వి నేత.

సీ. తాపత్రయంబులు । దారిద్ర్య దుఃఖంబు
లాకాశ కుసుమంబు । లాశ్రితులకు
భవరోగబాధలు । భయ సంకటంబులు
స్వప్న వృత్తాంతముల్ । పౌరకోటి
కన్యోన్యవైరంబు । లన్యాయ్యకార్యముల్
శశ విషాణంబులు । సకలజనుల
కన్యార్థ హరణంబు । లపసవ్య మరణంబు
లెండమావుల జలం । బెల్లప్రజకు

గీ. అందఱకు నవి నీతి వం । ద్యా ప్రసూతి;
ఎల్ల విధముల నెల్లరు । నేకరీతి
సౌఖ్యములఁబొందు చుండిరి; ని । స్సంశయముగ
పతిత పావన నాముని । పాలనమున.

ఉ. ఎల్లరు ధర్మకర్మరతు । లెల్లరు నిత్యపరోప కారకుల్
ఎల్లరు సత్యసాజ్నిరతు । లెల్లరు న్యాయ్యపథ ప్రవర్తకుల్
ఎల్లరు జ్ఞానమార్గచరు । లెల్లరు నిష్కపటుల్ గుణాధికుల్
ఎల్లరు సత్తముల్ రఘుకు । లేంద్రుని పాలనమందు పార్వతీ.

గీ. దుఃఖ భాగులు దుష్టులు । దుర్మదాంధు
లన్యభాగ్యోప జీవు ల । న్యాయ చరులు
జ్ఞానహీనులుఁ గనుఁగొనఁ । గానరారు
రామభద్రుఁడు పాలించు । రాజ్యమునను.

కం సరసులు చతురులు నిరతము
పరతత్త్వము లోనెఱుంగ । భావింతురు, స్త్రీ
పురుషులు స్వలాభ కాంక్షను
పరహింసకుఁ బాలుపడరు । స్వప్నంబుననేన్.

గీ. పతిత పావన నాముని । పాలనమున
అనుపమా నందమునుబొంది । యఖిల జనులు;
రాజ వరులెల్లరును రామ । రాజ్య మనుచు
సన్నుతించిరి సకల భూ । చక్రము నను.

సీ. ఫలపుష్పములతోడ । భాసిల్లి వృక్షముల్
కల్ప వృక్షంబుల । ఖ్యాతిఁబడయ
బహుభాండములు నిండఁ । బాలిచ్చి ధేనువుల్
కామధేనువు లన్న । ఘనతఁదనర

నిజకులా చారంబు । నియతిఁ దప్పక విప్రు
లవని దేవులనంగ । నతిశయింప
ప్రజలఁ గాపాడి భూ । భారంబు భరియించి
రాజు లహీనులై । రాణమీఱ

గీ. రాజ్య చక్రంబుఁ బాలించి । రామభద్రుఁ
డవని పతులకా దర్శకుం । డై రహించె
సర్వసమ భావ సామ్రాజ్య । సార్వభౌముఁ
డనుచు రాముని వినుతించి । రఖిలజనులు.

సీ. కుటిలత కామినీ । కుంతలంబుల యుండ
లేమి భామల మధ్య । సీమలుండ
మాంద్యంబు మగువల । మంద యానము లుండ
నిగ్రహంబరయ ని । ద్రియములుండ
అన్యుల వంచించు । టైంద్ర జాలికు లుండ
సంకటంబులు వైద్య । శాస్త్రముండ
భేదంబు పరరాజ । వీరబృందమునండ
దండంబు యతిభుజా । దండముండ

గీ. సామ దానముల్ పాలిత । జనులయంద
గానవగుఁ గాని మఱియొండుఁ । గానరాదు
రామ ! నిర్వక్ర విక్రమ । క్రమ నిరూఢి
రామభద్రుండు పాలించు । రాజ్యమునను,

గీ. ప్రజ పరస్పర వైరభా । వముఁ ద్యజించి
సంచరించె ననంగ నా । శ్చర్యమగునె ?
అఖిల పశువులు మృగము ల । న్యోన్య వైర
భావములఁ బాసె రాముని । పాలనమున.

సీ. సకల పుష్పములందు । మకరందముం గ్రోలి
మధుప సంతానంబు । మధువానంగ
ప్రజలు సమ్మోదింప । ఫల పుష్పముల నిచ్చె
లతలు వృక్షము లెల్ల । ఋతువు లందు
సమయానుకూల వ । ర్షములకు భాసిల్లె
సస్యభారంబుతో । క్ష్మాతలంబు
సకల లోహంబులు । సకల రత్నంబులు
జనులకుఁ గన్పట్టె । ఖనుల యందు

గీ. అఖిల గోమహిషంబు ల । హర్నిశంబు
పొదుగులం బాలు వెల్లుగ । బిదుకనిచ్చె
పావనాంబువులం గ్రాలె । జీవన దులు
పతిత పావన నాముని । పాలనమున.

సీ. ప్రజలను శాసింప । రచ్చకొట్టంబులు
పెరిఁగిన దోషాభి । వృద్ధిఁ దెలుపు
క్షితి వైద్యశాలలు । మితిమీఱి నెలకొన్న
బహుసంకటంబుల । వ్యాప్తి దెలుపు
పౌరుల బాధించి । పన్నులంబడసిన
ధరణిపు ధనతృష్ణ । సరణిఁ దెలుపు
ఆయుధాన్విత సైన్య । మభివృద్ధిఁ బొందిన
ప్రభువుల రణపర । త్వంబుఁ దెలుపు

గీ కారలెల్లెడ సంఖ్యాతి । గంబులైన
జారచోరుల యుద్వృత్తి । మేరఁ దెలుపు
ఇట్టివేవియుఁ గానరా । వినకులేంద్రు
పాలనంబున సర్వత్ర । ప్రభుతనూజ.

మ. జలయంత్రంబుల నిర్మలోదకముల । శాంతంబు దీపించు వా
నలు కాలానుగుణంబుగాఁ గురియు నా । నావస్తు సంభారముల్
గలవెచ్చోటికి నేగినన్ ప్రజలకున్ । క్షామంబు లేదీతిబా
ధలు గన్పట్టవు చండశాసనుఁడు శ్రీ । ధాముండు రాముండిలన్.

సీ. సరయూ నదికి నేగి । యరుణోదయముననే
  స్నానసంధ్యాద్యను । ష్ఠాన విధులఁ
జక్కఁగా నెఱవేర్చి । సభలోనికేతెంచి
  సింహాసనంబునఁ । జెలువు మీఱి
న్యాయాధిపతి నిర్ణ । యంబుల శోధించి
  ధర్మానుకూల ప । ద్ధతులఁ గూర్చి
పరభూమిపాలుర । వార్తల నాలించి
  క్రమముగ రాజకా । ర్యముల నరసి

గీ. ప్రౌఢపండిత గోష్ఠిలోఁ । బ్రతిభఁ జూపి
సర్వశాస్త్రార్థ సారంబు । సంగ్రహించు;
సర్వజన సమ్మతము లోక । సన్నుతంబు
రామభద్రుని నిత్య కా । ర్య క్రమంబు.

ఉ. స్నానము సేయుచుందురని । శంబుఁ బ్రజల్ సరయూస్రవంతిలో
ధ్యానము సేయుచుండ్రు నిర । తంబును రాముని నిష్ఠతో మహో
ద్యాన వనస్థ మందిరము । లందు వసించుచు నుందు రెన్నఁడున్
మానసమందు, చింత యను । మాటయెఱుంగరు మానినీమణీ

ఉ, జారులుఁ జోరులున్ ఖలులు । సజ్జనదూరులు లోకవంచకుల్
క్రూరులుఁ గానరారు జన । కోటికి; సాగరవాహినీ సర
స్తీరములందు సంతతము । ధీరసమీర విహారధీరులై
పౌరులు సంచరింతురన । పాయముగన్ గృహిణీ సమేతులై.

గీ. రామచంద్రు రాజ్యంబున । రాత్రులందు
పెక్కు రూపుల రేరాజు । వెలుగు నేమొ?
నిఖిల గృహముల వీధుల । నిరుపమాన
తైల హీనదీపంబులు । గ్రాలుచుండు.

ఉ. మార్గము లెల్లెడన్ సకల । మానవకోటికిఁ బుష్పశయ్యలే
దుర్గముఁజూచినన్ భటుల । తోవిలసిల్లుచు నుండు, శత్రురా
డ్వర్గము సంచలించు రఘు । వర్యుని నామము విన్న, నూతన
స్వర్గము రామరాజ్యమని । పౌరులు వాకొనుచుండ్రు పార్వతీ.

గీ. వాపులన్ తటాకంబులఁ । గూపములను
నిర్మలోదక మెవ్వేళ । నిండియుండు;
రామభద్రుని దివ్యసా । మ్రాజ్యమునను
తుచ్ఛజీవియుఁ గ్రోలుఁబో । స్వచ్ఛజలము.

కం. పురి కుత్తర దిక్తటమున
సరయూనది పాఱుచుండు । సతతముఁ; దీరో
పరి భాగంబతిరమ్యము
పరికింపఁగ నొప్పు నేత్ర । పర్వముగాగన్.

మ. సరయూ జీవనదీ తటాంచలమునన్ । సౌధావళుల్ దివ్యమం
దిరముల్ నందనతుల్య పుష్పవనముల్ । దేవాలయంబుల్ మనో
హరమున్నాశ్రమముల్ రహించుఁ బ్రజనా । హ్వానించుచున్నట్లుప
క్షిరవంబుల్ వినవచ్చు చుండు; నది భా । సిల్లున్ రమావాసమై

మ. సరయూద్వీప వతీతటాంచలమునన్ । సన్న్యాసులెవ్వేళ భూ
వరభూమీసుర సేవితాంఘ్రియుగళుల్ । వైరాగ్యసంపన్నులై
పరతత్త్వంబును జ్ఞానమార్గ సరణిన్ । భాషించి బోధించుచుం
దురు; శ్రీరాముని పాలనంబునఁ బ్రజల్ । దూరీకృతాఘౌత్కరుల్

సీ. చూడసొంపుగ శిలా । సోపానముల తోడఁ
బెక్కు రేవులు నదిన్ । వెలయుచుండు
నియమాను సరణిని । నిఖిల జాతుల వారు
స్నానపానాదు లో । నర్ప వలయుఁ
దోఁగుటకొక రేవు । తాగుట కొక రేవు
తక్కిన పనులకు । నొక్క రేవు
హరులకు నొక రేవు । కరులకు నొక రేవు
తక్కిన జీవుల । కొక్క రేవు

గీ. వరద వచ్చిన యప్పుడైన । బురదయుండ
దతి వినిర్మల జలముతో । నతిశయించు
నఖిల జీవుల కాధార । మై రహించు
నన్నదీ శోభ వర్ణింప । నలవి యగునె ?

ఉ. జీవనదీమతల్లి రఘు । శేఖరపాలిత జీవ కోటికిన్
జీవనదాయి పవిత్ర తుల । సీ వన శోభిత తీరమై జగ
త్పావనమై ఫలప్రసవ । భార వినమ్ర లతానికుంజభూ
జావన రమ్యమైన యన్నది వి । యన్నది యన్న యథార్థమేయగున్

గీ. అన్నదీ తీరమున నయో । ధ్యాపురంబు
రాజులనే రామ భద్రుని । రాజధాని;
ఋషివరేణ్యులు పురమున । కేగుదెంచి
రామచంద్రుని దర్శించి । ప్రస్తుతింతురు.

ఉ. క్షేమమనంగ నెట్టిదో ప్ర । జా సముదాయమెఱుంగ దెల్లెడన్
క్షేమము సర్వజీవులకుఁ । జేకురెఁబౌరుల యందు సద్గుణ
స్తోమము వృద్ధిఁబొందె గుణ । దోషవిచారమునన్ ఘనుండు శ్రీ
రాముఁడుఁ చండశాసనుఁడ । రాజక నాశనుఁడెల్లవేళలన్

కం "సత్యం వద ధర్మంచర"
నిత్యమ్మను వేదవాక్య । నియమముఁ గలనేఁ
భృత్యుండును దప్పడు; దౌ
ర్గత్యముఁగనరాదు రామ । రాజ్యము నందున్.

కం. సాధ్యుఁడు సద్భక్తులకు న
సాధ్యుఁడు పరరాజవీర । సైన్యంబున కా
రాధ్యుఁడు మునీంద్ర రాజికి
బాధ్యుఁడు భువిఁబ్రోవ; రామ । భద్రుఁడు నరుఁడే.?

శా. మాయామేయగుణాభిరాముఁడు జగ । న్మాన్యుండు సామాన్యుఁడే
మాయా మానుషచర్యలందు ఘనుఁడై । క్ష్మామండలాఖండలుం
డై యాగంబులఁ జేసి రాఘవుఁడు రా । జ్యంబేలె రా జాననా
న్యాయాన్యాయవిచారదక్షుఁడనుచున్ । న్యాయాధిపుల్ మెచ్చఁగన్

ఉ. అంబరచుంబితాంబర జ । య ధ్వజ బద్ధహయంబు దేశ దే
శంబుల సంచరింప ముని । సంచయ మానన నశ్వమేధయా
గంబులఁ జేసి రాముఁడు జ । గంబున ఖ్యాతిని బాదుకొల్ప స
ప్తాంబుధివేష్టితావని జ । నాధిపులెల్లరు సన్నుతింపఁగన్.

మ. పతిశుశ్రూషకు లోప మించుకయినన్ । వాటిల్లకుండన్ పతి
వ్రతసాధ్వీమణి సీతయంచు విబుధ । వ్రాతంబు కీర్తింప సం
తతమున్ రాముని పాదపద్మయుగళిన్ । ధ్యానించి సేవించె శ్రీ
సతి పృథ్వీసుత సాటి బోటి గలదే । క్ష్మామండలిన్ పార్వతీ

గీ. దాసదాసీ జనవ్రాత । భాసురంబు
రాజ గృహమంచునే మహా । రాజ్ఞిననుచు
అతిశయంబున మెలఁగక । యవని పుత్త్రి
నిత్యమున్ జేయుఁబో గృహ । కృత్యములను.

కం. అత్తల కనురాగంబిగు
రొత్తఁగ మఱఁదులకు భక్తి । యుల్లంబులరే
కెత్తగ బాంధవ కోటికిఁ
జిత్తంబులు పల్లవింప । సీత మెలంగెన్.

గీ. నృపవరుఁడు రాముఁడేక ప । త్నీ వ్రతుండు
జానకి మహా పతివ్రత । సచ్చరిత్ర
పుత్త్రిలన్ గాంచిరుభయుఁ । బుణ్యఖనులఁ
కోటి మన్మథా కారులఁ । గుశలవులను.

కం. క్షితి నేలుచు సజ్జన నుత
సతి నేలుచు సన్మునిందరి । సంపోషితులన్
సుతులన్ బడసి రఘూద్వహుఁ
డతులిత గతిఁగాంచె లోకు । లామోదింపన్.

మం. గుణవంతుల్ మతిమంతులుత్తములులో । కుల్ మెచ్చఁగన్ సర్వల
క్షణసంపన్నులు శౌర్యధైర్యనిలయుల్ । గంభీర భావాధికుల్
రణధీరుల్ వివిధా యుధాస్త్ర నిపుణుల్ । రాజీవ పత్రేక్షణుల్
పరిణతింగాంచిన రామభద్రుని సుతుల్ । భావింపసామాన్యులే.

గీ. భరతునకుఁ దక్షకుఁడు పుష్క । లుఁడనంగ
అంగదుఁడు చిత్రకేతువ । నంగ లక్ష్మ
ణునకు శత్రుఘ్నుఁడు సుబాహు । వనఁగఁదనరు
సుతులు శత్రుఘ్నునకుఁబుట్టి । రతుల బలులు.

గీ. జ్యేష్ఠుఁడనుచు భాస్కరకుల । శ్రేష్ఠుఁడనుచుఁ
దమ్ము లనుఁగుఁదమ్ముల నిరం । తరముఁగొలువ
ప్రజలు హర్షింపఁ బాలించె । రమ్యగతిని
అద్వితీయుండు శ్రీరాము । డది తనయ.

కం. పదొకండు వేల వర్షము
లుదయార్కుని లీలఁగాంచి । యుక్తవిభవుఁడై
సదయుఁడు రాముఁడు ప్రజక
భ్యుదయముగా రాజ్యమేలె । నుత్తమసరణిన్.

కం. జగదాది శక్తి జానకి
ముగురమ్మల మూల కంద । ము; యథార్థముగన్
జగదీశుని శ్రీరాముని
భగవంతునిఁ బాయలేక । వసుధ జనించెన్.

కం మంగలియో చాకలియో
వెంగలియో యొక ఖలుఁడవి । వేకమునన్ పు
ణ్యాంగనలను దూషింపఁగ
నంగదఁ జేకూర్ప లోన । నాసక్తిఁ గొనున్.

గీ. ఉత్తమోత్తములైన లో । కోత్తరులను
చెలఁగి లోపంబు లెంచి దూ । షించుటకును
ప్రతియుగంబునఁ గొందఱు । పాపులుంద్రు
కలియుగంబున నత్యధి । కముగనుంద్రు,

గీ. శుక్ల పక్షద్వయంబున । శోభిలంగ
అఖిల దిక్కుల కరుగంగ । నర్హతఁగల
నన్ను మీఱఁజాలునె ని శా । నాథుఁడనుచు
బకము చంద్రునిఁబరికించి । పరిహసించు.

గీ. అల్పుఁడగు మూఢుఁడార్యుల । యందు లేని
లోపములఁ గొన్ని చూపించి । లోకమునను
అర్హుఁడై యుండుఁబో పరి । హాసమునకు
మూఢచిత్తుని వాక్యంబు । రూఢిఁగను నె.

మ. ఖలులన్ ధర్మవిరుద్ధవర్తనుల లో । కద్రోహు లంగూల్చిభూ
వలయోద్ధారకులై నయుత్తములు "దే । వానాంప్రియుల్" కొంద ఱ
య్యాలు నిందింపఁగ లోపముల్ వెదకి రం । ధ్రాన్వేషణ ప్రజ్ఞ మె
ప్పులకై చూపిన యంతమాత్రమున నా । మోదించు వారుందురే

కం. తనజనని జలధి యగుటను
వనితామణు లెల్ల సట్టి । వారను మతితో
జనకజ చరితముఁ దెగడఁగ
వెనుదీయని లంజ కొడుకు । వెంగలి గాఁడే ?

గీ. రాఘవుని మోసపుచ్చంగ । రావణుండు
కపట వైఖరిఁ బంపించెఁ । గనకమృగము
రావణుని మోసపుచ్చంగ । రాఘవుండు
అడవిలో మాయ సీతను । విడిచి చనియె.

గీ. విష్ణుమాయకు లోఁబడి । వెంగలీఁడు
రావణుఁడు మాయ గొంపోయె । రమణి యనుచు
దైత్యనాథాపహృతమైన । తరుణి యెవతె
సీతయా లేక మాయయా । చెప్పు మిపుడు.

గీ. మూఢులెల్లరుఁ గలిలోనఁ । బ్రౌఢులగుచు
వ్యర్థవాగ్ధాటిఁ బ్రకటించి । ప్రబలుచుండ్రి;
లోకమునకెల్ల నొక్కసు । శ్లోకుఁడున్న
లోపములఁ జూపి నిందింత్రు । పాపమతులు.

గీ. దైవ విశ్వాస హీనులు । లధర్మపరులు
అన్య భాగ్యోప జీవులు । నన్యోన్యవిముఖు
లన్య కాంతానురక్తులు । న్యాయచరులు
కలియుగంబున సత్యధి । కముగ నుండ్రి.

కం. పరదారాసక్తులకున్
పరహింసకుఁ జాలుపడిన । పాపాత్ములకున్
పరధర్మకర్మపరులకు
పరనిందారతులకు సిరి । వర్ధిలుఁ గలిలో.

గీ. సాధుజనులకు ఘనులకు । జ్ఞానులకును
కలియుగంబున నిలువఁగ । స్థలము లేదు;
పిడి దూరులకున్ ద్రాగు । బోతులకును
కలియుగంబునఁ జేకూరు । గౌరవంబు.

గీ. ఆకట పణ్యాంగనలకుఁ బు । ణ్యాంగనలకు
భేదమించుకయున్ గాన । రాదు కలిని
త్రాగుబోతులు బోధింత్రు । ధర్మములను
పణ్యలు చెలంగి వినిపింత్రు । పుణ్యకథలు.

ఉ. వేదవిరుద్ధవర్తనము । విప్రులు గైకొని యాత్మవిద్యలం
దాదర భావమున్ విడిచి । యన్యుల పాదములాశ్రయించి, భా
గ్యోదయకాంక్షను దవిలి । యుత్తమ నీతిఁ బరిత్యజింత్రు శి
శ్నోదరపోషణంబునకు । నుర్వి జనించిన యట్టు లెంచుచున్.

గీ. కలియుగంబున విప్రులి । క్కరణి నుండ
నన్యులం గూర్చి భాషింప । నలవియగున ?
పతితపాషండ కుటిలస్వ । భావులకును
నిలయమై యుండు నిరతంబు । కలియుగంబు.

గీ. మానముల విక్రయింతురు । మానవతులు
వేదముల విక్రయింతురు । విప్రవరులు
ధర్మముల విక్రయింతురు । ధర్మవిదులు
కలియుగంబెల్లఁ గడచువి । క్రియము తోడ.

మ. నరపాలాన్వయముల్ క్రిమక్రిమముగన్ । నామావశిష్టంబులౌఁ
పరదేశీయ మతప్రభావమున న । బ్రాహ్మణ్య మేపారెడిన్
పరమార్థంబుఁదలంచి సత్పురుషుఁడె । వ్వండేని వర్తించినన్
భరమై తోఁచుఁ గుటుంబరక్షణము సం । భావింపఁగా నుష్కలిన్

కం. కోపాటోపోద్ధత దు
ర్వ్యాపారులు లోకాపకారు । లత్యాచారుల్
తాపత్రియ పతితప్తులు
పాపాత్ములు పాపభవులు । పామరులు కలిన్.

సీ. నాస్తిక వాదులు । న్యాయవాదుల మించు
న న్యాయమున్ న్యాయ । మనివచింత్రు
పరవేషభాషల । బ్రకటించి ప్రజలను
వంచించి వైద్యులు । వఱలుచుండు
రాజ భక్తుల మించు । రాజ సేవకు లెల్ల
పేదల హింసించి । వెలయుచుండ్రు
ప్రజల మంతుల జేసి । పాషండ పాలకుల్
బాధించి సాధించి । ప్రబలుచుండ్రు

గీ. పెద్దలఁ దిరస్కరింతురు । పిన్నలెల్ల
తల్లిదండ్రుల దండింత్రు । తనయు లకట
బాలురు గతింత్రు వృద్ధులు । బ్రతికియుంద్రు
కలుష నిలయంబు భావింపఁ । గలియుగంబు.

కం. శిష్టులఁగనిదూషించెదు
దుష్టులఁ గొనియాడు నట్టి । దుర్మతులకు ధీ
భ్రష్టులకు నికృష్టుల కతి
కష్టులకున్ కన్నతల్లి । కలియుగమకటా!

కం. వైరాగ్యము వినశించును
ఆరోగ్యము సన్నగిల్లు । నాయువు తఱుఁగున్
దారాసుతపోషణ మతి
భారంబుగనుండుఁ గలిని । ప్రజలకు గిరిజా.

కం. కుల ధర్మముఁ బాటింపరు
కుల వృత్తులనేవగింతు రి । కులపతు లకటా
కుల బలను గౌరవింతురు
కలికాలమునఁదలఁప రాకు । కలలోనైనన్.

కం. కామాంధులు పరకాంతా
ప్రేమాంధులు కలియుగమున । విహరింత్రు పటు
వ్యామోహాంబున నెఱుఁగరు
రామాయణ నామ కావ్య । రత్నము గిరిజా

ఉ. ఓషధు లందు నెట్టి గుణ । ముండదు, రోగికి వైద్యుఁడెట్టి సి
ద్ధౌషధ మిచ్చినన్ తుదకు । వ్యర్థమగున్; పవనోద కంబులున్
దోషమయంబులై ప్రజల । దుర్బల దేహులఁజేయు; నంతటన్
ద్వేషము నిండియుండు; నిగ । దింపఁగరాదు కలిప్రభావమున్.

సీ. ధర్మంబు ప్రవ్రజి । తంబగు (బ్రి)చలిత
మగును దపంబు, స । త్యము నశించు
వసుధా తలంబెల్ల । ఫల శూన్య మైయుండు
బ్రాహ్మణు లందు గౌ । రవము తొలఁగు
సకల సంపదలును । శాత్వోర్జితములగు
నధిపతు లధికార । నవయుచుండ్రు
సోదర పోషణం । బుత్త మోత్తమమగు
సోదర భావంబు । శూన్యమగును;

గీ. సాధుబాధయు నోహింప । సతముసుండు
గోచరము లైనభూము ల । గోచరంబు
లగును ధనకాంక్ష యత్యంత । మధికమగును
ఏమి చెప్పఁగఁ గలియుగం । బిట్టులుండు.

గీ. విటులు నటులును వేశ్యాని । వేశములను
భటుల కైవడి నుందురు । పట్ట పగలు
కుల సతుల యిండ్ల కేతెంతు । రలలుకట
గానమును నేర్పు నెపమునఁ । గలియుగమున.

కం. పురుషుల నాకర్షింతురు
తరుణులు శృంగార వేష । ధారణ కలనన్
తరుణుల నాకర్షింతురు
పురుషులును వికార వేష । ముల మూలమునన్.

శా. ఆర్యుల్ దుర్బలులై వివాదపరులై । యన్యోన్య విద్వేషులై
ధైర్యస్థైర్య విహీనులై పరులకున్ । దాసత్వమున్ జేసి దు
ష్కార్యాసక్తిఁ జరింతు రీ దుర్వ్యసనసం।సర్గంబునన్; దుష్కలిన్
ఆర్యావర్తము సారహీనమయి య । న్యాక్రాంతదేశంబగున్.

కం. కలిలో భగవన్నామముఁ
దలఁచిన మోక్షార్థులగుట । తథ్యము; యన్నా
ర్తులు కామార్తులు రాముని
దలఁపఁగ నవకాశమేది? । తరుణీ చెపుమా.

ఉ. పావనవేషధారులయి । వంచకు లెల్లరు సంచరింతు రీదే
శావనకార్య దీక్షఁగొని । నట్టి మహాత్ముల భంగి స్వార్థచిం
తావిలచిత్తులైన కుటి । లాత్ములు లోకమునన్ వినాశకా
లే విపరీతబుద్ధి యను । లీలఁ జరించి నశింతు రీదుష్కలిన్ .

గీ. గతయుగంబుల మడసిన । ఖలుల నెల్ల
కలియుగంబునఁ బుట్టించుఁ । గమల భవుఁడు;
దేశమున కెల్ల ధర్మోప । దేశ కర్త
లక్కడక్కడ లెక్క కొ । క్కొక్కఁడుండు.

గీ. కలియుగంబున జను లుప । కారమునకుఁ
బాలుపడరెందు నిష్కామ । భావమునను;
స్వార్థచింతా పరత్వ సా । ధ్యాంతరమునఁ
జనువు కొనినట్టి పెద్దలు । సంచరింత్రు.

కం. కలి దోషముఁ దొలఁగింపఁగ
కలికాలము నందు ధర్మ । కర్మము లెలమిన్
వెలయించి కలిమిఁ బడయఁగఁ
బలువురు రామాయణంబుఁ । బఠియింప వలెన్.

గీ. కుజన సాంగత్యముఁ ద్యజించి । సుజనుఁ గూడి
ధర్మమార్గంబునఁ జరించి । దైవ మెఱిఁగి
పరమ పావన మైన జీ । వనముఁ బడయ
ననిశముఁ బఠింప వలయు రా । మాయణంబు.

ఉ. దేశము నుద్ధరింపఁగ గ । తించిన సంపద సంగ్రహింప ను
ద్దేశముఁ గల్గి రాఘవుని । దివ్యకథన్ పఠియించు సజ్జనుం
డాశయముల్ ఫలింపఁగ మ । హాత్ముఁడనంగ యశంబుగాంచి ల
క్ష్మీశుకృపన్ రహించు విజ । యేందిర తోడ జగన్నుతంబుగన్.

ఉ. పాయని శ్రద్ధతోడ రిపు । వర్గము లోఁగొన నొంచియాది నా
రాయణుఁడంచు రాముని ని । రంతరమున్ హృదిఁ బాదుకొల్పి, పా
రాయణ యోగ్యమైన దని । యాత్మఁ గడుంగడు విశ్వసించి రా
మాయణమున్ పఠించిన మ । హాత్ముఁడు రాముని యంతవాఁడగున్

ఉ. దారుణ రోగ వహ్నిపరి । తప్తులు శ్రద్ధవహించి రామునిన్
కారణ జన్మునిన్ గొలిచి । కారుణికోత్తముఁడంచుఁదత్కథా
సారము భక్తితోఁ జదువఁ । జాలిన రోగ విముక్తిఁగాంతు రె
వ్వారయినన్; యథార్థమిది । ప్రాజ్ఞుల వాక్యము రిత్తవోవునే?

మ. అరయన్ చంద్రుఁడోషధీశుఁడను ప్ర।ఖ్యాతిన్ ప్రకాశించు, భా
స్కరుఁడారోగ్యము సంగు దేవత యనం।గా భాసిలున్; వీరలి
ద్దరు నేత్రంబులు రామభద్రునకు; నా । రోగ్యంబుచేకూరుఁ ద
చ్చరితాంభోనిధి లోనఁదోఁగి జను ల।శ్రాంతంబు భావించినన్

కం. సదయుని రాముని చరితముఁ
జదివిన వ్రాసిన వినినను । శ్రద్ధా సక్తిన్
హృదయంబున భావించిన
సదసద్‌జ్ఞానం బొదవును । జనులకుఁగలిలో

కం. భూత ప్రేత పిశాచ
వ్రాతంబుల బాధ తొలఁగు । రామాయణమున్
ప్రీతిన్ జదివిన వినినన్
ఖ్యాతిన్ వ్రాసిన జనులకుఁ । గలి కాలమునన్.

కం. వైరాగ్యము సౌభాగ్యము
ఆరోగ్యము వృద్ధిఁబొందు । నాయువు హెచ్చున్
శ్రీరాముని చరితంబున
సారాంశము సంగ్రహించు । సజ్జన తతికిన్.

గీ. భవ్య రామాయణా మ్నాయ । పఠనమునను
మానవతులను నతుల సం । తానవృద్ధి
చిత్త సంకల్ప సిద్ధి సు । శ్రీసమృద్ధి
పురుషవరులకుఁ జేకూరుఁ । బూవు బోఁడి.

ఆ. వె. రమ్యమైనదెద్ది । రామాయణము కంటె
రామభద్రుఁబోలు । ప్రభువెవండు?
ప్రీతి రోత యనెడి । ప్రాసుడి చెల్లదు
రామ చరితమునకు । రాజ వదన.

కం. నూతనుఁడే రాముఁడతి స
నాతనుఁడగుఁగాక కవుల । నారతమున్ ప్ర
ఖ్యాతిఁగొన సంప్రీతిని
ఆతని కథ పల్కుచుందు । రావేశమునన్.

ఆ. వె. మత్స్య మాంస మద్య । మైథున లాలసుల్
పరులమోసపుచ్చి । సిరులఁబడసి
దుర్మదాంధులైన । దుష్కర్మనిరతులు
మనుజులెల్ల దనుజు । లనఁదప్పె ?

సీ. ఒక్కమొగినట్టి దనుజుల । ఁజక్కఁజేసి
ధర్మ మార్గంబుఁగాపాడు । ధర్మ పురుషుఁ
డన్నియుగముల లోన రా । మాయణంబు
మహిని దీపించు శ్రీరాము । మహిమ వలన.

చం. సనకసనందనాది ముని । సత్తమ సన్నుత సత్కథా సుధా
వననిధి లోనఁదోగి భువిఁ । బండిత పామరులైన వారు పా
వనులయి పాప పంక భవ । వార్ధిఁదరించి సుఖింప రామ భ
ద్రుని చరితంబు భక్తిమెయి । రూఢిగఁబల్కితి శైలరాట్సుతా.

మ. ఇదిరామాయణమాదికావ్యమని బ్రహ్మేంద్రాది దిక్పాలకుల్
త్రిదశుల్ మానులు బ్రాహ్మణుల్ కవులు కీర్తింపంగనానాటిక
భ్యుదయంబొందెఁగథా సుధాలహరితో । నొప్పారుచున్ సర్వకా
మదమై పావనమైరహించెఁబరమా । మ్నాయంబు చందంబునన్.

ఉ. శీర్షము వంచి మ్రొక్కి రఘు। శేఖరు నిత్యము సంస్మరింపఁగా
హర్షమునన్ జగన్నుత మ।హామహిమాన్విత సత్కథా సుధా
వర్షము నీపయిన్ గురియఁ।బల్కితి శాశ్వత కావ్య రత్నమున్
ఆర్షము సర్వవీరవిను । తాద్భుత వీరరసప్రకర్షమున్.

గీ. వర్ణనీయ రామాయణా । కర్ణనమున
ఆర్య వర్యులు వినుతింప । నార్యవైతి
సందియముఁ బాసి డెంద మా । నంద మొంద
సంస్మరింపుము శ్రీరాము । సార్వభౌము.

గీ. సగుణ రాముని వినుతింప । శక్యమగునె
అతని సుగుణంబులన్ సహ । స్రాంశ మేని
దెలిపితినొ లేదొ నీకు సం । దేహమున్న
నడుగుమా యన్న శివున కి। ట్లనియె గౌరి.

కం. సరసుఁడు చతురుఁడు రాముని
చరితముఁ వర్ణించి తనియఁ । జాలఁడు, శివశం
కర శబ్దంబులు సార్థక
బిరుదంబులు నీకు రామ । భృత్యుఁడ వగుటన్

గీ. అనుపమానంద కందళి । తాంతరంగ
నైతి రామాయణంబు నే । నాలకించి;
తనివిదీఱక యున్నది । వినిన కొలఁది;
రాముని న్నిన్ను నిరతంబుఁ । బ్రస్తుతింతు.

కం. శక్తి కొలందిని యత్యను
రక్తిన్ సుకవి ప్రణీత । రామాయణమున్
భక్తులు వినినన్ జీవ
న్ముక్తులు గాకేమి సుజన । పూజిత చరణా.

కం. శ్రవణా నందంబుగ రా
ఘవు చరితము (బలికితివి జ । గన్నుతశైలిన్;
భవవార్ధి దాటి మోక్షం
బవలీలంబడయ వచ్చు । నాలించి జనుల్.

కం. లాలించి నన్నుఁ బ్రేముడిఁ
బాలించి వచించినట్టి । వరగుని చరితం
గాలించి నెమ్మనంబునఁ
దూలించితి దోషరాశిఁ । దూలములీలని

శా. నాథా ! నీకరుణా విశేషమున సు । జ్ఞానాంబు ధిన్ గ్రుంకితిన్
వ్యాధుల్ సంసరణవ్యథల్ తొలఁగ బ్ర । హ్మానంద ముప్పొంగఁగా
బాధల్ తీఱగ మోక్షరాజ్య పదవిన్ । భాసిల్ల గాఁ బ్రాజ్ఞు లా
రాధింపందగు భక్తితో నిరతమున్ । రామాయణామ్నాయమున్

గీ. సద్యశస్స్ఫూర్తి లోకైక । చక్రవర్తి
సచ్చిదానంద మూర్తి మ । త్స్వాంతమునను
సంతతము నిల్పి యుండంగ । సచ్చరిత్ర
మాలకించితి నే ధన్య । రాలనైతి.

శా. మాత్సర్యంబు మదప్రభూతమగు ధీ । మాంద్యంబు విభ్రాంతియున్
సత్సాంగత్యమునన్ తొలంగు నపుడే । జ్ఞానప్రబోధాత్మలై
ఉత్సాహంబున రాముఁగొల్చెదరు; భ । క్త్యుత్సాహ వర్ధిష్ణులన్
వాత్సల్యంబునఁ జూచు శ్రీవరుఁడు జీ । వన్ముక్తులం జేయఁగన్"

చం. అనవిని శంకరుండు దర । హాసము మోమునఁ దోప శైలరా
ట్తనయను గౌఁగిలించె; గుణ । ధాముని రాముని సన్నుతించుచున్
దనియక రామనామ సుధ । ధ్యానసమాధినిఁ గ్రోలి సోలి పా
వనులయి రాది దంపతులు । బ్రహ్మ సురేంద్ర నరేంద్ర కోటికిన్.

గీ. వేద శాస్త్ర పురాణాది । విద్య లేల?
ఒక్క రామాయణము చాలు । నుత్తములకు;
పార్వతీ పరమేశ్వరుల్ । వరమునీండ్రు
లీ చరిత్రంబుఁ బఠియింతు । రెల్లవేళ.

ఉ. సారవిచారధీరులగు । సజ్జను లున్ జనులున్ భ్రమించి సం
సారము సారవంతమని । స్వాంతములన్ దలపోయకుండ సీ
తారఘురాము దివ్యచరి । తంబుఁ బఠించి నుతించిరేని దు
ర్వారవిపత్పరంపరలఁ । బాసి సుఖింతు రబోధితాత్ములై

మ. వరదుండాద్యుఁడు శంకరుండు కవిరా। డ్వంద్యుండు శ్రీరామ స
చ్చరితంబున్ నిగదించె శైలసుత కున్ । స ద్భక్తితో నంచు దు
స్తరసంసార పయోధిదాఁటఁ, దులసీ । దాసుండు శ్రీరామరా
ట్చరణాంభోరుహ దాసుఁడై నుడివె భా। షాబద్ధ సత్కావ్యమున్

శా. వ్యామోహాపహమై మహాకలిమల । ప్రధ్వంసనై కామధం
బై మోదప్రదమై సదా శివకరం । బై స్వచ్ఛమై నిర్మల
ప్రేమాంబః పరిపూర్ణమై భవరుజా । తృష్ణానిదాఘఘ్నమై
శ్రీమద్రామచరిత్రమానసము భా । సిల్లున్ రమావాసమై

మ. పరభూపాల పరాక్రమ క్షుభిత భూ। భారావ నోదార్థమై
సురసంప్రార్థితుఁడై నరేంద్రసుతుఁడై । సూర్యాన్వయోద్భూతుఁడై
పరులన్ ద్రుంచి యథాప్రకారముపర । బ్రహ్మత్వమున్ బొంది సు
స్థిరకీర్తిధ్వజుఁడైన చిన్మయు హరిన్ । శ్రీరాము ధ్యానించెదన్.

కం. అని తులసీ దాస మహా
ముని వర్యుఁడు, శంకరుండు । భూధరసుతకున్
వినిపించినట్లు నుడివెన్
జననుత రామాయణంబు । సంపూర్ణముగన్.

కం. భువిఁదులసీదాస మహా
కవి వర్యుఁడు నుడివి నట్టి । కావ్యంబు సదా
శివసన్నుత చరితము భా
గవతుల నరసింహ శర్మ । కవి తెనిఁగించెన్.

మ. తులసీదాసుఁడు ఖ్యాతిఁగొన్న కవిచం।ద్రుండో ఋషీంద్రుండో వాని
స్తుల రామాయణ కావ్య రాజమును ని।ర్దుష్టంబుగాఁబల్కి భ
క్తుల నానందపయోధిఁదేల్చి తనవా।క్కుల్ బుక్కులంబోల నీ
తులధర్మంబులఁదెల్పెభూపులుకవీం।ద్రుల్ పండితుల్ మ్రొక్కఁగన్

కం. తులసీ రామాయణమును
పలికితి శ్రీరామ మూర్తి । పలికింపఁగ నేఁ
బలికిన దొప్పొ తప్పో
తలపోయుఁడు బుద్ధికొలఁదిఁ । దత్త్వజ్ఞులిలన్.

మ. పదునాల్గేండ్లకుఁ బూర్తిఁజేసితిని నా । పాండిత్య మేపాటిదో
సదసద్జ్ఞాన మదెట్టిదో సుకవి తా।సామర్థ్య మేరతిదో
హృదినొక్కించుకయున్ దలంపక ధృతిన్ । శ్రీరామనామంబు నె
మ్మదిధ్యానించుచుఁబూనుకొంటిఁగృతిని।ర్మాణంబుఁగావింపగన్

కం. కష్టంబని యోచింపక
నష్టంబులు సంభవించి । నన్ జంకక ధీ
భ్రష్టుండ నయ్యునెట్లో
స్పష్టంబుగ వ్రాసినాడ । సత్కావ్యంబున్.

ఉ. నారచనా విధానము జ। నప్రకర ప్రమద ప్రధానమై
సూరుల కింపునింపు; పర। సుల్ నెఱసుల్ కవితన్ గణింపఁగా
బోరనినే నెఱుంగుదును; । పుణ్యకథాసుధఁగ్రోలు సద్గుణో
దారులు రామభద్రు చరి।తంబని మైన సమాదరింపరే.

ఉ. పాడినపాటఁ బాడితివి । ప్రీతి పఠింపఁగ రోతయంచు నో
నాడుట పాడిగాదు సుకృ । తాత్ములొకించుక లోఁదలంచి మా
టాడుఁడు; రాముఁబోలిన మ । హామహిమాన్వితుఁడైననాయకుం
డేడి ? మఱొక్కరుండు జని । యించునె శాశ్వతకావ్యసృష్టికిన్

ఉ. ఏతదమోఘకావ్యము మ । హిన్ విలసిల్లుచు నుండు నెన్నఁడున్
ప్రీతదసంగరా దతిపు । రాతన వృత్తమ యయ్యు నిత్యమున్
నూతనమై రహించును, మ । నోహరమైయెసఁగున్ యథార్థమై
ఖ్యాతికి నెక్కు రామచరి । తామృతమున్ నిరసింపఁడెవ్వఁడున్

చ. ప్రతిదిన మన్నమున్ దినిన । వానికి రోత జనించు నొక్కెయ
ప్రతిహత సుప్రసిద్ధరఘు । రాముని దివ్య చరిత్రమాత్మకున్
ప్రతిదిన మన్నమైయెసఁగు । భక్తులెఱుంగుదు రీ రహస్యమున్
మతి గతి దప్పినట్టి పులు । మానిసి కెట్టు లెఱుంగ నయ్యెడిన్

ఉ భూపులు లేరె నేఁడు పువు । బోఁణులఁబట్టి బలాత్కరింపఁగా
పాపులు లేరె సాధుజన । వంచకులై సిరులన్ హరింపఁగా
ద్వీపులు లేరె దుర్బలుల । దేశమునాశముఁ జేయ; లోకసం
తాపమణంప రామచరి । తంబుఁ బఠించు మహాత్ముఁడెవ్వఁడేన్

ఉ. రాముని వర్తనంబు రఘు । రాముని యుత్తమరాజనీతి (శ్రీ)
రాముని కార్యదీక్ష రఘు । రాముని యింద్రియ నిగ్రహంబు (శ్రీ)
రాముని వాక్యశుద్ధి రఘు । రాముని నిశ్చల చిత్తవృత్తి సు
స్థేమమునన్ గ్రహింప వలె । శిష్టుల దుష్టులఁ జక్కఁజేయఁగన్

ఉ. ధీమహిమాఢ్యుఁడై తనదు । దేశము లోకము నుద్ధరింప (శ్రీ)
రామచరిత్రమున్ జదివి । రాముని వర్తనమున్ గ్రహించి సు
క్షేమము పాదుకొల్పి పరి । కీర్తిత ధర్మము నిల్పి సజ్జన
స్తోమము సన్నుతింబడసి । శోభిలఁడే మహనీయుఁడొక్కఁడేన్.

ఉ. అక్షర ధర్మకర్మ మహి । మాధ్యు చరిత్రము నన్యభాష నా
లక్షరముల్ పఠించిన జ । డాత్ములెఱుంగరు గాక ధర్మ సం
రక్షణ దక్షుఁడైన రఘు । రాము చరిత్రము దేశనాయకా
ధ్యక్షుఁడు కర్మచంద్రుఁడు మ । హాత్ముఁడెఱుంగుఁ బఠించు నిత్యమున్

గీ. తమగృహాచరిత్రంబుఁ । దలఁప కుండ
నన్యులచరిత్రముఁ బఠించి । ధన్యులమని
ఉదర సంపోషణార్థమై । యుర్వి మెలఁగు
బానిసలకు రామాయణ । పఠనమేల?.

కం. దైవమని విశ్వసింపుఁడు
భావింపుఁడెదని మహాను । భావుండని సం
సేవింపుఁడుత్తముండని
శ్రీవరు శ్రీరామభద్రు । సీతానాథున్.

మ, అనఘుల్ ప్రాజ్ఞులు పల్కరో "సుకవితా । యద్యస్తి రాజ్యేన కి
మ్మ"ని; యయ్యుక్తికి నర్హతంబడయ న । త్యాసక్తి దీపింపనే
ర్చిన యట్టి కృతిరత్నమున్ బలికితిన్ । శ్రీరామనామాంకితం
బనియైనన్ జను లాదరింతురు గదా । యాంధ్రావనీమండలిన్

గీ. గంగలోఁ దోఁగి విశ్వేశు । కరుణఁ బడసి
ఉత్తమక్షేత్రమైన య । యోధ్యకేగి
రత్న సింహాసనాసీను । రాముఁ గొలిచి
కృతిసమర్పించితిన్ నమ । స్కృతులతోడ.

ఉ. తోయముఁ జూచినన్ సకల । దోషములన్ హరియింపఁ జేయు గం
గాయమునా సరస్వతులఁ । గాంచి నమస్కృతులిచ్చి మున్ని యా
ప్యాయముతోడ మాధవుప । దాంబుజ హృద్వయమున్ భజించి రా
మాయణ మిచ్చితిన్ రఘుకు । లాంబుధిచంద్రునకయ్యయోధ్యలో

శా. లోకాలోక పరీతభూతలమునన్ లోకుల్ ప్రశంసింప శు
శ్లోకంబైన భవచ్చరిత్రమును ప్రాజ్ఞుల్ పండితుల్ పామరుల్
ఆకర్ణింపఁబఠింప నాంధ్రకవితా వ్యాపారమేపారఁగన్
నీకారుణ్యము ప్రాపునన్ బలికితిన్ శ్రీరామ, భక్తావనా.

శా. ఆరంభించినదాది కష్టములతో నాటంకముల్ వచ్చినన్
దారిద్ర్యంబు ఘటిల్లినన్ సతము సంతాపాగ్ని బాధించినన్
ఆరోగ్యంబు తొలంగినన్ మదినినిన్న శాంతమున్ గొల్చుచున్
శ్రీరామా యెటులో రచించితిఁగృపన్ జేకొమ్ము నీగ్రంథమున్

చం॥ సరళపదాన్వితన్ సుజన సన్నుతవృత్త, సువర్ణవిగ్రహన్
సరసగుణాలవాలఁగవి సంచయ లక్షిత లక్షణాఢ్య, సుం
దరగజయానఁ జారుతర నర్తన, భూషిత చంపకోత్పలో
త్కరఁగృతి కన్యకన్ కరుణఁ గల్గి గ్రహింపుము జానకీపతీ.

కం. అవధారు దేవ రామా,
కవి సన్నుతమైన నీదు కావ్యంబు సదా
శివ నుతమగు నీచరితం
బవనిన్ విలసిల్లుఁగాక యారాధితమై.

కం. సర్వాత్మక సర్వేశ్వర
సర్వాంతర్యామి సర్వ జగదాధారా!
శర్వాను రేంద్ర సన్నుత
సర్వజ్ఞా ! రామభద్ర జ్ఞాన సముద్రా.

కం. లోకైక ధీ విశాలా
శ్రీకంఠ ప్రణుతశీల రిపు లయకాలా
వైకుంఠ లోకపాలా
కేకీ కంఠాభనీల క్షితిజా లోలా!

చ. సనకసనందనాది ముని । చంద్రనిషేవిత సత్కథాసుధా
వనధిజ సద్యశః కుముద । బాంధు కరామృతధౌత సర్వది
గ్జనపదపత్తనస్థ జన । సన్నుతజీవన ! సర్వలోక పా
వన! సుజనావనా! యఖిల । పాప విమోచన! పద్మలోచనా!

—మంగళమహాశ్రీవృత్తము—

చిత్తజవిరోధివిధి । జిష్ణుసురసన్నుత వి । శేషగుణరత్నగణపేటీ
మత్తరిపుదైత్యకుల । మారణకళాకలిత । మంజులయశస్తురగధాటీ
కృత్తశివచాపరస । కృష్టకృశకర్ణయుగ । కృచ్ఛ్రియుతభార్గవ
జయశ్రీ, చిత్తనువిలాసముని । సేవిత పదాంబుజ! వి । శిష్టజన
మంగళమహాశ్రీ.

## —గద్యము—

ఇది శ్రీరామ పరంధామ కరుణాకటాక్ష సంప్రాప్త సహజ
కవితా ప్రాభవ—ఆంధ్ర ద్రావిడ సంఘ సముద్భవ
భాగవతుల సూరమాంబా సూర్యనారాయణ తనూభవ
శ్రీరామ భక్తి వైభవ భక్తజనవిధేయ నరసింహ
శర్మనామధేయ ప్రణీత శ్రీమదాంధ్ర తులసీ
రామాయణనామ్నాయ నిర్వచనమహాకావ్య
లంకాకాండంబు నందు సర్వము
సంపూర్ణము.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.
శ్రీరామచంద్ర పరబ్రహ్మార్పణమస్తు.
శ్రీరామస్సత్యపరాక్రమః.
సీతాయాశ్చరితం మహత్.
ఓం తత్సత్.